# విపుల

# చతుర







# 200

## సంచికలు వెలువడుతున్న సందర్భంగా

## కథలు , నవలలకు సాహిత్యపురస్కారాలు

# రు: 1,00,000/-

## బహుమతులు !!

# చతుర

తెలుగు పత్రికా చరిత్రలో ఒక వినూత్న ప్రయోగంగా, కేవలం నవలల ప్రచురణకే ప్రత్యేకించిన మాసపత్రికగా అవతరించింది చతుర.

ప్రచురించే నవలలన్నీ ఉత్తమాభిరుచులుగలవిగా ప్రశంసలనందుకున్న నవలా మాసపత్రిక 'చతుర'.

ఎందరో నూతన రచయితలకు, రచయిత్రులకు అవకాశమిచ్చి ఆ క్రమంలో వారు నవలా రచనా రంగంలో స్థిరప్రతిష్ఠులయేందుకు తోడ్పడింది చతుర.

1978 ఫిబ్రవరిలో ప్రారంభమై 1986 మే నెలలో 100వ సంచిక వెలువడిన సందర్భంగా పెద్దఎత్తున నవలల పోటీలు నిర్వహించి అక్షరాలా యాభైవేల రూపాయల బహుమతులు అందజేసింది చతుర.

1994 సెప్టెంబర్ సంచిక 200వ సంచికగా వెలువడుతూన్న సందర్భంగా మరోసారి సాహితీపరులను భారీగా సన్మానించదలచి నవలల పోటీలు ప్రకటిస్తోంది చతుర.

ఉత్తమ నవలలకు బహుమతులు:

| | |
|---|---|
| ప్రథమ బహుమతి | రు. **15,000/–** |
| ద్వితీయ బహుమతి | రు. **10,000/–** |
| తృతీయ బహుమతి | రు. **7,500/–** |
| రు. 5000/- చొప్పున అయిదు ప్రోత్సాహక బహుమతులు | రు.**25, 000/–** |

★ నవలల ఇతివృత్తం ఏ ప్రాంతంలో జరిగేదయినా, తెలుగువారి జీవితాలకు సంబంధించినదై ఉండాలి.

★ "చతుర" లో నవలలు అచ్చులో 100 పేజీలు దాకా ఉంటాయి. సాధారణంగా 36,000 పదాలున్న నవలలు 'చతుర'లో 100 పేజీలకు సరిపోతాయి. అందరూ అరఠావులమీదే రాస్తున్నా, రకరకాల దస్తూరీలవలన అచ్చులో హెచ్చుతగ్గులు వస్తుంటాయి. కనుక రాతప్రతిలో ఒకరి దస్తూరీలో, ఒక పేజీలో ఎన్ని పదాలు (వాక్యాలు, పేరాలు, లైన్లు లెక్కించే పద్ధతి కాదు) వస్తున్నాయనే దానిని బట్టి నవల 36,000 పదాలకు తక్కువ గాకుండా ఉండేలా జాగ్రత్తపడటం అవసరం.

★ నిడివి విషయంలో ప్రత్యేకంగా ఈ సూచనలను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కోసం రాసిన నవలలే పరిశీలనార్హాలవుతాయి. నవలసైజు కావలసిన దానికన్నా పెద్దదిగా ఉండవచ్చుగానీ, చిన్నదిగా మాత్రం ఉండరాదు.

★ బహుమతులు పొందని నవలల్లో అర్హమైనవ నుకున్నవాటిని సాధారణ ప్రచురణకు ఎన్ను కునే అవకాశం ఉంది.

★ నవలలను ప్రచురించే సమయంలో అవసరా న్ని బట్టి కుదించవలసివచ్చినా, సరిచేయవల సివచ్చినా, సంపాదకులాపనిచేయడానికి అభ్యంతరం లేనివారే పోటీలకు నవలలు పంపాలి.

★ నవల తొలిపేజీలోగానీ, మలిపేజీలోగానీ, మరెక్కడగానీ నవల పేరు తప్ప రచయి త/రచయిత్రి పేరు, చిరునామా ఏవీ ఉండ గూడదు. నవల పేరు, రచయిత/రచయిత్రి పేరు, పూర్తి చిరునామా విడిగా ఒక షీటుపై రాసి నవల తొలిపేజీకి ముందు పెట్టాలి. ఆ షీటులోనే నవల అనువాదంగాని, అనుసరణ గాని కాదనీ, గతంలో ఎక్కడా, ఏ రూపంలో నూ ప్రచురితం కాలేదనీ స్వీయరచనేననీ, మరో ప్రతి ఏ పత్రికలోనూ పరిశీలనలో లేదనీ హామీపత్రం కూడా రాయాలి.

★ బహుమతులకుగాని, సాధారణ ప్రచురణకు గాని ఎన్నికగాని నవలలను త్రిప్పి పంపేందుకు తగుపోస్టేజిని నవలతోపాటే జతపరచాలి. అలా కానిపక్షంలోనూ, నవల లు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత పోస్టేజి పంపు తూ, ఉత్తరాలు రాయటంవలన ప్రయోజనం ఉండదు.

★ బహుమతుల నిర్ణయం, ఇత్యాది విషయాల న్నింటిలోనూ, న్యాయనిర్ణేతలు, సంపాదకుల దే తుదినిర్ణయం. ఈ విషయంలో ఎలాంటి వాదవివాదాలకు, ఉత్తర ప్రత్యుత్తరాలకు అవ కాశం లేదు. గడువుతేదీ ముగిశాక మాకు అందే నవలలు పోటీకి పరిశీలింపబడవు.

★ ***నవలలు మాకు చేరవలసిన ఆఖరుతేదీ 31 అక్టోబర్ 1994.***

ఎడిటర్

చతుర

ఈనాడు కాంప్లెక్స్,

హైదరాబాద్-500 482.

# విపుల

మరే భారతీయ భాషా పత్రికారంగంలోనూ లేని విశిష్ట ప్రయోగం "విపుల"

పూర్తిగా కథాసాహిత్యానికే అంకితమైన ఏకైక పత్రిక "విపుల"

తెలుగు కథలతోపాటు వివిధ భారతీయ భాషలు, విదేశ భాషలనుండి ఎన్నిక చేసిన ఉత్తమ కథలకు వేదిక "విపుల"

"ఏ భాషకు, సంస్కృతికి చెందిన కథనయినా ఆసక్తిగా చదివింపజేసే అనువాదాలతో పాఠకులకు విశ్వసాహిత్యాన్ని పరిచయం చేస్తున్న ప్రయోగ శీలి "విపుల"

1978 ఫిబ్రవరిలో ప్రారంభమై, 1986 మే నెలలో 100వ సంచిక వెలువడిన సందర్భంగా తొలిసారిగా భారీ బహుమతులతో 16 భారతీయ భాషల కథలకూ పోటీలు నిర్వహించింది "విపుల"

1994 సెప్టెంబరులో 200వ సంచిక వెలువడుతున్న సందర్భంగా మరలా కథల పోటీలు నిర్వహిస్తూ ఈసారి ప్రత్యేకంగా ఉత్తమ తెలుగు కథలకు విలువైన బహుమతులు ప్రకటిస్తోంది "విపుల"

ప్రథమ బహుమతి... రు. **7,500/–**
ద్వితీయ బహుమతి... రు. **5,000/–**
తృతీయ బహుమతి... రు. **3,000/–**

రు. 1500/- చొప్పున
18 ప్రోత్సాహక బహుమతులు...
రు. **27,000/–**

ఇతివృత్తం విషయంలో పరిమితులు లేవు. తెలుగువారి జీవితానికి సంబంధించినదయి ఉండి, ఆసక్తికరంగా చదివించే, ఆలోచింపజేసే, నూతన ప్రయోగాలతో ఆకట్టుకునే కథలకు ప్రత్యేక ప్రాధాన్యత!

★ అనువాదాలు, అనుసరణలు పంపనవసరం లేదు.

★ కథల నిడివి విషయంలో పరిమితులు లేవు. కథనంలో నైపుణ్యతే ప్రధానం.

★ కథల వ్రాతప్రతులలో మొదటి పేజీనుండి చివరి పేజీవరకూ ఎక్కడా రచయిత/రచయిత్రి పేరుగాని, చిరునామాగాని రాయకూడదు. మొదటిపేజీలో కథ పేరు మాత్రమే రాయాలి. విడిగా మరో షీటుమీద కథ పేరు, రచయిత/రచయిత్రి పేరు, పూర్తి చిరునామా, కథ స్వంతమే అనువాదంగాని, అనుసరణగాని, కాపీ కాదనీ, అముద్రితమనీ హామీ రాసి కథకు జతపరచాలి. ఆ కథ మరే పత్రికకూ పరిశీలనార్థం పంపి ఉండకూడదు.

★ బహుమతి పొందని, సాధారణ ప్రచురణకు ఎన్నిక గాని కథలను త్రిప్పి పంపేందుకు స్వంత చిరునామా రాసి తగినన్ని స్టాంపులు అతికించిన కవరు జతపరచాలి.

★ కలం పేరు ఉపయోగించినా, పూర్తిపేరు కూడా తెలియజేయాలి.

★ ఉత్తమ కథల ఎన్నిక, బహుమతుల నిర్ణయం విషయాలన్నింటా న్యాయనిర్ణేతలు, సంపాదకులదే తుదినిర్ణయం. ఈ విషయంలో ఎలాంటి చర్చకు, ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

★ కవరుమీద "కథల పోటీకి" అని ప్రత్యేకంగా పేర్కొనాలి.

★ ***రచనలు మాకు చేరవలసిన ఆఖరుతేదీ 15 అక్టోబర్ 1994.***

ఎడిటర్

**విపుల**

ఈనాడు కాంప్లెక్స్,

హైదరాబాద్-500 482.

# చతుర ప్రపంచం

## గద్దకు రాచమర్యాదలు

ఆస్ట్రేలియాలోని సౌత్ మెలబోర్న్ జిల్లాలో బ్రియాన్‌కార్టర్ అనే ఆసామికి 15 చదరపు కి.మీ.ల ఖాళీస్థలం ఉంది. దాన్ని ఓ అందమైన ఉద్యానవనంలా రూపొందించాలంటే చాలామంది పనివాళ్ళు కావాలి. బద్ధకస్తులైన ఆ ఊరివాళ్ళను అతడు ఏవిధంగానూ ప్రేరేపించలేకపోయాడు. అక్కడక్కడ ఒకటీ రెండూ వృక్షాలతో ఉన్న ఆ ప్రాంతాన్నే ఓ పార్క్‌గా భావించి అప్పుడప్పుడూ జనం వచ్చిపోతూ ఉంటారు.

1975లో ఓసారి కార్టర్ బిజినెస్ ట్రిప్‌మీద వెళ్ళాడు. అతడు తిరిగివచ్చేసరికి తోటమాలి అందించిన ఓ వింతవార్త శుభవార్తలా తోచిందతనికి. తోటలో ఓ పెద్ద చెట్టుమీద భీకరాకారంలో ఉన్న ఆకుపచ్చ గద్ద ఒకటి వచ్చి వాలింది. అది రెండురోజులనుంచీ కదలక మెదలక అలాగే చెట్టుమీద ఉందని చెప్పాడు మాలి. మొదట దాన్ని చూడగానే కార్టర్ కూడా చాలా భయపడ్డాడు. అంత భయంలోనూ అతనికో చక్కని ఆలోచన తట్టింది. గర్వానికీ, స్వేచ్ఛకీ ప్రతీకగా, ఎవరికీ పట్టనట్టు నిల్చున్న ఆ పక్షిని చూసి జనాలు ఆకర్షితులవుతారని, దానివల్ల ఆ ప్రాంతం ఓ పర్యాటక ప్రాంతంలా అభివృద్ధి చెందే అవకాశం ఉందనీ తలపోశాడు. దాంతో అది తిరిగి వెళ్ళిపోకుండా తాజా కుందేలు కాళ్ళు వగైరా రుచికరమైన మాంసాహార పదార్థాలను ఆహారంగా పెట్టి దాన్ని అపురూపంగా చూడసాగాడు. ఓ శుభముహూర్తాన దానికి శ్యామ్ అని పేరుపెట్టాడు.

అన్నీ శుభ్రంగా ఆరగిస్తున్నా శ్యామ్‌కి తోటలో మిగతా పక్షులంటే పడదు. క్రమేపీ ఆ తోట ఓ పబ్లిక్ పార్క్‌లా తయారయి ఎంతో మంది జనం రోజూ శ్యామ్‌ని చూడ్డానికి వచ్చేవారు. వచ్చినప్పటినుంచీ అది ఏ చెట్టు మీద వాలిందో అక్కడే వుందిగానీ, మరో




చెట్టుకి మకాం మార్చలేదు. పక్షుల నిపుణులు కొంతమంది పరిశీలించి అది చిన్నతనంలో చాలాకాలం ఇక్కడున్నట్టు, మళ్ళీ ఇప్పుడు ఈ ప్రాంతాన్ని వెతుక్కుంటూ వచ్చినట్టు తేల్చారు.

క్రమంగా అదో అద్భుత వింతగా ఎంతో మంది సందర్శకులని ఆకర్షించడం మొదలెట్టింది శ్యామ్. అక్కడికి వచ్చే కాలేజీ విద్యార్థినీ విద్యార్థులందరూ ఆ పక్షిని చూసి ఆ

ప్రాంతంలో ఓ రెండు మొక్కలు నాటి వెళ్ళ-డం ప్రారంభించారు. రెండేళ్ళలో కార్టర్ భూమి అంతా మొక్కలతో పచ్చదనాన్ని సంతరించుకుంది.

1979, 15 అక్టోబరును శ్యామ్ జన్మది నంగా ప్రకటించాడు కార్టర్. ఎందుకంటే అది శ్యామ్ ఆ పార్క్‌కి వచ్చి నివశించడం ప్రారంభించిన రోజు. 1976 అక్టోబర్‌లో శ్యామ్ చేసిన ఓ అల్లరి పనివల్ల కొంతమంది దాన్ని తిట్టుకోడం ప్రారంభించారు. సందర్శకులతో పాటు వచ్చిన ఓ చిన్న కుక్కపిల్లను కాళ్ళతో ఎత్తి గాల్లోకి విసిరేసింది శ్యామ్. దాంతో కుక్క యజమాని కోర్టులో కేసుపెట్టి సదరు గద్దను కాల్చిపారేయాలని కోర్టువారిని కోరాడు. కానీ వందలాది శ్యామ్ అభిమానులు కోర్టువారికి ఆ పక్షిని విడిచిపెట్టవలసిందని వినతిపత్రం సమర్పించడంతో కోర్టు శ్యామ్‌ని క్షమించి వదిలేసింది.

రెండేళ్ళు గడిచినా శ్యామ్ తనకోసం ఓ జోడీని వెతుక్కోలేకపోయింది. సరిగ్గా దాని 4వ పుట్టినరోజుకు రెండు వారాలముందు శ్యామ్ హఠాత్తుగా మాయమయింది. ఊరి ప్రజలందరూ కూడా దానికోసం చాలా వెతికారు. దాని జన్మదినంనాటికైనా వచ్చితీరుతుందని ఆశగా ఎదురుచూస్తున్న కార్టర్‌కు, శ్యామ్ ఓ కారుకు గుద్దుకుని మరణించినట్టు ఫోనుకాల్ వచ్చింది. ఓ టి.వి. డైరెక్టర్ కూడా ఫోనుచేసి రేపు శ్యామ్‌మీద ఓ ప్రోగ్రాం తీద్దామనుకుంటున్నామన్నాడు. కార్టర్ శ్యామ్‌మీద హృదయవిదారకంగా ఓ పద్యంరాసి రేడియోలో చదివాడు. శ్యామ్ సమాచారంకోసం వచ్చే ఫోనుకాల్స్‌తో కార్టర్ క్వార్టర్ ప్రతిధ్వనించింది. ఆ ఊరి స్కూలు విద్యార్థులందరూ కలిసి శ్యామ్‌కి ఆ తోటలోనే ఓ సమాధిని కళాత్మకంగా నిర్మించి దాన్ని అందులో పాతిపెట్టారు.

మృతకళేబరాలను పీక్కుతినే ఓ గద్దకు అలా కన్నీటివీడ్కోలుతో అంత్యక్రియలు జరగడం అదే ప్రథమం అన్నారు చాలామంది.

## ఫొటోగ్రఫీ పుట్టుక

చరిత్రకారుల కథనం ప్రకారం 11వ శతాబ్దంలో ఫొటోగ్రఫీకి అంకురార్పణ జరిగింది. కానీ 16వ శతాబ్దంవరకు ఇది సత్ఫలితాలనివ్వలేకపోయింది. 1558లో జియోవానీ అనే అతను మొట్టమొదట కెమేరాపై పుస్తకం రాశాడు. 1568లో డేనియల్ బార్బరో అనే అతను మొదటిసారిగా కెమేరాను రూపొందించాడు. కానీ అందులో 10 శాతం మాత్రమే ఫలితాన్ని సాధించాడు. అటుపైన 248 సంవత్సరాలపాటు కెమేరా నిర్మాణంపై అనేకానేక ప్రయత్నాలు జరిగాయి. చిట్టచివరికి 1816లో ఫ్రాన్స్‌కు చెందిన నిబోర్‌నిపాస్ ఓ చక్కని కెమేరాని రూపొందించి ఆ కళకి ఫొటోగ్రఫీ అని పేరెట్టాడు. అటుపైన నైట్రేట్ ఫిల్మ్ సహాయంతో ఇందులో ఎన్నో అభివృద్ధికరమైన మార్పులు కూడా జరిగాయి. చివరిగా డాగ్రీ అనే ఆసామి తీసిన ఫొటోలు అద్భుతంగా ఉన్నాయంటూ ప్రశంసలు వచ్చాయి. అయితే డాగ్రీ పద్ధతి ప్రకారం ఒక చిత్రంనుంచి వేరొక చిత్రాన్ని అతి సహజంగా ఎలా తీయవచ్చు అన్నదిమాత్రమే అవగాహనకి వస్తుంది. అటుపైన 1841లో ఇంగ్లండుకు చెందిన ఫాక్స్ డాల్‌పోర్ట్ అనే ఆయన కావాల్సినన్ని కాపీలను తయారుచేసుకుందుకు వీలుగా పాజిటివ్ నెగిటివ్‌ల పద్ధతిని కనిపెట్టాడు. 1844లో ప్రకృతి సౌందర్యాన్నంతటినీ తన కెమేరాలో బంధిస్తూ ఒక ఆల్బమ్‌ను విడుదలచేశాడు. తరువాత 1845లో ఈ ఫొటోగ్రఫీ డాగ్రీ, డాల్‌పోర్ట్‌ల సంయుక్త కృషితో మరిన్ని అందాల్ని సంతరించుకుంది.

1870 వరకూ కూడా ఫొటోగ్రఫీ పురాతన స్థితిలోనే ఉంది. అప్పట్లో ఓ మనిషికి ఫొటో తియ్యాలంటే రెండు గంటలు పట్టేది. మనిషిలో ఎలాంటి కదలికలు లేకుండా ఉండటంకోసం అతని తలను ఓ బోర్డ్‌కి బంధించేవా

రు అప్పట్లో.

అప్పటివరకూ ఫొటోగ్రఫీలో గాజుపలకల నే వాడేవారు. 1884 ప్రాంతంలో జార్జ్ ఈస్ట్ మన్ అనే ఆయన రోల్ ఫిల్మ్‌ను రూపొందించి, ఫొటోగ్రఫీకి మరో కొత్తకోణాన్నిచ్చాడు.

1888లో మొట్టమొదటిసారిగా కొడక్ కంపె




నీవాళ్ళు బాక్స్ కెమేరాను తయారుచేసి మార్కెట్‌లోకి విడుదల చేశారు. ఇది కొన డంకోసం ప్రజలు క్యూలు కట్టి నిలబడేవారు. ఇందులో 120 ఎమ్.ఎమ్. ఫిల్మ్ మాత్రమే సరిపోయేది.

1920 నాటికి మొదటిసారిగా కంపెనీ 35 ఎమ్.ఎమ్. కెమేరాను రూపొందించి మార్కె ట్‌లోకి పంపింది. 1924 నాటికి ఈ కెమేరా ప్రపంచ ప్రజల ప్రశంసలనందుకుంది.

1947లో ఇంగ్లండుకు చెందిన ఎడ్విన్ కెంట్ అనే ఆసామి బ్లాక్ అండ్ వైట్ ఇన్‌స్టెంట్ కెమేరాను రూపొందించాడు. ఫొటో తీసిన 60 సెకండ్లలో ఈయన బ్లాక్ అండ్ వైట్లలో ప్రింట్స్ వేసి ఇచ్చేవాడు. 1955లో డేవిడ్ విట్స్ కంపెనీ 3-డి కెమేరాను నిర్మించింది. 1963లో కలర్ ప్రింట్లు ఇచ్చే కలర్‌పోలరాయిడ్ కెమేరా రూపొందింది. ఫొటో తీసిన 50 సెకండ్లలో కలర్ ప్రింట్లు ఇవ్వగలిగింది ఈ కెమేరా.

1963నుంచి 87 వరకు ఫొటోగ్రఫీలో విప్లవా త్మకమైన మార్పులు జరిగి ఫిల్మ్ లేని ఎలెక్ట్రా నిక్ కెమేరాలు కలర్ ప్రింట్లయొక్క ఎలక్ట్రానిక్ పిక్చర్లనివ్వడం ప్రారంభించాయి.

స్పేస్ కెమేరాలు కూడా పెద్ద ఎత్తున అభివృద్ధి చెందాయి. ఇప్పుడు అత్యంత ఆధు నిక కెమేరాలతో సుదూరంగా ఉన్న నక్షత్రాల ను, గ్రహాలను కూడా నిమిషాల్లో ఫొటోతీయగ లుగుతున్నారు.

ముఖ్యంగా ప్రపంచ జనాభాలో 12 శాతం మంది ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఫొటోగ్ర ఫీలో పాలుపంచుకుంటున్నట్లు తెలుస్తోంది.

## పక్షుల విహారయాత్రలు

ఆర్కిటిక్ టెర్మ్ పక్షులు గుడ్లు పెట్టే సీజన్‌లో వేలాది మైళ్ళు ప్రయాణం చేసు కుంటూ దక్షిణ ధృవంనుంచి ఉత్తర ధృవానికి వచ్చి వాలతాయి. సీతాకాలం ప్రారంభంకాగా నే తిరిగి దక్షిణ ధృవంలో ఎక్కడినుంచి బయలుదేరాయో అదేస్థానానికి వచ్చి వాల తాయి. ఇవి ఎగిరే విధానం ఎంత క్రమబ ద్ధంగా చూడముచ్చటగా వుంటుందంటే జెట్ పైలెట్స్ కూడా తమ విమానం నడపడంలో కొన్ని మెళకువలను దీన్ని చూసి నేర్చుకోవ చ్చు. కంప్యూటర్స్ లేదా మరే ఇతర సాధనాల సహాయమో తీసుకుని విమానాలను నడుపుతా రు పైలట్లు. కానీ ఆర్కిటిక్‌పక్షి మాత్రం వెంట ఎవరూ తోడు కూడా లేకుండా వేలాదిమైళ్ళు నిశ్చింతగా ప్రయాణం చేస్తుంది.

కియాస్ అనే న్యూజిలాండ్‌కి చెందిన పెద్ద సైజు ఆకుపచ్చ పక్షులు హిమాలయ శిఖరాలకు పైన 26000అడుగుల ఎత్తుదాకా ఎగరగలవు. మరి కొన్ని జాతుల చిన్న సైజు పక్షులు అట్లాంటిక్ సముద్రం మీదుగా అలల తాకిడికి తట్టుకుంటూ ఎగురుతూ సుదూర ప్రాంతాలకు ప్రయాణం చేస్తాయి.

అసలు ఈ పక్షులు వేలాది మైళ్ళు ప్రయాణించి తిరిగి తమ స్థావరాలకు అంత ఖచ్చితంగా ఎలా చేరగలుగుతాయి అన్నది విజ్ఞాన




వేత్తలకు ఓ ప్రశ్నగా మిగిలింది. ఈ విషయంలో ఎన్నో పరిశోధనలు కూడా జరిగాయి. తేనెటీగలు, డాల్ఫిన్‌లకు మల్లే వీటికి కూడా మెదడులో ఓ అయస్కాంత పదార్థం వుంటుందని, దాన్నిబట్టి ఇవి తేలిగ్గా ఉత్తర దక్షిణ ధృవాలకి దారితప్పకుండా వెళ్ళిరాగలుగుతున్నాయని కొందరి అంచనా.

ఈ ఆర్కిటిక్ పక్షులు రాత్రివేళ ప్రయాణాన్ని నక్షత్రాల వెలుగులో కొనసాగిస్తాయి. సైంటిస్ట్‌లు వీటి గమనంపై అనేక రకాలుగా పరిశోధనలు జరుపుతున్నారు. ఈ పక్షులు 6,000 మైళ్ళ ప్రయాణాన్ని 17 రోజులలో పూర్తిచేస్తాయని తెలుస్తోంది. ఒక మనిషిని ఓ అడవిలోనో, ఎడారిలోనో వదిలిపెడితే అతడు తిరిగి తిరిగి మళ్ళీ మధ్యకే రాగలడేమో గానీ అక్కడి నుంచి బయటపడడం అంత సులభం కాదని, అదే ఆర్కిటిక్ పక్షి అయితే అరసెకన్‌లో బయటపడుతుందంటున్నారు మేధావులు. అంతే కాదు ఈ పక్షులనుంచి నేర్చుకోవలసింది కూడా చాలా వుందిట మరి.

## వింత కిడ్నాపులు

తప్పిపోయిన పిల్లలు, వృద్ధుల గురించి అప్పుడప్పుడు మనం రేడియోల్లోను, టి.వి.ల్లోనూ ప్రకటనలు వింటూనే వుంటాము. అయితే వాళ్ళలో ఎంతమంది తిరిగివచ్చారో, ఎంత మంది అయిపులేకుండా పోయారో తెలియడంలేదు.

అమెరికాలోని 'లాస్ ఏంజిల్స్'లో 'ది రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మిస్సింగ్ పీపుల్' అన్న సంస్థ తప్పిపోయిన వారిమీద కూలంకషంగా పరిశోధనలు జరుపుతోంది. ఎంతో మంది తప్పిపోయిన పిల్లలను వాళ్ల తల్లి తండ్రులతో కలిపారు. ఈ ఇన్‌స్టిట్యూట్‌కి చెందిన రీసెర్చ్ స్కాలర్స్ కొందరు ఈ కిడ్నాపులకి కారణం గ్రహాంతరజీవులు కూడా కావచ్చని ఆ దిశగా పరిశోధన ప్రారంభించారు. వాళ్ల పరిశోధనలో తేలిందేమంటే ఈ కిడ్నాప్‌లలో 80 శాతం పని గ్రహాంతరజీవుల దేనని. అంతేకాకుండా ఈ గ్రహాంతరవాసులు కేవలం మేధోవంతులు, కష్టపడి పనిచేసే శ్రామికుల్ని, సైంటిస్ట్‌ల్నీ మాత్రమే ఎత్తుకుపోతున్నట్టు కనుగొన్నారు.

అనాదిగా జరుగుతున్న ఈ కిడ్నాపుల

చరిత్రను తిరగతోడితే మొట్టమొదటి కిడ్నాప్ 1655లో గోవాలోని మపుకా గ్రామంలో జరిగిందని తెలుస్తోంది. శామ్‌పెడ్రో అనే వ్యాపారి చేసిన ఓ నేరానికి అత్యంత కఠినమైన శిక్ష విధించడం జరిగింది. ఆ రోజుల్లో కొన్ని నేరాలకు శిక్షలు అతిక్రూరంగా వుండేవి. అతడు చేసిన నేరానికి వేడినూనెలో అతణ్ణి అరగంటసేపు వుంచాలి. దానికోసం అతణ్ణి శిక్షాస్థానానికి తీసుకెడుతుండగా హటాత్తుగా అతడు అందరూ చూస్తుండగా ఆకాశంలోకి ఎగిరిపోయాడు. మళ్లీ అతడి జాడలేదు. దాంతో గ్రహాంతరజీవులు అతడిని కిడ్నాప్ చేసివుండ




వచ్చని భావించారు పరిశోధకులు.

1851 జూన్ 3వ తేదీన పోర్చుగల్‌లో మరో సంఘటన జరిగింది. మేరీ అనే క్రైస్తవ బ్రహ్మచారిణి చర్చిలో అందరిముందూ తాను సౌత్ అమెరికా అడవుల్లోకి ఎగిరి వెళ్లి అక్కడ కొన్నాళ్లుండి తిరిగివచ్చానని చెప్పింది. ఆమె మాటలు ఎవరూ నమ్మలేదు. కానీ ఆమె కొన్ని దృష్టాంతాలు చూపించిన పిదప కొంత పరిశోధన జరిపాక ఎటువంటి ఆధారం లేకుండా ఆమె గాల్లో ఎగురుకుంటూ సదరు అడవుల్లోకి వెళ్లినమాట నిజమని తేల్చారు. అది అలా ఎందుకు జరిగిందీ అన్న విషయాన్ని పరిశోధించడానికి బదులు, ఆమె తాంత్రిక విద్యలు ప్రదర్శిస్తోందనీ, అది నేరమనీ ఆమెను సజీవ దహనం గావించారు ఆ చర్చి అధికారులు.

1953 సెప్టెంబర్ మొదటివారంలో డిక్సన్ అనే 41 ఏళ్ల వ్యాపారి హటాత్తుగా కన్పించకుండాపోయాడు. అటుపైన ఆరునెలలకు అతను మనీలాలో పునర్దర్శనమిచ్చాడు. అతను కూడా "తనని ఏదో అదృశ్యశక్తి మెక్సికోనుంచి తీసుకెళ్లి మనీలాలో దింపింది. కానీ ఈ ఆరునెలలూ నాకు ఆరు సెకండ్లలా అనిపించింది'' అన్నాడు.

1678లో అమెరికాలో ఫిలడల్ఫియాలో మరో కిడ్నాప్ సంఘటన కూడా ఇలాంటి ఆశ్చర్యకరమైనదే. ఒక వ్యక్తిపై హైకోర్ట్‌లో నేరవిచారణ జరుగుతున్న సమయంలో ఆకాశంనుంచి ఇద్దరు స్త్రీలు వచ్చి అతనిని కోర్టునుంచి ఆకాశంలోకి తీసుకుపోయినట్లు సాక్ష్యాలు లభించాయి. అటుపైన అతని జాడలేం లేవు. 1845లో మానెక్స్‌కి చెందిన ఓ స్త్రీ తన కూతుళ్లిద్దరినీ ఎవరో పైనుంచి దిగివచ్చి ఆకాశంవైపు తీసుకుపోయారని, అది తాను కళ్లారా చూశానని భోరుమంది. అటుపైన ఆ పిల్లల జాడలేదు. మార్చి 1883లో జెస్సీమిస్సర్ అనే ఆసామి 13 ఏళ్ల వయసుగల కూతురితో రోడ్డుమీద నడిచి వెడుతుంటే అకస్మాత్తుగా సుడిగాలి వీచడం, ఇద్దరూ ఆకాశంలోకి ఎగిరిపోవడం జరిగింది. 500 మైళ్లు అలా ప్రయాణించాక యార్కర్ అనే పేరుగల గ్రామంలో తండ్రి పడిపోవడం, కూతురు మాత్రం ఏమైందీ తెలియకపోవడం జరిగింది.

ఆధునిక విజ్ఞానశాస్త్రం వీటికి ఎలాంటి సమాధానం ఇవ్వలేకపోతోంది. ఇలా జరిగిన కిడ్నాప్‌లలో అతికొద్దిమంది మాత్రమే వెనక్కు రాగలిగారు. 'ది ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మిస్సింగ్ పీపుల్ రీసెర్చ్' ఈ విషయంమీద తీవ్ర పరిశోధనలు కొనసాగిస్తోంది.

# చతుర

సంపుటి: 17
సంచిక: 8
సెప్టెంబర్ 1994



అతడి జీవితం ఓ పచ్చనిపైరు. అతడి సమయమంతా గడిచేదే చేనులో. అహరహం అతడి శ్రమజలంతో సస్యశ్యామలమయిన భూమి బంగారపు పంటనే ప్రతిఫలంగా అందిస్తోందతనికి.

ప్రకృతి అతణ్ణి అన్నివిధాలా ఆదుకుంటూనే వుంది. కష్టం ఫలిస్తూనే వుంది. అయినా... అతని శ్రమని, సహనాన్ని, సంయమనాన్ని... చివరికి మానవత్వాన్ని సైతం కర్కశంగా కాలరాచి, పండిన పంటను దోచుకుని, పచ్చని అతని జీవితంలో నిప్పులుపోసి పైశాచిక నృత్యం చేసిన దుష్టశక్తులేవి? ఆ స్వార్థపరుల నగ్నరూపాలకి నిలువెత్తు అద్దం పట్టిన మొలకలపల్లి కోటేశ్వరరావు రచన ఆక్రందన ఈ నెల చతుర సమగ్ర నవల.

# ఆక్రందన

## — మొలకలపల్లి కోటేశ్వరరావు

"ఏంది అంజియ్యా మామా, మారెమ్మ దిబ్బ కాడ మందులోళ్ళు సినిమా ఏస్తంటే సు వ్వింకా ఇంటికాడ వుండావేంది..." సాయంత్రంవేళ గోచీగుడ్డ పెట్టుకుని బజారులో నీళ్ళు పోసుకుంటున్న అంజయ్యను ఆ దారినే పోతున్న రామస్వామి అడిగాడు.

"ఏం సినిమాలేరా? కూలీలకోసం తిరిగొచ్చే సరికి ఈయాలైంది. పగలల్లా పన్జేసి సినిమా లేం చూస్తాం?"

"అబ్బ... ఊరకేసే సినిమాలన్నా చూడక ఏంది అంజియ్యా మామా, మనమేమన్నా డబ్బులిస్తున్నామా? పత్తి తోటలకి యేసే మందుల్ని గురించంట సినిమా. ఇది చూస్తే మనకి మందుల్ని గురించయినా తెలుసుద్ది గా!"

'వాళ్ళు మా కంపెనీ మందులేసుకొమ్మని సూపిత్తారు. అంతేగా?"

"అంతే అనుకో..." అంటూ రామస్వామి కదిలాడు.

"ఉండ్రా... నేను కూడా వస్తన్నా, అటేగా దడి దగ్గరికి పోయేది'' అన్నాడు అంజయ్య.

అంజయ్య అన్నం తిన్నంతసేపూ వుంటే, ఆ తరువాత తనకీ ఓ పుగాకు కాడ ఇస్తాడని రామస్వామి ఆగాడు.

"పత్తి యట్ట పగిలింది'' అడిగాడు రామ స్వామి.

"పగలటానికేంరా, తెగ పగిలింది. ఊరంతా తిరిగినా ఇద్దరు కూలీలు దొరకలేద నుకో' మాటల్లోనే అంజయ్య ఒళ్ళు తుడుచు కుని, పంచె కట్టుకుని, బిందె తీసుకుని ఇంట్లోకి వచ్చాడు.

అనుసరించాడు రామస్వామి.

"ఏమే, అన్నం పెడుదువు రావే!" అంటూ భార్యని పిలిచాడు.

తొట్టి దగ్గర అంట్లు తోముకుంటున్న అంజ య్య భార్య రాజమ్మ చేతులు కడుక్కుని



పవిట చెంగుకి తుడుచుకుంటూ ఇంట్లోకి వచ్చింది.

"అన్నపూర్ణా... మీ బాబుకి అన్నం పెట్టకూ డదంటే?" అంది రాజమ్మ మంచంమీద పడు కుని కథల పుస్తకం చదువుకుంటున్న కూతు రుతో.

"ఏమో పో, నాకు తెలియదు''

"ఇంత చిన్న పనులు కూడా చేసుకోకపోతే యట్టే?"

ఆ అమ్మాయి పుస్తకంలో మునిగిపోయి తల్లి మాటల్ని చెవిలోనికి దూరనివ్వలేదు.

"ఏం కూరే ఇయ్యాల?" పీట వాల్చుకుని కూర్చుంటూ అంజయ్య భార్యని అడిగాడు.

"పప్పు చారు కాశా ఈ పూట. రేపొద్దున మంగలి లచ్చుమ్మ వస్తానంది పత్తికి. నీకు కూలోళ్ళు దొరకలేదుగా?"

"ఊరంతా తిరిగానే! మాకు పోయినకాడ వుందంటే, మాకు పోయినకాడ ఉందంటున్నా రు. కూలీలు అసలు దొరికిచావటంలేదు. అందరికీ పత్తి పగిలిందాయె!"

"ఎట్టా మరి ఇప్పుడు? చేలేమొ తెగ పగిలే! కనీసం పదిమంది వుంటేకానీ పని జరగదు''

"ముటాలు తెచ్చుకోకపోతే లాభంలేదు రా జమ్మప్పా! ఇంక మనూళ్ళో జనం దొరకరు. జనంకోసం పాలేలోళ్ళు కూడా ఎగబడతన్నా రు. చాలామంది పాలేలు పోతన్నారు''

"చేసేదేం వుంది? ముటాకోసం పరమటికి పోయి రావాల్సిందే'' అంది రాజమ్మ.

"పోయిరా అంజియ్యామామా ముటా కోసం. మాక్కూడా నీ ముటాలో ముగ్గుర్ని చూడు''

"ముందు మా యవారం కానీయిరా నాయ నా!"

"నిరుడు మనకొచ్చిన వాళ్ళకి ఉత్తరమన్నా రాస్తే బాగుండేది. వాళ్ళు ఏదో ఒక వూరు పోకుండా ఇంకా ఎందుకు వుంటారు? ఊళ్ళో కూలోళ్ళది మరీ ఇడ్డూరంగా ఉంది. ఇయ్యాల ఏడ్రూపాయలంటన్నారు కూలి'' అంది రాజ మ్మ.

"ఎర్రపొద్దుపాయలన్నా వాళ్ళు ఏ జాముక ప్పా చేలోకి వచ్చేది? పొద్దు నడినెత్తిమీదకు రావాల్సిందే! మళ్ళీ పొద్దు తిరిగీ తిరక్క ముందే బయల్దేరతారు. ఊళ్ళో కూలోళ్ళని పిలవడం అంతా దండగే అనుకో!"

"ముమ్మరమప్పుడు ఊళ్ళో కూలోళ్ళది అడ్డగోలు యవారమేరా రామసామీ! రేపు మాపట్లో పోయొస్తా ముటాకోసం. తరవాతైనా తప్పదుగా!" అన్నాడు అంజయ్య.

అన్నం తిన్న తరువాత అంజయ్య కట్టలో నించి పొగాకు తీసుకుంటూ రామస్వామికి కూడా రెండు కాడలు ఇచ్చాడు.

ఇద్దరూ మంచంమీద కూర్చుని చుట్టలు చుట్టుకున్నారు.

"ఇప్పటికి పత్తి ఎన్ని కింటాల్లు తీసార బ్బాయి?" రాజమ్మ అడిగింది.

"మాకు పెద్దగా రాలేదప్పా పత్తి. ఎనకచి క్కి నాటాం ఇయ్యేడు ఇత్తులు"

అంజయ్య లాంతరు ముట్టించుకుని దుప్పటి తీసుకుని బయలుదేరాడు. రామస్వామి కూడా వెంట వెళ్ళాడు.

"రైతుసోదరులారా రండి, చూడండి! మీ పత్తిపంటలకి సంబంధించిన సినిమాని టాటా కంపెనీవారు ప్రదర్శిస్తున్నారు. రండి, చూడండి. మీ పత్తిపంటలకి వచ్చే పురుగులూ, తెగుళ్ళూ వాటిని అరికట్టే విధానం తెలుసుకోండి'' అంటూ మైకులో ఆ కంపెనీవాళ్ళు సినిమాకు సంబంధించిన ప్రచారం చేస్తున్నారు.

కొద్దిసేపు నిలబడి గొడ్ల దగ్గరికి వెళ్దామనుకున్న అంజయ్య సినిమా అయిపోయేవరకూ ఉన్నాడు.

"ఎల్తన్నారా రామసామీ, గొడ్లుకి సందకాడ యేసిన మేత, అయ్యి లాగులాడతంటాయి మేకుల దగ్గర్నించి'' అంటూ అంజయ్య దడిదగ్గరికి పోయాడు.

★ ★ ★

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు.

ఉత్తరప్పాలెం దారినిండా జనం.

పదిహేడుమంది వున్న ఆ ముటా పత్తి తీయడానికి పోతున్నారు. అచ్చయ్య వాళ్ళకి మేస్త్రీ.

మాట్లాడుకుంటూ, గోలగోలగా అరుచుకుంటూ వాళ్ళు ఆ దారిన పోతున్నారు.

అంజయ్య దడి బాటపక్కనే ఉంటుంది.

"ఏందే బాబా... బాగున్నావంటే?" బరిగొడ్లూ, దున్నలూ దగ్గిరవంగి పేడకళ్ళు తీసుకుంటున్న అంజయ్యని దారిన పోతున్న అచ్చయ్య పలకరించాడు.

"ఓరీ, నువ్వాంట్రా అచ్చిగా... ఎవురికి ఇయ్యేడు మీ ముటా?"

"బాపయ్య కాపుకేనే!"

"ఇట్రారా అచ్చియ్యా మాటుంది, ఇప్పుడే పోదువు!"

"ముందోల్లు పోతున్నారు'' అంటూ అచ్చయ్యదగ్గరికి వచ్చాడు.

"మాకు పత్తి కూలీల ముటా కావాలిరా. మీ వూరుకల్లిపోతే మాకేమన్నా మడుసులు దొరుకుతారూ?"

"దొరకడం గడ్డేనే అంజియ్యబాబా! అక్కడ గూడా పన్లు మస్తుగానే దొరుకుతుండాయి. మా ముటా మడుసుల్ని పోగేసుకోవటానికే నేను నానా తంటాలు పడ్డా!"

"మరి ముటా మడుసులకి ఎటు పొమ్మంటావు?" అంజయ్య సలహా అడిగాడు.

"మా వూరికి ఇంకా పైకి మార్కాపురమో, గిద్దలూరుకల్లో పోతే ఏమన్నా దొరుకుతారేమో!"

"అటు పోతే గట్టిగా దొరుకుతారంటావా?"

"తిరిగితే దొరకొచ్చు. ఒక పుగాక్కాడ నా మొకాన పడెయ్యి అంజియ్యబాబా, యెల్తాను''

అంజయ్య పేడ తీసిన చేతులు కడుక్కుని జేబులోనించి సంచి తీసి ఒక పొగాకు కాడ ఇచ్చాడు.

అచ్చయ్య అది తీసుకుని పరుగులాంటి నడకతో కదిలిపోయాడు.

"నువ్వు రేపు మాపట్లో ముటాకోసం యెల్లిరాకపోతే లాభంలేదు'' అంది రాజమ్మ.

"ఎల్తానే... ఇంట్లో నాలుగొందలుండయి. ముటాకోసం యెల్లాలంటే చేతిలో వెయ్యి రూపాయలన్నా ఉండాలి!" అన్నాడు అంజయ్య.

"డబ్బుకోసం చూసేదేందయ్యా? ఎంసీ ఫైవ్ పత్తి నాలుగయిదు కింటాల్లు అయిద్దిగదా, రేప్పొద్దున్నే అమ్ముదాం"

"యెంకట్రామయ్య కొట్టోల్లు పొద్దున ఎంసీ ఫైవ్ పత్తి కొంటండారే! అప్పయితేనేమొ ఐదొందల యాభై అంట, రొక్కం అయితే ఐదొందల ఇరవైయ్యేనంట!"

"సందకాడ బూరేలు తొక్కి, రేప్పొద్దున్నే కాటాలు యేద్దాం. కేష్ బేరానికే అమ్ముదాం పత్తి'' అంది రాజమ్మ.

★ ★ ★

అంజయ్య 8 ఎకరాల్లో డిసిహెచ్ 32 రకం పత్తినీ, 3 ఎకరాల్లో ఎంసియు5 రకం పత్తినీ వేశాడు.

డిసిహెచ్32 అంటే పొడుగు పింజరకం పత్తీ ఎంసియు5 అంటే పొట్టిరకం పింజ పత్తీ. ఏదో ఒక సంవత్సరం తప్ప వాటిమధ్య ధరల్లో పెద్ద వ్యత్యాసం ఉండదు.

అంజయ్య ఆరోజు రాత్రి వెంట్రామయ్యగారింటికి వెళ్ళాడు. వెంకట్రామయ్య ఎరువులూ, చీడపురుగు మందుల వ్యాపారస్తుడు.

"ఏందిరా అంజియ్యా... ఏంపనిమీద వచ్చావు?" పలకరించాడు వెంకట్రామయ్య.

"కొద్దిగా డబ్బు అవసరం వచ్చిందన్నా. పత్తి అమ్ముదామనుకుంటుండా. కొంటన్నారుగా?"

"కొంటన్నాంరా! ఎంసీఫైవ్ అయితే



ఐదొందల ఇరవై, డిసిహెచ్ అయితే ఐదొందల నలభై రొక్కం బేరం. అప్పయితేనేమో ఏ పత్తి అయినా ముప్పయ్ రూపాయలెక్కువ"

"రొక్కానికే అమ్ముదామనుకుంటున్నాలే అన్నా... ఎంసీఫైవ్ ఐదుకింటాల్లు వుండిద్ది. సరుకు చూసిపో అన్నా, బూరేలు తొక్కతాం!"

"చూసేదేందిలేరా, నీ పత్తి బాగానే ఉండిద్దిగనీ తొక్కు బూరేలు. రేప్పొద్దున కాటాలు యేసుకుంటాం"

"నాకు కొంత డబ్బు కావాలన్నా!" అంజయ్య అడిగాడు.

"సరేలేరా, రేపు కాటాలు యేసిన తరువాత తీసుకో'' వెంకట్రామయ్య అన్నాడు.

అంజయ్య ఇంటికి వచ్చాడు. "రేటు పొద్దున్న మనం అనుకున్నంతేనా?" అడిగింది రాజమ్మ.

"అంతేనే... ఐదొందల ఇరవైయ్యంట రొక్కం బేరం"



"ఇంకాలిస్సెం ఎందుకు? తొక్కుదాం" రాజమ్మ అన్నది.

బూరేలు దూలాలకు కట్టిన తరువాత, అంజయ్య బూరేలు తొక్కుతుంటే, అన్నపూర్ణ, రాజమ్మ, హనుమంతరావు ఇంట్లోనుంచి గంపల్లో పత్తి తీసుకొచ్చి బూరేల్లో వేశారు.

నాలుగు బూరేలు అయ్యాయి. పని అయిన తరువాత అంజయ్య స్నానంచేసి, అన్నం తిని దడి దగ్గరికి వెళ్ళిపోయాడు.

అంజయ్య గొడ్లకి మేత వేస్తుంటే, పక్క కొష్టం భీమయ్య పిలిచాడు. "ఏందిరా అంజియ్యా... ఇయ్యాల కూడా ఇంత పొద్దుపోయి వచ్చావేందిరా?"

"ఇంటిదగ్గర పత్తి బూరేలు తొక్కి వచ్చాను అన్నా. యంకట్రామయ్యకి వేసాలే పత్తి"

"మా ఇంట్లో కూడా ఆరేడు కింటాల్లు ఎంసీఫైవ్ ఉండిద్దిరా! అది అమ్ముదామంటే మీ వదినేమొ ఇంకా రేట్లు పెరుగుతాయంట, వారం రోజులు ఆగి అమ్ముదాం అని అంటంది"

"రేట్లు పెరగొచ్చు అని అందరూ అంటన్నార్లే! మీకు అంతగా డబ్బుకి ఇబ్బంది లేకపోతే నాల్రోజులు ఆగరాదూ? మాకు పత్తి ముటాకోసం ఎల్లాల్సి చేతిలో డబ్బులేక అమ్ముకున్నాం" అన్నాడు అంజయ్య.

"మాకూ ముటా కావాల్రా, నేను కూడా వస్తా! ఇద్దరం కలిసి యెల్లి ఎక్కడోచోట చెరి పదిమందిని తెచ్చుకుందాం"

"అట్నే యెల్దాంలే అన్నా... తోడుగా యెల్లి తెచ్చుకుందాం ముటాని" అంటూ అంజయ్య పడుకున్నాడు.

మరుసటిరోజు ఉదయం అంజయ్య దడిదగ్గిరా, ఇంటి దగ్గిరా నీళ్ళు తెచ్చుకుని వెంకట్రామయ్య కొట్టుకి వెళ్ళాడు. అప్పటికే ఆయన పేపర్ని అక్షరం అక్షరం కూడబలుక్కుని చదువుతున్నాడు.

వెంకట్రామయ్యకి పెద్దగా చదువురాదు. డబ్బు దగ్గిర మహా పిసినారి మనిషి. మొదట్లో బరిగొడ్లు మేపుకుని, పాలు, పెరుగు, నెయ్యి టౌన్‌కి తీసుకుపోయి అమ్ముకుని వ్యాపారం చేసేవాడు. కొద్దిగా పొలం వుంది. ఆ పొలంమీద వచ్చే డబ్బులూ, గేదెల పాడిమీద వచ్చే డబ్బులూ పైసా కూడా ఖర్చుపెట్టేవాడు కాదు. పైసాకి పైసా కలిపి ముడివేసేవాడు.

ఆయన కొడుకు శేఖర్ పదో తరగతి తప్పిపోయాడు. ఇంటిదగ్గర పనీ, పాటా చేయకుండా వూరికే గాలికి తిరుగుతుండేవాడు. కొడుకు ఎందుకూ పనికిరాకుండా చెడిపోతాడనే ఉద్దేశ్యంతో కొడుకుతో ఎరువులూ, పురుగు మందుల కొట్టు పెట్టించాడు వెంకట్రామయ్య. అజమాయిషీమాత్రం ఆయనదే.

శేఖర్‌కి లేని అలవాటు లేదు. సమస్త సద్గుణాల సంపన్నుడు అతను.

"బూరేలు తొక్కేం అన్నా!" అన్నాడు అంజయ్య.

"ఎన్ని అయినయిరా?"

"నాలుగు బూరేలు అయినయన్నా! మీరు తొందరగా కాటాలకి వస్తే కాటా యేసి, నేను పెందలాడి చేలోకి పోతాను''

"ముటావాళ్ళు వచ్చిన తరువాత ముందు మీ ఇంటికాడే కాటాలు యేస్తాంరా!" అన్నాడు వెంకట్రామయ్య.

అంజయ్య ఇంటికి వచ్చాడు. బయట అరుగుమీద కూర్చుని వేపపుల్లతో పళ్ళు తోముకోవడం మొదలుపెట్టాడు. కాటా, తాళ్ళూ తీసుకుని ఇంకో కొట్టు ముటావాళ్ళు పత్తికాటాలు వేసుకోవడానికి పోతున్నారు.

"ఓరే... రాగోలూ... మీ కొట్టోళ్ళు కూడా ఇయ్యాల పత్తి కొంటండారంటరా?" అడిగాడు అంజయ్య.

"కొంటన్నాం అంజియ్యా.... ఎంసీఫైవ్ పత్తి''

"రేటెంతరా?"

"ఐదొందల ముప్పయ్యట కేష్‌బేరం" అన్నాడు రాఘవులు.

అదిరిపోయాడు అంజయ్య. వెంకట్రామయ్య వాళ్ళు ఐదొందల ఇరవైయ్యేకదా అనుకున్నాడు.

"ఎంకట్రామయ్యోళ్ళు ఐదూ ఇరవయ్యేనంట కదరా?"

"ఏమో, నాకు తెలియదు అంజియ్యా!" అంటూ అతను వెళ్ళిపోయాడు.

పక్కనవాళ్ళు ముప్పయ్ చేసి కొంటంటే, వీళ్ళుమాత్రం ఎందుకు కొనరులే అనుకున్నాడు అంజయ్య.

ఆ ఊళ్ళో మొత్తం నాలుగు పురుగు మందుల షాపులున్నాయి. వెంకట్రామయ్య, సుబ్బారావు, నాగేశ్వరరావు, తిరుపతయ్య ఈ నలుగురూ నాలుగు షాపులు పెట్టారు. వీళ్లే పత్తి కూడా కమీషన్ చేస్తుంటారు.

ప్రకాశంజిల్లాలో 30, గుంటూరు జిల్లాలో 50 పత్తిమిల్లులు ఉన్నాయి. పత్తినుంచి విత్తనాన్ని వేరుచేసి, దూది చేసే మిల్లులు ఇవి. వీటిని జిన్నింగు మిల్లులు అంటారు.

ఈ జిన్నింగు మిల్లుల వాళ్లకి గ్రామాల్లో ఉన్న పురుగు మందుల షాపుల వాళ్లు దళారులుగా వుంటుంటారు. మిల్లువాళ్లు పత్తిని కొంటూ, రైతులనుంచి పత్తిని ఇప్పించి దళారి పని చేసినందుకు ఈ షాపులవాళ్లకి దళారి రుసుం ఇస్తారు.

ఒక్కో షాపువాడు ఒక్కో మిల్లువాణ్ణి పట్టుకుంటాడు, రైతులనుంచి పత్తి ఇప్పించటానికీ, దళారి రుసుం కొట్టేయడానికి.

అంజయ్య అన్నం తిన్నాడు. పత్తికొనేవాళ్లు ఎంతకీ రాకపోవడంతో మళ్లీ వెంకట్రామయ్య కొట్టు దగ్గరకి వెళ్లాడు.

పత్తిని కాటా వేసుకునే ముటావాళ్లూ, శేఖర్ అప్పుడే బయలుదేరారు. వెంకట్రామయ్య బయట వాకిట్లో నిలబడి వున్నాడు.

"ముందు మీ ఇంటికేరా వెళ్లడం" అన్నాడు

వెంకట్రామయ్య.

ముటావాళ్లు కదిలివచ్చారు.

"రేటెంతన్నా?"

"రేటేందిరా? రేత్రి చెప్పాకదా! ఎంసీఫైవ్ ఐదూ ఇరవైయని''

"సుబ్బరావు కొట్టోళ్లు ఐదూ ముప్పయ్ చేసి కొంటున్నారు కదాన్నా!"

"వాళ్లు కొంటం ఏందిరా? మనం మాత్రం ఇయ్యాల ఐదూ ముప్పయ్ చేసి కొంటంలా? రేత్రేగా నువ్వు బేరం ఇచ్చింది. ఐదూ ఇరవై అనేకదా నువ్వు తొక్కింది''

"అదేందన్నా? నేను బూరేలు తొక్కుతానన్నానుగానీ, రేటు యవారం మాట్లాడుకున్నామా?"

"ఓరి పిచ్చోడా... రేటెంతని నువ్వు నన్ను అడగలా? నేను ఐదూ ఇరవై అని చెప్పలా? నిన్నటి రేటు అది. ఇయ్యాల పెరిగింది. నిన్నటిరేటుకేగా నువ్విచ్చింది. రేటు యవారం మాట్టాడుకోలేదంటావేందిరా?"

"ఇది బాగుందే! ఒకరిదేమొ ఒకరేటూ, ఇంకొకరిదేమొ మరో రేటా?" కోపంగా అన్నాడు అంజయ్య.

"ఒరేయ్... మనుషుల మీద నమ్మకం వుండాల్రా! నీకియ్యేడు పదిహేనూ, పదహారు వేలకి అప్పిచ్చాము. ఏం చూసి ఇచ్చామంటావు? నమ్మకంరా! ఇయ్యాల బూరేలు తొక్కేవాళ్లకి ఐదూ ముప్పయ్‌రేటు, రేపు ఐదూ యాభై వుండొచ్చు! దాందేముందిరా, ఏ రోజు రేటు ఆ రోజే!"

'ఈ నా కొడుకు తడిగుడ్డలతో గొంతులు కోసే రకం! వీడికి పత్తి ఇస్తానని చెప్పడమే బుద్ధి తక్కువ!' అని అంజయ్య మనసులో తిట్టుకుంటూ విసవిసా బయటకు వచ్చాడు.

ఇంటికి వచ్చేసరికి తాళ్లుకట్టి, ముటావాళ్లు కాటాలు వేసుకోవటానికి సిద్ధంగా వున్నారు.

"రేటెంతంట అబ్బాయ్?" తెలియనట్లు శేఖర్‌ని అడిగాడు అంజయ్య ఎంత చెపుతాడో అని.

"ఏమో, నాకేం తెలుసు బాబాయ్? నాన్నని అడక్కపోయావా?" అన్నాడు శేఖర్ సిగరెట్ దమ్ములాగుతూ, బయట పొయ్యి దగ్గిర నెయ్యి కాగబెట్టుకుంటున్న అన్నపూర్ణని ఓర కంట చూస్తూ.

చిర్రెత్తుకొచ్చింది అంజయ్యకు.

చక్రంకాటా కట్టారు. ఆ కాటాలో 2 కేజీల మోసం వుంటుంది. ముల్లు చూసి బూరేలు తూకం ఎంతో శేఖర్ చెప్పాడు. అంజయ్య కూడా కాటా చూశాడు. అన్నపూర్ణ ఒక కాగితం మీద వేసుకుంది.

"మొత్తం 5 కింటాళ్ల 53 కేజీలు'' అన్నపూర్ణ చెప్పింది.

"8 కేజీలు తీసివేస్తే 5 కింటాళ్లా 45 కేజీలు నికరం" అన్నాడు శేఖర్.

ప్రతి బూరేనికీ గ్రాస్‌నుంచి 2 కేజీలు తీసివేస్తారు. 150 కేజీలు దాటిన బూరేనికి అయితే గ్రాస్ నుంచి 3 కేజీలు తీస్తారు.

డబ్బులెక్క చూసి శేఖర్ చెపుతుండగా వెంకట్రామయ్య వచ్చాడు.

"మాకు ఇప్పుడు గట్టిగా అవసరం అన్నా డబ్బులు. నాకు 2 వేలు చేతికిచ్చి మిగతా పైకం నా కాతాలో జమ వేసుకో' అన్నాడు అంజయ్య.

'సరే, అట్నేలేరా. డబ్బు రేపు ఇస్తాలే!"

"డబ్బు ఇయ్యాల కావాలి అని గదూ అమ్మింది పత్తి'' అంజయ్య గదమాయించినట్లు అన్నాడు.

"అట్టయితే రారా... ఇప్పుడే పారేస్తా రెండు వేలు'' అంటూ వెంకట్రామయ్య లేచాడు. అంజయ్య అనుసరించాడు.

మందులు అయితే విపరీతంగా లాభాలువేసుకుని ఇస్తారు. ఆ అప్పుమీద రెండు, మూడు రూపాయల వడ్డీ వేసుకుంటారు మనిషినిబట్టి. డబ్బు మాత్రం వాళ్ల చేతిలోనించి రావాలంటే మందుల షాపుల వాళ్లకి ప్రాణాలు పోయినంత పనవుతుంది.

సచిత్ర విచిత్రం



# కాదేదీ సంపాదనకనర్హం

మనం ఎంతో అసహ్యించుకునే వానపాములాంటి మట్టిలో బతికే పురుగులు కర్ట్ ఆల్‌బర్గ్ అనే ఈ పెద్ద మనిషికి కోట్లు సంపాదించి పెడుతున్నాయంటే ఆశ్చర్యమే. క్వీన్స్‌లాండ్‌లో ప్రత్యేకం ఈ పురుగుల పెంపకం కోసం కొన్ని ఎకరాల భూమిని తీసుకున్నాడు కర్ట్. సతీసమేతంగా రోజూ మట్టి తవ్వి కొన్ని వేల పురుగులని సేకరించడమే ఈయన పని. ఇంతకీ వీటి మలమూత్రాలు బ్రహ్మాండమైన ఎరువుగా పని చేస్తున్నట్టు కనిపెట్టిన కర్ట్ పాలిట ఈ వ్యాపారం బంగారు గుడ్లు పెట్టే బాతులా అయింది. కోట్ల కోసం కోటి విద్యలు మరి.

షాపు దగ్గర అంజయ్య రెండువేలు తీసుకుని అన్నాడు, "మిగతా డబ్బు నా కాతాలో జమ రాసుకో అన్నా ఇప్పుడే"

వెంకట్రామయ్య కాతా పుస్తకాలు తెరిచి జమ రాసుకున్నాడు.

"ఇంటో డిసిహెచ్ పత్తి చాలా వుందిగారా అంజయ్యా... దాన్ని గూడా అమ్మకపోయావా?"

"ఆ పత్తిని ఇప్పుడల్లా అమ్మను అన్నా... చేలల్లోనించి పత్తి మొత్తం వచ్చిన తరవాత ఆ పత్తి అంతా ఒకేసారి అమ్ముతా!"

"సరే, నీ ఇష్టంరా! నువ్వు వుంచుకుంటానంటే వుంచుకో! ఇందులో బలవంతం ఏముందీ?"

'నా పత్తి నా ఇష్టంగాక వీడిష్టమా ఏమిటి? బలవంతం చేస్తే ఇస్తారూ? దొంగ లం.. కొడుకు. ఆ పత్తిమీదా కన్నుపడింది' అనుకుంటూ అంజయ్య డబ్బు జేబులో పెట్టుకుని ఇంటిదారి పట్టాడు.

ఇంటి దగ్గర డబ్బు పెట్టెలో పెట్టి, దడి దగ్గరకి వచ్చి, దున్నలతో బండికట్టాడు. చేలోకి వెళ్లేసరికి పొద్దు బాగా నడినెత్తిమీదకు వచ్చింది.

పత్తి తీస్తున్న రాజమ్మ "ఇదుగో, మాకు మంచినీళ్లు తీసుకొచ్చిపోయి. పొద్దట్నించీ ఇయ్యాల మంచినీళ్లు తెచ్చుకోలా!" అంటూ కేకేసి చెప్పింది.

అంజయ్య మట్టి బుంగతీసుకుని కుంటకు పోయాడు. నీళ్లు తెచ్చి పత్తి తీస్తున్న ముగ్గురికీ పోసాడు.

"పత్తి కాటాలు ఏసి వచ్చావా?" అడిగింది రాజమ్మ.

"కాటాలు యేసానుగానీ, వాడు ఇయ్యాల మనల్ని మోసం చేశాడే!" అని అంజయ్య జరిగిన విషయం చెప్పాడు.

"నువ్వు ఎందుకు వూరుకున్నావయ్యా? పత్తి ఇయ్యనని అడ్డం తిరక్కపోయావా?"

"అన్నీ అయినయ్యే! మా కొట్టో కట్టాల్సిన బాకీ కట్టమన్నాడు''

"డబ్బు ఇయ్యాల్నంటే ఇస్తాం, అంతేగానీ రేటు తక్కువ చేసి ఇస్తామా ఏంది పత్తి?" ఆగ్రహంతో వూగిపోతూ అంది రాజమ్మ.

ఉదయం రాజమ్మ ఇంటి దగ్గర ఉన్నట్లయితే ఖచ్చితంగా కాటాలు వేసుకోవటానికి వప్పుకుని వుండేదికాదు.

"ఐదున్నర కింటాళ్లకి యాభై ఐదు రూపాయలు పోయినట్టేకదా?" అని, వూరికే అంత డబ్బు పోగొట్టుకున్నందుకు బాధపడింది రాజమ్మ.

భీమయ్యా, అంజయ్యా కోడి కూయక ముందే లేచి గొడ్లు దగ్గర బాగు చేసుకున్నారు. అంతకు ముందురోజు పిలిచిన కూలి మనిషి ఆదాం వచ్చాడు.

"ఒరే ఆదాం గొడ్డుని జేగర్తగా మేపరేయ్. సందకాడ ఊళ్లో పెత్తనాలు చేయకుండా పెందలాడి దడి దగ్గరకి వచ్చి గొడ్డుని బాగా మేపు'' అంటూ అంజయ్య అతనికి జాగ్రత్తలు చెప్పాడు.

ఇంటికి వచ్చిన తరువాత అంజయ్య ముఖం కడుక్కుని, చద్దన్నం పెరుగు వేసుకుని తిన్నాడు. పెట్టెలో డబ్బు తీసుకుని మొల దగ్గర సంచిలో పెట్టుకున్నాడు. చార్జీలకు సరిపడే చిల్లర జేబులో వేసుకున్నాడు.

అంతలోనే భీమయ్య కూడా వచ్చాడు.

"యెళ్లొస్తానే, జేగర్త... రేపు సందకాడికి తిరిగొస్తా'' అన్నాడు అంజయ్య.

"నువ్వు జేగర్త ముందు. ఒక రూపాయి ఎక్కువ పెట్టి అయినా మడుసుల్ని తీసకరా! నువ్వు ఎక్కడైనా సాదించుకుని మడుసుల్ని తీసకరాకపొయ్యావంటే పండించిన పంట అంతా నేలపాలైపోయిద్ది'' అన్నది రాజమ్మ.

"ఎక్కడైనా సరే తిరిగి ముటాని తీసుకునే వస్తా!" అంటూ అంజయ్య బయల్దేరాడు. రాజమ్మ బయట వాకిట్లోకి పోయి ఎదురు వచ్చింది.

అప్పుడే బస్సు హారన్ కొట్టింది.

భీమయ్యా, అంజయ్యా బస్సు ఎక్కిపో యారు.



రేపు సాయంత్రానికి వస్తామన్న అంజయ్య ఎనిమిది రోజుల తర్వాత మనుషుల్ని తీసుకు వచ్చాడు.

రాజమ్మ, పిల్లలూ అంజయ్య విషయం తెలియక బాగా ఆందోళన చెందారు.

అంజయ్యా, భీమయ్యా పొదిలి, కనిగిరి, మార్కాపురం ఈ మూడు తాలూకాల్లో కాలికి బలపం కట్టుకుని తిరిగారు. అయితే అప్పటికే ఆ పల్లెల్లోని శ్రామికజనం పత్తి తీతలకు తరలి వెళ్లారు. ఈ వారం రోజులూ వాళ్లకి సరిగా స్నానాలు లేవు. సరిగా తిండిలేదు. కనీసం బట్టలు కూడా శుభ్రం చేసుకునే పరిస్థితిలేదు.

చివరికి ఎలాగైతేనేం ఓ వూళ్లో 17 మంది కూలీలు దొరికారు. అక్కడ వీళ్లకి నాలుగు రోజులు ఆలస్యం అయింది. ఆ కూలీలు ఇంటి దగ్గర పనులు అన్నీ చక్కబెట్టుకోవడంలో ఆలస్యం జరిగింది.

పత్తి తీతలకి వచ్చిన తరువాత కనీసం రెండున్నర నెలలూ, మూడు నెలలూ వుండాలి. ఈ 75-90 రోజులకి సరిపడా వెచ్చాలూ, కారంలాంటివి చూసుకోవాలి. కోళ్లూ, మేకలూ, గొర్లూ, దూడలూ లాంటివి వుంటే వాటిని ఎవరో ఒకరికి వొప్పగించడమో, అమ్ముకోవడమో చేయాలి. బియ్యం, నూకలు, రాగులు, సజ్జలులాంటివి తెచ్చుకునే వాళ్లు వాటిని సిద్ధం చేసుకోవాలి.

వాళ్లు అవన్నీ సవరించుకుంటూ 'రేపో స్తాం, మాపొస్తాం' అంటూ నాలుగు రోజులు కాలయాపన చేశారు.

"ఎలాగైనా ముటాని తీసుకుపోవాల్సిందే! వచ్చిన వాళ్లంవచ్చాం. వాళ్లని వెంటపెట్టుకునే వెళ్లాలికానీ, చేతులూపుకుంటూ వెళితే అక్కడ పత్తి వృధా అవుతుంది'' అని పట్టుదలగా ముటాని సాధించుకునే తిరిగి వచ్చారు.

సాయంత్రం నాలుగు గంటలకి బస్సు దిగిన తరువాత ముటావాళ్లందర్నీ దడి దగ్గర కి తీసుకుపోయారు అంజయ్యా, భీమయ్య. అక్కడ అన్నాలు వండుకుని, ఆ కొష్టంలోనే ఉండమని చెప్పారు.

ఒంటినిట్టాడి కొష్టం అది. ఆ కొష్టంలోనే ఒకవైపు పశువులూ, మరోవైపు ముటావాళ్లు! కింద అంతా గేదెలు, దున్నపోతుల ఉచ్చల మడుగులు! నేలంతా గుంటలు, గుంటలు! అక్కడే ఆ జానెడు స్థలంలోనే ఆ చలికాలంలో ముటావాళ్లు మూడు నెలలు తలదాచుకోవాలి.

వాళ్లని దడి దగ్గర వదిలిపెట్టి అంజయ్య ఇంటికి వచ్చాడు.

"ఇన్ని రోజులు ఏం చేశావు బాబా? అమ్మ భయపడిపోయిందనుకో! మీ బాబు ఏడ్రా ఇంకా రాలేదు అని రోజుకి వందసార్లు అంటందనుకో!" అన్నాడు హనుమంతరావు.

అంజయ్య స్నానం చేసి, ఆకలిగా వుండ టంతో అన్నం తిన్నాడు. చీకటి పడిన తరు వాత రాజమ్మ, అన్నపూర్ణ చేలోనించి బండి మీద వచ్చారు.

అంజయ్య పత్తి గోతాలు బండిమీద నుంచి దించి ఇంట్లో వేశాడు. ఆదాం బండిని దడి దగ్గరకి తోలుకుపోయాడు.

"ఇన్ని రోజులు ఏం చేశావయ్యా? మరు సటి రోజు రేత్రికల్లా తిరగ్గొట్టుకుని వస్తానన్నో డివి! ఏమయ్యారో తెలియక మేం గాబరా పడిపోతిమి. చేలేమొ పత్తి తెగ పగిలి కారిపో

తండె!"

"నేనేం వూరక కూర్చున్నానూ? ముటావాల్లు దొరకొద్దూ? దొరికినా రావద్దూ? పోయిన దగ్గర్నించీ వద్దామనే చూస్తుంటే ఇయ్యాల్టికి కుదిరింది''

"మొత్తం ఎంతమంది వచ్చారు?"

"నాతోపాటు భీమయ్య కూడా వచ్చాడుగా! ఇద్దరం తిరిగాంటే చాలా వూళ్లు. పదిహేడుగురు దొరికారు. మనకి పదిమందీ, వాళ్లకి ఏడుగురు''

"పదిమంది మనకి ఏ మూల కబురు? కనీసం పాతికమందన్నా చేతిలో వుంటే పగిలిన మొత్తం పత్తి ఐదార్రోజుల్లో ఇంటికొచ్చిద్ది! అసలు ఇప్పటికే ఈ వరస పత్తితీత మొత్తం అయిపోయివుండాల్సింది'' అన్నది రాజమ్మ.

"ఈళ్లకి తోడు వూళ్లో వాళ్లనికూడాఎవుర్నో నలుగుర్రైదుగుర్ని ఎతుకులాడుకుని ఈసారికి తంటాలు పడదాం. మరి చేసేదేముంది?" అన్నాడు అంజయ్య.

★ ★ ★

అంజయ్య ముటావాళ్లు బాగా పత్తి తీసేవాళ్లు. ఆ ముటాతోపాటు ఊళ్లోవాళ్లు కూడా ఆరుగురు దొరికారు.

అన్నపూర్ణా, రాజమ్మా, ఊళ్లో కూలీలూ, ముటావాళ్లూ అందరూపోయి రోజుకి మూడు క్వింటాళ్ల పత్తి తీసుకొచ్చి ఇంట్లో పడేస్తున్నారు.

అంజయ్య వాళ్లది రెండు దూలాల. ఇల్లు. ఇల్లంతా పత్తితో నిండిపోయింది.

ఇంటి బయటనే ప్రహారీలో అన్నాలు వండుకుని తింటున్నారు. పత్తితో ఇల్లు నిండిపోవటంతో వాకిట్లోనే బియ్యం, గిన్నెలు పెట్టుకుని ఆరు బయట అన్నాలు తింటున్నారు.

ఇంట్లో డిసిహెచ్ పత్తీ, పంచలో ఎంసీఫైవ్ పత్తీ వేశారు.

రాజమ్మ, అన్నపూర్ణ కోడికూయకముందే నిద్రలేస్తారు. ఒకరు పాచిపని చేస్తుంటే, ఇంకొకరు వంట చేస్తారు.

అంజయ్య దడి దగ్గరే పడుకుంటాడుగాబట్టి అక్కడవున్న ముటావాళ్లని కోడికూతకు ముందే నిద్రలేవగొడతాడు.

తెల్లవారేసరికి రాజమ్మ చేలోకి కూలోళ్లని తీసుకుపోతుంది.

చేలో పనిచేసేటప్పుడు రాజమ్మ ఒక చివరా, అన్నపూర్ణ ఒక చివరా సాళ్లు పట్టుకుంటారు. మధ్యలో కూలీలు.

వాళ్లకి మాటలు చెపుతూ "తియ్యండమ్మా... తియ్యండమ్మా'' అంటూ వాళ్లని బతిమిలాడుతూ పనిచేయించుకుంటారు.

తల్లీ కూతుళ్లిద్దరూ పత్తి తీస్తూ ముందుపోతుంటారు. కూలీలు కూడా తప్పనిసరిగా వెనుకబడకుండా వాళ్లతోపాటు పత్తితీయాలి.

పత్తి విరగపండింది. రైతులకు కోరినంత డబ్బు.

రైతాంగం అంతా సంతోషంతో ఓలలాడిపోతున్నారు.

"ఏయ్యా.... పంచలో వుండే ఎంసీఫైవ్ అమ్మిదామయ్యా! బయట ఎందుకు పత్తి? పొయిలో నించిగాలికి నిప్పు రవ్వ పోయిపడినా మునిగిపోతాం" అంది రాజమ్మ ఒక రోజు అంజయ్యతో.

"నేనూ అమ్మిదామనే అనుకుంటుండా. కచ్చా పచ్చి మీదయేస్తే తూకాలు కూడా బాగా వస్తయ్యి. అయితే రేటు పెరిగేటట్టుగా వుందిగా?"

"పెరిగితే పెరగనీయి, మనం చేసేదేముంది? ఇల్లంతా పత్తితో నిండిపోయె, చేలో నించి వచ్చే పత్తి ఎక్కడేసుకోవాలి? పంచలో ఎంసీఫైవ్ అయినా అమ్మితే వచ్చే పత్తి ఇక్కడేసుకోవచ్చు'' అంది రాజమ్మ.

"సందకాడ బూరేలు తొక్కి, రేపు యెంకట్రామయ్య కొట్టుకి యేద్దామే పత్తి. వాడి కాడ మందులు తెచ్చుకుని, ఇంకో కొట్టోడికి అమ్ముకుంటే వాడు ఏడిచి చస్తాడు?"

"ఏం రోగం చావడానికి మనకేం వూరకి

చ్చాడేంది మందులు? అప్పు అని వంద రూపాయల మందు నూట పాతిక ఏసుకున్నాడు. రెండ్రూపాయలో, మూడ్రూపాయలో వడ్డీ కట్టుకుంటాడు. ధరవైనంగా కనుక్కొని వాడికో, ఎవరో ఒకరికి అమ్ముదాం పత్తి'' అంది రాజమ్మ.

"నువ్వు చిన్నమ్మాయితో అన్నం పెట్టించుకో, మేం ఎల్తన్నాం" రాజమ్మ అంజయ్యతో చెప్పి అన్నపూర్ణతో కలిసి చేలోకి వెళ్లింది.

ఎండబడిన తరువాత అంజయ్య అన్నం తిని పురుగుమందుల కొట్లు దగ్గరకి పత్తి ధర కనుక్కుందామని వెళ్లాడు. అన్ని కొట్ల వాళ్లూ ఎంసియుఫైవ్ పత్తిని 620 రూపాయలు చేసి కొంటున్నారు.

వెంకట్రామయ్య కొట్టు దగ్గరకి వెళ్తే ఆయన అన్నాడు... "మంచి పార్టీ వచ్చిందిరా అంజయ్యా, రెడీకేష్ బేరం, ఆరొందల యాభై అంట డిసిహెచ్ పత్తి. నీ దగ్గర పత్తి మొత్తం అమ్మరా!"

"నేను ఆ పత్తి ఇప్పుడిప్పుడే అమ్మను అన్నా! చేలో పత్తి మొత్తం వచ్చిన తరవాత ఒకేసారి అమ్ముతా! ఆ పత్తికి రేటు కూడా పెరుగుతుండె!"

"ఇంక రేటు పెరగదురా. ఇదే బంగారంలాంటి ధర. నా మాట విని అమ్మరా, చేతిలోకి డబ్బు వచ్చిద్ది'' అన్నాడు వెంకట్రామయ్య.

"ఆ పత్తి ఇప్పడల్లా అమ్మను, ఎందుకొచ్చిన మాటలు? తరువాత మాత్రం డబ్బు చేతికి రాదేంది?" తెగేసి చెప్పాడు అంజయ్య.

"సరే నీ ఇష్టంరా. మేం మాత్రం మంచికి చెప్పాం!"

"ఏం మాటలు, నా పత్తి నా ఇష్టంగాక మీ ఇష్టమా? ఎంసీ ఫైవ్ అమ్ముదామనుకుంటున్నా, ఎంతచేసి కొంటన్నారు?"

"620 రూపాయలు చేసి కొంటన్నాంరా.



బూరేలు తొక్కుతావా మరి?"

"ఇంటి దగ్గర మాట్టాడి ఏ విషయం చెపుతా!" అంటూ అంజయ్య లేచి వచ్చాడు.

"ఎక్కడికి పోయొస్తన్నావురా?" అంటూ దార్లో ట్రాక్టర్ బాపయ్య పలకరించాడు.

అంజయ్య విషయం చెప్పాడు.

"మనూళ్లో అమ్ముకోవడం కంటే మేదర మెట్ల యార్డుకి తీసకపోయి అమ్ముకోవడం మంచిదిరా! అక్కడ 650 నించీ 660 దాకా రేటేస్తున్నాడు''

"వాళ్లు డబ్బులు ఎన్ని రోజులకు ఇస్తారు?"

"మనం పత్తి అమ్మిన మూడోనాడే చెక్కు ఇస్తార్రా! ఆ చెక్కు పది రోజుల్లో మార్చుకోవచ్చు. రోజూ నా ట్రాక్టర్ మీద బూరేలు తోల్తన్నా! నువ్వు కూడా నా మాట విని యార్డులో పెట్రా!" అన్నాడు బాపయ్య.

"అదే మంచిదట్టుగా వుంది చూడబోతే. సరే అట్నే యార్డుకే తొక్కుతాం బాపయ్యా!" అంటూ అంజయ్య ఇంటికి వచ్చాడు.



ఆ సాయంత్రం అన్నాలు తిన్న తరవాత ముటావాళ్లందరూ అంజయ్యింటికొచ్చారు.

బూరేలు కట్టారు. నలుగురు గంపల్లో పత్తి తీసుకొచ్చి బూరేల్లో వేశారు. నలుగురు తొక్కారు. ఇద్దరు కుట్టారు.

ముటాఖాళ్లు సాయపడటంతో బూరేలు తొక్కడం కొద్దిసేపట్లోనే అయిపోయింది.

అంజయ్యా తెల్లవారుజాముకి ట్రాక్టర్ మీద పత్తిబూరేలు వేసుకుని మేదరమెట్ల యార్డుకి తీసుకుపోయాడు. అప్పటికే సిసిఐ ఆవరణ నిండా బూరేలు పెట్టారు రైతులు.

ఉదయం 8 గంటల ప్రాంతంలో సిసిఐ సెలక్టర్ ఆఫీసులోనికి వచ్చాడు. అక్కడ సంతకాలు పెట్టి, 10 నిముషాలు ఆఫీసు సిబ్బందితో మాట్లాడి ఫ్లాట్‌ఫారం మీదకువచ్చాడు.

అతని వెంట కూలీలున్నారు. రేటు ఎంత వేస్తాడో చూద్దామని రైతులు సెలక్టర్ చుట్టూ గుంపులు గుంపులు కూడారు.

కూలీలు బూరేలు కోసి పత్తితీసి చూపెడుతుంటే, సెలక్టర్ పత్తి నించి వచ్చే దూది పొడవు చూసుకుంటూ టకటకా రేట్లు వేసుకుంటూ పోతున్నాడు. పత్తి నాణ్యతకు సంబంధించి ప్రతి బూరేనూ పగలకొట్టి చూడాల్సిందే.

640 నుంచి 660 రూపాయల వరకూ రేట్లు వేస్తున్నాడు. మంచి రకం పత్తికీ, తక్కువ రకం పత్తికీ మధ్య 20 రూపాయల వ్యత్యాసం.

అంజయ్య ఒక గంటసేపు కొనుగోళ్లు చూశాడు. తరువాత తన బూరేలు దగ్గరకి వచ్చి ఒక బూరెం మీద కూర్చున్నాడు.

"ఏం అంజయ్యమామా... మన బూరేలు దగ్గరకి వచ్చేసరికి మజ్జెన్నం అయ్యేటట్టుగా వుందే!" అంటూ యల్లారావు వచ్చాడు. యల్లారావు కూడా అంజయ్యతోపాటు అదే ట్రాక్టర్ మీద బూరేలు తీసుకువచ్చాడు.

మజ్జెన్నం కానీయ్, సందకాడ కానీయ్, పాపం బయ్యరేం వూరక కూర్చోడం లేదుగా. చురుగ్గానే పేసింగ్ చేస్తన్నాడు'' అన్నాడు అంజయ్య.

మధ్యాహ్నానికి వీళ్ల బూరేలు దగ్గరకి వచ్చాడు సెలక్టర్.

ముందు యల్లారావు బూరేలు ఉన్నాయి. వాటిని చూసి అవి అన్నీ క్వింటాల్ 654 రూపాయల రేటు వేసాడు.

తరువాత అంజయ్య బూరేలు దగ్గరకి వచ్చాడు. అంజయ్య తెచ్చిన 13 బూరేలూ పగలకొట్టి చూశాడు.

"ఫైన్ క్వాలిటీ. చాలా బావుంది పత్తి చెదాగిదా ఏం లేకుండా బాగా చేశారు'' అన్నాడు సెలక్టరు.

ఆయన మాటలకు అంజయ్య ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు.

అంజయ్య ప్రత్తి మొత్తానికీ 660 రూపాయలు రేటు వేశాడు. ఆరోజు టాప్ రేటు అది.

సెలక్టర్ రేటు వేసిన తరువాత, బూరేలు కాటాలు అయ్యేసరికి సాయంత్రం అయింది.

13 బూరేలూ 18 క్వింటాళ్లా 24 కేజీలు అయింది పత్తి. క్వింటాల్ 660 రూపాయల లెక్కన 13 వేలా 464 రూపాయలు వచ్చాయి. తూకం వోచర్ తీసుకుని సాయంకాలానికి ఇంటికి వచ్చాడు అంజయ్య.

రాజమ్మ నీళ్లు తోడింది. అంజయ్య చొక్కా విప్పి మంచంమీద కూర్చున్నాడు.

"పత్తి మనది బెమ్మాండంగా వుందన్నాడే బయ్యరు. టాపురేటు యేశాడు. 660 రూపాయలు యేశాడు. వందమంది రైతులముందు నన్ను మెచ్చుకున్నాడనుకో. చెద లేకుండా బెమ్మాండంగా తీశారు పత్తి అన్నాడు. అసలు మన పత్తి ఎట్టుందనుకున్నావూ... యెన్న పూస... ఎన్నపూస వుండట్టు వుందే పత్తి'' అంటూ ఆనందంగా, బడాయిగా చెప్పాడు అంజయ్య.

"నేను ఎంత జేగర్తగా తీయిస్తన్నాను పత్తి. ఎవురి వొళ్ళలోనన్నా అసలు చెత్త వస్తే వప్పుకుంటానూ? నేనూ, అమ్మాయీ జేగర్తగా దగ్గరుండి తీయించబట్టే అంత బాగుంది పత్తి'' అంది రాజమ్మ.

★ ★ ★

మార్చి నెలాఖరు!

ఆరోజు అంజయ్య ముటావాళ్లు సంతోషంగా వున్నారు. అది వాళ్లు పత్తి తీసే చివరిరోజు. మరుసటిరోజు వాళ్ళ వూరు వెళ్లిపోతారు.

వాళ్లు వచ్చి మూడునెలలు కావడంతో వాళ్ళకి వాళ్ళ ఊరుమీద బాగా గుబులు మళ్ళింది. ఆరోజు సాయంత్రం ముటావాళ్ళకి అంజయ్య భోజనాలు ఏర్పాటుచేశాడు.

పనులు అయిపోయిన తరువాత ముటావాళ్లకి రైతులు వీడ్కోలు విందుగా భోజనాలు పెడతారు. మూడు నాలుగు నెలలు పచ్చడి మెతుకుతోనో, కారం మెతుకులతోనో సంకటో, సడకో తిని తమ శ్రమనీ, తమ కష్టాన్నీ, తమ స్వేదాన్నీ రైతులకి అమ్ముకున్న ఆ కూలీలు రైతులు పెట్టే భోజనం కోసం ఉత్సాహంగా ఉంటారు.

భోజనాలు చేసి డబ్బు లెక్క అయిన తరువాత అర్ధరాత్రివరకూ లోకాభిరామాయణం మాట్లాడుకున్నారు. అన్నపూర్ణకి మంచి సంబంధం చూసి పెళ్లి చేయమని ముటావాళ్ళందరూ ఏకగ్రీవంగా సలహా ఇచ్చారు.

"మంచి ఉజ్జోగస్తుణ్ణి చూసి సేయ్యని కాపా, సల్లని తల్లి. సుకపడిద్ది'' అంది ఆదెమ్మ.

★ ★ ★

"బాబా, కక్కాయి దగ్గర్నించి వుత్తరం వచ్చింది'' చెప్పింది అన్నపూర్ణ.

"ఏమని రాశాడేందమ్మాయ్?"

"అక్కడ ఇయ్యేడు పంటలు బాగానే పండినయ్యంట! యాభైవేలన్నా మిగుల్తయని రాశా

డు. వారంపదిరోజుల్లో వస్తారంట. కౌలు డబ్బు చూసి పెట్టమన్నాడు''

"డబ్బు చూసేదేందిలే, పత్తి అమ్మి కట్టట మేగా!" అన్నాడు అంజయ్య.

"అక్కడ పత్తిరేటు పదొందలు వుందంట బాబా''

"అబ్బ, బంగారంలాంటి ధరమ్మా. ఇక్కడ మనకి మెట్టకానీ, అక్కడ పత్తి తోటలకి నీళ్లు కూడా పెడతారు. ఎకరానికి 20 కింటాళ్ల పత్తి దిగుబడి వచ్చిద్ది''

"అక్కడ మంచి ఆదాయమే బాబా''

"కావాల్సినంత ఆదాయం వుండబట్టే మన ఊళ్ళనించి అందరూ బళ్ళారిపోయేది. అక్కడ పత్తితోటలూ, మిరపతోటలూ యేసి లక్షల్లక్షలు సంపాయించినోళ్లున్నారు''

చివర్లో వచ్చిన ఎంసియు5 పత్తి అమ్ముదామనుకున్నారు అంజయ్యవాళ్లు. సిసిఐలో కొనుగోళ్లు ఆపివేశారు.

వెంకట్రామయ్య కొట్టు దగ్గరకి వెళ్ళాడు అంజయ్య. 670 రూపాయలు చేసి కొంటున్నాం అని చెప్పాడు ఆయన. అన్ని కొట్లవాళ్లూ అదేరేటు.

బూరేలు తొక్కి అమ్మారు. 14 క్వింటాళ్ళా 50 కేజీలు అయింది పత్తి.

మొత్తం 3 ఎకరాలు ఎంసియు.5 పత్తిపంట వేస్తే అంజయ్యకు 37 క్వింటాళ్ళు అయింది. ఆ పంటమీదనే దాదాపు 25 వేల రూపాయలు వచ్చాయి.

వెంకట్రామయ్య కొట్టుకి వెళ్లి అంజయ్య ఆ ఏడాది వాడిన విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు లెక్క చూసుకుని బాకీ రద్దుచేసుకున్నాడు.

అంజయ్య వేసిన 11 ఎకరాలు పత్తికీ ఎరువుల కొట్లో 18 వేల రూపాయల బాకీ అయింది. ఒక్క ఎకరానికి 15 వందల రూపాయల ఖర్చు అయింది. ఎంసియు.5 పత్తితోనే బాకీ మొత్తం తీర్చేశాడు.

"వచ్చేఏడు కూడా మన కొట్లో మందులు తీసుకుపోరా అంజియ్యా'' అన్నాడు వెంకట్రామయ్య.

"అట్నేలే అన్నా''

"మన వూళ్లో ఇయ్యేడు కల్తీమందులు కూడా కొన్ని కొట్లవాళ్లు అమ్మేర్రా''

"అమ్మితే అమ్మనీయ్‌లే అన్నా, మన కెందుకు వాళ్ళయవారం"

"నీకు తెలుసుగా, మన కొట్లో అలాంటివేం జరగవు. కాతా మాత్రం ఇక్కడే పెట్టు'' మళ్ళీ మరోసారి నొక్కి చెప్పాడు ఆయన.

"సర్లే అన్నా, ఇన్నిసార్లు చెప్పాలా?" అన్నాడు అంజయ్య.

వారంరోజులకు అంజయ్య తమ్ముడు రామయ్యా, అతని పిల్లలూ, భార్యా, అంజయ్య అమ్మా బళ్ళారినుంచి వచ్చారు.

ప్రకాశం జిల్లాలోని పత్తి రైతాంగం కర్ణాటక రాష్ట్రంలోని బళ్లారి, రాయచూరు జిల్లాలకు పత్తి పంట సాగుకోసం వలసలుపోయారు. కొన్ని గ్రామాలకు గ్రామాలే తరలివెళ్ళాయి. కొంత మంది రైతులు అక్కడే పొలాలు కూడా కొనుక్కొని స్థిరపడిపోయారు.

కొన్ని గ్రామాల్లో ప్రతి కుటుంబంనించీ ఒకరు బళ్లారివైపు పత్తిసాగుకోసం పోయారు. అలాగే అంజయ్య తమ్ముడు రామయ్య కూడా బళ్ళారి వెళ్లాడు.

రామయ్యకు ఇద్దరు కొడుకులూ, ఒక కూతురు. రామయ్య అమ్మని కూడా వెంట తీసుకుపోయాడు.

రామయ్యకు ఐదు ఎకరాల పొలం, అంజయ్యకు ఐదు ఎకరాల పొలం భాగాల పంపకంలో వచ్చింది. వాళ్ళ అమ్మ జీవనానికి ఒక ఎకరం పొలం పంచి ఇచ్చారు.

రాజమ్మ తీసుకువచ్చిన కట్నం డబ్బుతో ఒక ఎకరం పొలం కొనుక్కున్నాడు. మొత్తం 12 ఎకరాలు సాగుచేస్తున్నాడు అంజయ్య.

ఒక ఎకరం గొడ్లకి మేత పెట్టుకుని, 11 ఎకరాలు పత్తిపంట వేశాడు.

అంజయ్యవాళ్లు ఇద్దరు అన్నదమ్ములు, ఒక చెల్లెలు. చెల్లెలికి ఏడు సంవత్సరాల క్రితం పెళ్ళిచేశారు. వాళ్లది చందలూరు. చెల్లెలి పెళ్లికి పొలం ఏమీ ఇవ్వకుండా 50 వేల రూపాయల డబ్బూ, 10 సవర్లు బంగారం కట్నంగా ఇచ్చారు.

అంజయ్య తండ్రి కూతురి పెళ్లి కావటానికి ముందే చచ్చిపోయాడు. అంజయ్యా, రామయ్యా కలిసే చెల్లెలికి సంబంధం వెదుకులాడి పెళ్ళిచేశారు. తమకి ఉన్నంతలోనే ఎక్కువ కట్నం పెట్టారు. పెళ్లికి కానీ, చెల్లెలికి పెట్టిన కట్నానికి కానీ చాలా అప్పు చేశారు.

రామయ్యా, అంజయ్యా వేర్లుపడిన తరువాత చెల్లెలి పెళ్ళికి చేసిన అప్పులు కూడా చెరిసగం పంచుకుని ఎవరిబాకీ వాళ్లు తీర్చుకున్నారు. అన్నదమ్ములు ఇద్దరూ కూడా బాగా కష్టపడి పనిచేసేవాళ్లే.

గడచిపోయిన ఏడాది ఊళ్లో కౌళ్ళ ధరలు 12 వందలనించీ 15 వందలవరకూ వున్నాయి. మంచి పొలం ఎక్కువ కౌలూ, తక్కువ రకం పొలం తక్కువ కౌలూ. పొలాల్ని బట్టి, ఆ పొలాల్లో ఉన్న సత్తువని బట్టీ కౌళ్ళ ధరలు వుంటాయి.

రామయ్య పొలం ఐదు ఎకరాలు, తల్లి ఎకరం పొలం- మొత్తం ఆరు ఎకరాల పొలానికీ కలిపి, ఎకరానికి 13 వందల రూపాయల చొప్పున 7,800 రూపాయలూ, తల్లికి బట్టలు కొనుక్కోమని ఇంకో రెండువందల రూపాయలూ మొత్తం 8 వేల రూపాయలు అంజయ్య ఇచ్చాడు.

రామయ్యావాళ్లువారంరోజులు వుండి వడ్లు కొనుక్కుని బియ్యం మరకి వేయించుకుని అవి తీసుకుని బళ్ళారి వెళ్ళిపోయారు.

ఏప్రిల్ నెలాఖరు. ఎండలు మండిపోతున్నాయి. ఎండకితోడు హెూరుమని వడగాలి!

అంజయ్య ఇంటినిండా, పైన కప్పువరకూ డిసిహెచ్ 32 పత్తితో నిండివుంది.

హనుమంతరావు పదోతరగతి పరీక్షలు రాశాడు. "బాగా రాశా బాబా. ఫస్టుక్లాసు వస్తుంది'' అని చెపుతున్నాడు. స్కూల్‌ఫస్టు కూడా హనుమంతరావుకే వస్తుందని మేష్టార్లు కూడా అంజయ్యతో చెప్పారు.

"మొన్న రావూరు తగలబడిందంట బాబా, ఇళ్ళలో వున్న పత్తిమండెలు కూడా తగలబడినయ్యంట!'' అని ఊళ్లో తిరిగొచ్చి, వార్తలు చెపుతున్నాడు హనుమంతరావు. అంతకు ముందురోజు కూడా అలాంటి విషయమే చెప్పాడు.

"ఏమే, వాడి మాటలు ఇన్నావంటే?" అడిగాడు భార్యని అంజయ్య.

"ఇనేదేముందిలే, మనం కూడా పత్తిని ఇంక అట్టిపెట్టొద్దయ్యా. అమ్మేద్దాం. తొందరగా'' అంది రాజమ్మ.

"నేనూ అదే అనుకుంటన్నా. ఇంక ఆపొద్దు. రేపు మాపట్లో అమ్మేద్దాం. ఒకవేళ పొరపాటున ఏమైనా జరిగితే మనపని ఏమయిద్ది?"

రెండునెలల క్రితం 5 వందల రూపాయలకు కొనుగోలు చేసిన డిసిహెచ్ పత్తి ఇప్పుడు 725 రూపాయలు! ఒక్క క్వింటాల్‌కి 225 రూపాయలు పెరిగాయి.

అంజయ్య ఇంటికి మందులకొట్లు వాళ్లు వచ్చిపోతున్నారు. మందులకొట్ల వాళ్ళకి తోడు కొత్తగా వేరే దళారీలు కూడా తయారయ్యారు.

వెంకట్రామయ్య వచ్చాడు. "ఏరా అంజియ్యా, పత్తి అమ్ముతావంట్రా? మంచి పార్టీ వచ్చిందిరా!"

"అమ్మేద్దామనుకుంటున్నా అన్నా పత్తి కాటాలు వేసుకునే పనయితే వేసుకోండి''

"ఎన్ని కింటాళ్లు అయిద్దిరా పత్తి''

"ఒకలారీ పత్తి కావచ్చన్నా. నూటపది కింటాళ్లు అయిద్ది. తొక్కమంటే తొక్కుతా బూరేలు. రేటెంత?"

"రేటు ఏడొందలపదిరా. పదిరోజులు సైటు''

"తిరపతయ్య కొట్టోళ్లు ఏడూ ఇరవై అంట

న్నారుగా అన్నా, వాళ్లదీ పదిరోజుల సైటేగా''

"వాళ్లు పదిరోజులు అంటే నెలకి ఇస్తార్రా డబ్బులు. మనం అట్టకాదుగా. మాటంటే మాటే! మన యవారం తెలుసుగా''

"సరే అట్నే నీకే ఇస్తాంకానీ, పదిరోజులకి కచ్చితంగా ఇస్తావా మరి డబ్బు?"

"కచ్చితంగా అంటే ఏంట్రా? పక్కన మిల్లోల్లు ఇయ్యాలిగా. వాళ్లిస్తే నేను ఇచ్చేవోణ్ణి కానీ నా సొంత డబ్బేం ఇయ్యనుగా''

"ఒక రూపాయి అటో ఇటో కేష్‌కే అమ్మదా మనుకుంటన్నాలే అన్నా. అప్పుగా ఇచ్చి డబ్బు కోసం కొట్ల చుట్టూ ఎక్కడ తిరిగేది?" తేల్చి చెప్పాడు అంజయ్య.

"సరే నీ ఇష్టంరా, నాదేముంది?" అంటూ వెంకట్రామయ్య వెళ్లిపోయాడు.

అంజయ్య వాళ్ళకి దూరపు బంధువు నరసింహం అనే ఆయన కూడా దళారీ పని చేస్తున్నాడు. నరసింహం అల్లుడికి పర్చూరులో జిన్నింగుమిల్లు వుంది. అల్లుడి మిల్లుకి పత్తి కొనుగోలు చేస్తున్నాడు ఆయన.

నరసింహం నమ్మకమైన మనిషి. బాగా డబ్బువున్న మనిషి కూడా.

నరసింహానికి పత్తి ఇద్దామనుకున్నారు అంజయ్యా, రాజమ్మా.

"నరసింమామా... వచ్చి మా పత్తిచూడు. బూరేలు తొక్కుతాం" అని నరసింహం ఇంటికి వెళ్లాడు అంజయ్య.

మిల్లుగుమాస్తా, నరసింహం వచ్చారు. మిల్లుగుమాస్తా పత్తి నాణ్యం పరిశీలించి బూరేలు తొక్కమని చెప్పాడు.

"ఏడొందల పాతికరూపాయలు అబ్బాయి ధర. డబ్బు మాత్రం నెలరోజులకి ఇస్తాం" చెప్పాడు నరసింహం.

"సరే మామా.,.. రేపు మాయిటిపూట కాటాలు వేయండి. తొక్కటం ఇప్పుడే మొదలుపెడతాం"

"ఇంత పత్తి మీరు ఏం తొక్కుతార్రా? కాటాలు వేసే ముటావాళ్లకి చెప్పండి. వాళ్లు తొక్కుతారు. బూరేనికీ రెండు రూపాయలేగా!"

"మేం తొక్కుకుంటాంలే మామా! మళ్ళీ వాళ్లకి ఎక్కడ ఇచ్చేది డబ్బులు?" అని అంజయ్య మాదిగ పల్లెలోనికి పోయాడు. వాళ్ల ఇంటి మాదిగ యంగయ్య. ఆయననీ, ఆయన కొడుకూ, కోడల్నీ ముగ్గుర్ని పిలుచుకుని వచ్చాడు.

వీళ్ళ ఇంట్లో వాళ్లు ఐదుగురూ, వాళ్లు ముగ్గురూ- ఎనిమిదిమందిపడ్డారు బూరేలు తొక్కడానికి. రాత్రి ఒంటిగంటవరకూ తొక్కారు.

అందరూ ఒక నిద్రపోయి వేకువజామునే లేచారు.

ఉదయమే అన్నపూర్ణ ఇడ్లీలుచేసి తిన్నన్ని పెట్టింది.

కబుర్లు చెప్పుకుంటూ, పాటలు పాడుకుంటూ, చతుర్లాడుకుంటూ మధ్యాహ్నానికి బూరేలు మొత్తం తొక్కారు.

85 బూరేలు అయ్యాయి.

సాయంత్రానికి కాటాలు కూడా వేసుకున్నారు. 103 క్వింటాళ్లు అయింది డిసిహెచ్ పత్తి.

హనుమంతరావు లెక్కచూసి 74 వేలా 675 వస్తాయని చెప్పాడు.

కుడి ఎడంగా అంత డబ్బు వస్తుందని కొద్దిరోజులనించీ అనుకుంటున్నారు. కానీ కొడుకు నోటినుంచి అంకెలు వినబడటంతో రాజమ్మకీ, అంజయ్యకీ ఆనందంతో గుండె ఉప్పొంగిపోయింది. బూరేలు తొక్కటం మొదలుపెట్టిన దగ్గర్నించీ సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నారు.

"నేను పుట్టిన తరవాత ఇంత డబ్బు అసలు ఎప్పుడూ చూడలేదుకదే!" అన్నాడు అంజయ్య. ఆరోజు సాయంకాలం తలంటు స్నానంచేసి, అన్నానికి కూర్చుని రాజమ్మతో.

"నేను చూశానా నా జన్మలో! అసలు ఇంత

డబ్బు వచ్చిద్దని మనం కలలోనన్నా అనుకున్నామా?" అంది.

"బంగారమేనే ఇదంతా. అంతా బంగారపు పంట!"

"మామూలు బంగారం కాదు, తెల్ల బంగారం"

"చిల్లర మల్లర పంటలమీద ఇంతకు ముందు నాలుగయిదువేలు వస్తేనే గనం! ఇయ్యేడు మనకి లక్షరూపాయలు దాటిపోయినే, మొత్తం అవాజు, ఎంత డబ్బే''

"సరేగానీ అమ్మాయి పెళ్లి యవారం ఏం చేద్దామయ్యా? అందరూ పిల్లకి పెళ్లి చేయరా అని అడుగుతున్నారు'' అడిగింది రాజమ్మ.

"అమ్మాయి పెద్దమనిషి అయి రెండేళ్ళేగదంటే! ఇంతలోనే మునిగిపోయిందేం వుంది? చిన్నగానే చేద్దాం"

"చిన్నగా అంటే ఎట్ట? తొందరగా చేయటమే మంచిది. ఇప్పుడు ఆగితే రెండోపిల్ల కూడా ఎక్కివచ్చిద్ది. ఒకేసారి ఇద్దరి పిల్లలకి కట్నాలు పెట్టి చేయాలంటే కుదిరిద్దా?"

అంజయ్య ఆలోచిస్తూ మౌనంగా వున్నాడు.

నరసింహం నెలరోజులకు ఇరవైఐదువేలు ఇచ్చాడు.

అంజయ్య బ్యాంకులో కుదువపెట్టిన బంగారం డబ్బు కట్టి తీసుకువచ్చాడు. ఇరవై బస్తాలు వడ్లు వేసుకున్నారు. పశువులమేత కొన్నారు.

రాజమ్మ, అన్నపూర్ణ చీరాల వెళ్లి కుటుంబంలో అందరికీ బట్టలు తెచ్చారు. తరువాత ఒంగోలు వెళ్లి సంవత్సరానికి సరిపడా చిల్లర సరుకులు తెచ్చింది రాజమ్మ.

బ్యాంకులో కుదువపెట్టిన బంగారం, వడ్లు, మేత, బట్టలు, చిల్లర సరుకులకు పాతిక వేల రూపాయలూ ఖర్చయ్యాయి.



1985 జూన్. తొలకరి జల్లులు పడుతున్నాయి.

పంటలు వేసుకోవడానికి రైతులు పొలాలు బాగుచేసుకుంటున్నారు.

రెండు, మూడు సంవత్సరాల క్రితం టమేట, వంగ, బెండ, దొండ, మిరపలాంటి కూరగాయల పంటలూ, శనగ, పెసర, మినుము, కందిలాంటి అపరాల పంటలూ, జొన్న, వరిగలాంటి ధాన్యం పంటలూ- ఎక్కువ పొలం వున్నవాళ్లు వాణిజ్యపరంగానూ, తక్కువ పొలం వున్నవాళ్లు కుటుంబ అవసరాలకూ తప్పనిసరిగా పండించుకునేవారు.

ఇప్పుడు అలాంటి పంటల మాటేలేదు. అంతా పత్తే. వేసవికాలంలో ఎండుమేతగా పశువులకు ఉపయోగించుకునే జొన్నను కూడా పూర్తిగా మానుకున్నారు.

జొన్న వేసుకునే బదులు పత్తి వేసుకుని ఆ వచ్చే డబ్బుతో మాగాణి ప్రాంతానికి వెళ్లి అంతకు నాలుగురెట్లు వరిగడ్డి కొనుక్కోవచ్చని భావించారు.

పొలాలకు బాగా గిరాకీ పెరిగింది.

పోయిన ఏడాది అనుకున్నదానికంటే అధికంగా పత్తి పండి, బాగా లాభాలు రావడంతో అందరూ పత్తిపంట వేసుకుందామని నిశ్చయించారు.

అంజయ్యా, రాజమ్మా వాళ్లు కూడా కౌలుకి పొలం తీసుకుందామని చూస్తున్నారు.

పనిచేయగలిగిన శక్తీ సమర్థతా, పెట్టుబడీ, మనిషికి మనిషి ఆసరావుంటే ఎంత పొలం అయినా చేయగలమనే ధీమా రైతాంగానికి కలిగింది.

"ఇద్దరం చేసే ఈడులో వున్నాం. ఇంటి దగ్గర సముదాయించుకోడానికీ పనిలో చేదోడు వాదోడుగా వుండానికీ అమ్మాయి వుంది. మరి కాస్త పొలం తీసుకుని కష్టపడదామయ్యా'' అంది రాజమ్మ.

"ఎందుకమ్మా లేనిపోని బరువు పెంచుకోవడం? మనకి వున్న పొలం చేసుకుంటే చాలు! ఇప్పటికే కక్కాయి పొలానికీ, నాయనమ్మ పొలానికీ మగతా కడతంటిమి! మనవాళ్లు అయినా అవి మగతా పొలాల లెక్కేగదా? ఇంకా ఎందుకంట?" అంది అన్నపూర్ణ.

"డబ్బులు వచ్చేటప్పుడు చేసుకుంటే దండగేముండిద్ది? ఊరక ఇంటి దగ్గర కూర్చుంటే వచ్చిద్దీ కూడు? అసలు ముందు మిమ్మల్ని ఒక అయ్య చేతిలో పెట్టొద్దూ?" అంది రాజమ్మ.

"మనం ఎంతమాత్రం వాళ్ళమి? మన శక్తి ఎంత? నష్టం వస్తే తట్టుకోవద్దంటే..."

"నీ మొకం, నష్టం ఎందుకు వచ్చిద్ది? పత్తిలో ఎప్పుడూ దండగపడలా!" అంది రాజమ్మ.

"మరి ముందటేడు నష్టాలు ఎందుకు వచ్చినయ్యి?" అంది అన్నపూర్ణ.

"ముందటేడు నష్టం ఎందుకు వచ్చింది? వానలు సరిగా కురవక దిగుబడి తగ్గింది. అప్పటికీ ఎకరానికి వెయ్యో, రెండువేలో మిగిల్నియిగా'' అన్నాడు అంజయ్య.

"ఇయ్యేడు మాత్రం వానలు సరిగా కురుస్తయ్యనే నమ్మకం ఏముంది బాబా? మన తాహతునిబట్టి పోతే బాగుండిద్ది. పుగాకు యేసి ఇట్టాగే కదూ దివాలా ఎత్తింది''

"పుగాక్కీ, దీనికీ తేడా వుందిలేమ్మా పూర్ణా. పుగాకు యేసి నానా బాధలు పడ్డాం. అప్పుడు ప్రతిదానికీ ఊళ్ళమీద పడాల్సిందే! నారుకి రాజమండ్రిపోవాలి, బొగ్గుకి కొత్తగూడెం పోవాలి, అమ్మకానికి గుంటూరో, ఒంగోలో పోవాలి. ఎట్టో కట్ట, ఎక్కడోచోట అమ్మినా డబ్బుకి వాళ్ళు ఎన్నో తిప్పలుపెట్టి చంపేరు. డబ్బుకోసం తిరగలేక బగమంతుడే గుర్తుకొస్తాడనుకో! పుగాకు కంపినీ వోళ్ళు ఎంత మందికి డబ్బు ఎగవెయ్యలేదు. వాళ్ళు రైతులికి ఎగేసి పెద్దోళ్ళయి ఎంపీలూ, మంత్రులూ అయ్యేరు. పత్తికి ఈ బాధలు ఎక్కడున్నయ్యమ్మా! దీనికి ఊరు దాటే పని వుండదాయె!" అన్నాడు అంజయ్య.

ట్రాక్టరు బాపయ్య పొలం కౌలుకి ఇస్తున్నట్లు అంజయ్యకు తెలిసింది. బాపయ్య పొలం నాలుగు ఎకరాలు వీళ్ళకి కాడిగట్టుచేనే. అదీ, ఇంకా అక్కడకి దగ్గర్లో వున్న రెండు ఎకరాలు మొత్తం ఆరు ఎకరాలు కౌలుకి తీసుకుందామని రాజమ్మ, అంజయ్య అనుకున్నారు. బాపయ్య ఇంటికి వెళ్ళి అడిగాడు అంజయ్య.

"నాకు ట్రాక్టరూ, రైసుమిల్లూ, పొలం పనీ-వీటన్నిటికీ తూగుబాటు కావటం లేదు అంజయ్యా, అందుకే పొలం కౌలుకి ఇస్తన్నా, తీసుకునే పనయితే తీసుకో మరి''

ఒక ఎకరం 2150 రూపాయల లెక్కన ఆరు ఎకరాలకు కౌలు కుదిరింది.

నెలరోజులకు డబ్బు ఇస్తామని పత్తి కొనుగోలు చేసిన నరసింహంరెండునెలలు దాటినా డబ్బు మొత్తం ఇవ్వలేదు. నెలరోజులు దాటిన తరువాత 25 వేలు మొదటి దఫాగా ఇచ్చాడు. రెండవదఫా 20 వేలు ఇచ్చాడు.

కౌలుకి తీసుకున్న 6 ఎకరాలు పొలానికీ లెక్కచూసి డబ్బు తీసుకుపోయి బాపయ్యగారింటిదగ్గర ఇచ్చి వచ్చాడు అంజయ్య.

అదునులో విత్తనాలు నాటుకోవాలని అందరూ తొందరతొందరగా పొలాలు బాగుచేస్తున్నారు. ఇద్దరు కూలీల్ని తీసుకుపోయి అంజయ్య పిచ్చిచెట్లు కొట్టి చేలు బాగుచేశాడు. పొలాల్లో గొర్లూ, గుంటకలూ తోలుకుంటున్నారు.

★ ★ ★

అంజయ్యవాళ్ళు మొత్తం 18 ఎకరాలు సాగుచేస్తున్నారు. అంత పొలం దున్నలతో సేద్యం చేయాలంటే అసాధ్యం. దున్నలు అమ్మి ఎద్దులు కొందామని దున్నలకి బేరం పెట్టాడు.

ఎద్దులకోసం అంజయ్య రెండుమూడు వూళ్ళు తిరిగాడు. ఎక్కడా దొరకలేదు.

నాలుగురోజుల తరువాత 5 వేలు డబ్బుతీసుకుని సుబ్బన్నతోపాటు నెల్లూరువైపు వెళ్ళాడు అంజయ్య ఎద్దులకోసం.

అటువైపు గ్రామాల్లో మూడురోజులు తిరిగారు. చివరికి నాలుగు వేలుపెట్టి అంజయ్యకు జత ఎద్దులు కొనిపెట్టాడు సుబ్బన్న.

"అయితే సుళ్ళు ఏం లేనట్టేనా?" అడిగాడు అంజయ్య.

"ఉంటే కనబడవంట అంజయ్యా, గిత్తలు చూడు, నికార్సయిన గిత్తలనుకో! రెండేళ్ళు నీవు పనిచేసుకుంటా మేపుకున్నావంటే నీకు ఇంకో రెండు వేలు లాభం కూడా ఇచ్చి తీసకపోతారు'' అన్నాడు సుబ్బన్న.

అంజయ్యకు కూడా ఎద్దులు బాగా నచ్చాయి.

సుబ్బన్న నలుగురు రైతుల్ని తీసుకుపోయాడు. నలుగురికీ నాలుగు జతల్ని కొనిపెట్టాడు. అన్నిటికంటే తన ఎద్దులే బావున్నట్లు అంజయ్య సంతృప్తి చెందాడు.

అన్ని ఎద్దుల్నీ లారీకి ఎక్కించుకుని పమిడిపాడు చేరుకున్నారు. అందరి మీదా ఖర్చులు భరించి, సుబ్బన్నకు వందరూపాయలు దళారి రుసుం ఇచ్చాడు అంజయ్య.

"గిత్తల్లో నాలి లేదట్టుగా వుందిగా?" అంది రాజమ్మ వాటిని చూసి.

"నాలి తక్కువగా వుంది. దక్షాది కల్లి సరిగా మేపరే ఎద్దుల్ని. మనం నెలరోజులు



బాగా మేపుకున్నామంటే గిత్తలు బలుస్తయి. పొడిచేయి కూడా కాదు, యీటిని మన చిన్నమ్మాయి అయినా సరే కట్టేయొచ్చు'' అన్నాడు అంజయ్య.

"అందరూ నుయ్యిమట్టి తోలుకుంటున్నారు. మనం కూడా తోలకం మొదలు పెడదామయ్యా!" అంది రాజమ్మ.

"రేపట్నించే తోల్దాం. బండికి మట్టి పోయడానికి పోలయ్యని రమ్మని చెప్పా, పొద్దున పల్లెలోనికి పోయినప్పుడు. మన పొలానికి మన నుయ్యి సరిపోదే. గొల్ల కర్రోడు నుయ్యి అమ్ముతానంటన్నాడు. అది కూడా కొనుక్కని తోలుకుందాం" అన్నాడు అంజయ్య.

ఎద్దులకి మేతవేసి, రాజమ్మ, అంజయ్య దడిదగ్గరనించి ఇంటికి వచ్చారు.

"బాబా, మాకు మార్కుల లిస్టులు వచ్చినయ్యే!" అన్నాడు హనుమంతరావు అప్పుడే వచ్చి.

"నీకు ఎన్ని మార్కులు వచ్చినయ్యిరా?"



అడిగింది అన్నపూర్ణ.

"468 మార్కులు వచ్చినయ్యి. స్కూల్లో సెకండున వచ్చాను''

"మరి ఫస్టెవ్వర్రా?" అడిగింది రాజమ్మ.

"లెక్కల పంతులుగారమ్మాయి వందనకి ఫస్టు వచ్చింది. ఆ అమ్మాయికి 469 మార్కులు వచ్చినయ్యి. ఆ అమ్మాయి కంటే ఒక మార్కు తగ్గా''

"ఆ అమ్మాయికంటే మిగులుగా చదువుతాను, స్కూల్లో ఫస్టున రావాలి అని పోటీపడి చదివితివిగదరా, మరి ఒక మార్కు తగ్గావుగా'' అంది అన్నపూర్ణ.

"నాలుగు సబ్జెక్టుల్లో ఫస్టున నేనొచ్చానే, రెండు సబ్జెక్టుల్లో ఆ అమ్మాయి మిగిలింది'' అన్నాడు హనుమంతరావు.

"మరి ఏకాలేజీలో చేరదామనుకుంటున్నావురా?"

"గుంటూరు జేకేసీ కాలేజీకి, చీరాల కాలేజీకీ అప్లయ్ చేద్దామనుకుంటున్నా బాబా. ఎక్కడ సీటొస్తే అక్కడ చేరతాను''

"నీ ఇష్టంరా, మాదేముంది? చదవులు గురించి మాకేమి తెలిసిద్ది? నీకు ఎక్కడ బాగుండిద్దనుకుంటే అక్కడ చేరు'' అన్నాడు అంజయ్య.

"ఏం గ్రూపు తీసుకుంటావురా?" అడిగింది అన్నపూర్ణ.

"ఎంపీసీ తీసుకుంటానక్కాయ్''

"అది తీసుకుంటే ఏం కావచ్చు?"

"ఇంజనీరు కావచ్చు. ఇంజనీరింగ్ సీటు రావడం కష్టం అనుకో! జేగర్తగా చదివితే నాకు గేరంటీగా సీటొచ్చిద్ది''

"నీకు బాగుండిద్దనుకున్నచోట చేరి చదువుకోరా! నువ్వు బాగా చదువుకుంటానంటే మాకు ఇంక అంతకంటే కావాల్సిందేంవుంది?" అంది రాజమ్మ.

వాళ్ళకి ఆరోజు సంతోషంగా వుంది. హను మంతరావుకి స్కూల్లో సెకండ్ర్యాంకు రావ డంతో ఇంటిల్లిపాదీ ఆనందంగా వున్నారు. ఆ సాయంత్రం రాజమ్మ పిండివంటలు చేసి పిల్లలకు పెట్టింది.

నుయ్యి మట్టి తోలకం పది రోజులు పట్టింది. గొల్ల కుర్రోడి నుయ్యి కూడా కొని తోలారు.

హనుమంతరావు చీరాల, గుంటూరు రెండు కాలేజీలకూ అప్లయ్ చేసాడు. రెండు కాలేజీల్లోనూ సీటొచ్చింది.

హైస్కూల్ హెడ్మాస్టరు, ఇంకా ఇద్దరు ముగ్గురు సలహాతో గుంటూరు జెకెసీలో చేరా డు. గుంటూర్లో అయితే మంచి కోచింగ్ సెంటర్లు వుంటాయి, చదువుకుంటూనే కో చింగ్ తీసుకోవచ్చని సలహా చెప్పారు.

నరసింహం ఇంటిచుట్టూ అంజయ్య పత్తి డబ్బులకోసం తిరుగుతున్నాడు.

"మాకు డబ్బులు గట్టిగా అవసరం నర సింహ మామా! అప్పుడు నెలరోజుల సైటు అనుకున్నాం. రెండు నెలలు దాటిపోయింది, నువ్వుపోయి గట్టిగా అడిగి డబ్బు తీసుకురా వాలి మామా!"

"నేను చార్జీలు పెట్టుకుని నాలుగు రోజు లకు ఒకసారి పోయి వస్తూనే వున్నారా అంజ య్యా, పాపం, వాళ్ళకి మన పత్తిలో ఆదాయం ఏమీ లేదు, దండగేకానీ. ఇప్పుడు పత్తి ధర ఎంత వుందనుకుంటున్నావు? ఆరొందలలోపే కానీ ఎక్కువ లేదురా!"

"వాళ్ళకి దండగైనా, లాభమైనా మనకేం సంబంధం మామా? వాళ్ళకి లక్షల్లక్షలు లాభా లొస్తే మనకేమన్నా ఒక రూపాయి ఎక్కువిస్తా రూ? అనుకున్నది అనుకున్నట్లు ఇవ్వాలి గానీ..."

"ఇవ్వకుండా వాళ్ళేమన్నా ఎగేసారంట్రా అంజయ్యా అట్ట మాట్టాడతావు? కొద్దిగా ఆలి స్యం అయింది, అంతేగా, నేను రేపొద్దున పోయి కొంత తెచ్చిస్తాలే!"

"కాస్తాకూస్తా ఇస్తే కుదరదు మామా. నాకు అవసరం. రావాల్సిన డబ్బు మొత్తం ఇవ్వా ల్సిందే'' అంటూ అంజయ్య లేచివచ్చాడు.

మరుసటిరోజు ఉదయం హనుమంతరావు గుంటూరు ప్రయాణం అయ్యాడు. అంజ య్యా, రాజమ్మా సూటుకేసూ, బ్యాగూ తీసు కుని అతని వెంట బస్టాండు దాకా వచ్చి, అతనిని బస్సు ఎక్కించారు.

హనుమంతరావు గుంటూరు జెకెసీలో ఇంటర్మీడియట్ కోర్సులో చేరాడు.

★ ★ ★

జులై నెల.

చెదురుమదురుగా వానలు పడుతున్నాయి. అయితే భూమి పదును అయ్యే వర్షం మాత్రం పడలేదు.

సహజంగా జులైనుంచే పత్తి విత్తనాలు నాటడం మొదలుపెడతారు. ఆగస్టు మొదటి వారానికి ముందువాళ్ళూ, వెనుకవాళ్ళూ అందరూ విత్తనాలు నాటడం అయిపోతుంది.

కొంతమంది పొలాలు బాగుచేసుకుని అచ్చులు కూడా తోలి పెట్టుకున్నారు. వర్షం ఎప్పుడు పడితే అప్పుడు విత్తనాలు నాటుకోవ చ్చు.

గత ఏడాది మంచి లాభాలు రావడంతో రైతాంగం అంతా పత్తి వేయడానికి పూనుకు న్నారు. వానకోసం ఆశగా ఎదురుచూస్తున్నా రు.

"వెంకట్రామయ్య రెండు మూడుసార్లు ఇంటికొచ్చిపోయాడు. వాళ్ళ కొట్లోకి మంచి విత్తనాలు వచ్చినయ్యంట. వచ్చి తీసుకపొ మ్మంటన్నాడు. అయిపోతే దొరకవమ్మాయి అని చెప్పాడు'' అంది అన్నపూర్ణ.

"యిత్తులు ముందే తెచ్చిపెట్టుకోటం మంచిదే! రేపు వానలు పడిం తర్వాత యిత్తు లు కావాలని పరిగెత్తితే దొరుకుతయ్యా?"

"ఇంట్లో డబ్బులున్నయిగా, రెండు మూడు చోట్ల యిచారించి, మంచి యిత్తులు చూసి,

# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: *2,000/-* పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**



ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

సెప్టెంబర్ చతుర నవల ఆక్రందన

సమీక్షకుని పేరు : ..........................................................

చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

..........................................................

బేరం చేసి తీసుకురా. ఇయ్యాలో, రేపో తీస కరా ఆలస్యం చేయొద్దు'' అంది రాజమ్మ.

మరుసటిరోజు వెంకట్రామయ్య ముఖాన నవ్వు పులుముకుని వచ్చాడు.

"ఏందిరా అంజయ్యా, నేను రోజూ వచ్చి పోతంటే కనపట్టం లేదేందిరా? ఎద్దులు కొన్న ట్టుగా వుంది, సేజ్జం చేస్తున్నావా? అసలు ఇంటిదగ్గర వుంటంలేదట్టుగా వుందేమిరా నువ్వు? పొలం బాగుచేయటం అయిందా?"

"బాగుచేసేం అన్నా, ఏందీ పనిమీద వచ్చావు?"

"పనిమీదా, పాడా? మన కొట్లోకి పత్తి యిత్తులు వచ్చినయ్యిరా. మంచి రకం యిత్తులు. బెమ్మాండంగా దిగుబడి వచ్చిద్దనుకో. మనకి తెల్సినోడు తీసుకొచ్చి యేసాడు కొట్లో. ఎకరాకి పదహారు కింటాళ్ళు దిగుబడి వచ్చిద్దిరా. గేరంట్ కూడా ఇచ్చాడు. నీకు కావాల్సిన యిత్తులు వచ్చి తీసుకపోరా!"

"ఏఏ రకం యిత్తులు వుండయ్యేంది?"

"అన్ని రకాలూవుండయ్యిరా. డిసిహెచ్ వన్, హెచ్ ఫోర్... మన కొట్లోలేని రకమే లేదనుకో. రారా, వచ్చి నీక్కావలసిన యిత్తులు తీసకపో. డబ్బులకేం గత్తరలేదులే, వుండప్పుడే ఇద్దువు''

"సరే... నువ్వు పా అన్నా, నేను వచ్చి తెచ్చుకుంటాను. దడి దగ్గరకి పోవాలి, ఎద్దులు బయట కట్టేసి వచ్చా''

"ఇయ్యేడు యిత్తులకి మరీ డిమాండుగా వుందిరా. నిరుటికంటే యిత్తుల రేట్లు నాలుగు రెట్లు పెరిగినయ్. నిరుడు 50 రూపాయల మ్మిన కొత్త యిత్తనం ఇయ్యేడు 3 వందలంట! ఈ డిమాండులో కల్తీ సరుకు కూడా బాగా వచ్చిందంటన్నార్రా! ఎక్కడిదాకానో ఎందుకు, మన ఊరికే కల్తీ యిత్తులు వచ్చినయంట, నీ ఇష్టం, నువ్వు యిత్తుల్లో మాత్రం జాగ్రత్తపడాలి'' అన్నాడు వెంకట్రామయ్య.

"సరేలే అన్నా, మన కొట్లో మంచి యిత్తులేగా, మీ దగ్గరే తీసుకుంటాం" అని అంజయ్య లేచి దడి దగ్గరకి వెళ్ళిపోయాడు.

రెండు మూడు కొట్లలో ధరలు విచారించి, నాణ్యమైన విత్తనాలు తెచ్చుకుందామని రాజమ్మా, అంజయ్యా అనుకున్నారు. అంజయ్య ముందుగా తిరుపతయ్య కొట్టుకి వెళ్ళాడు.

"డబ్బులు తరవాత ఇద్దువులే అంజయ్యా, నీకు కావాల్సిన యిత్తులు తీసుకపో'' అన్నాడు అతను.

జెకెహెచ్ 1 రకం 200, హెచ్ 4 రకం 200, డిసిహెచ్ 32 రకం 140 రూపాయలూ రేట్లు చెప్పాడు తిరుపతయ్య.

"రేట్లు కనుక్కుందామని వచ్చాన్లే, తరవాత వచ్చి తీసకపోతా!" అని అంజయ్య వచ్చాడు. తరువాత వెంకట్రామయ్య కొట్టుకి వెళ్ళాడు.

ఆయన కొట్లోలేడు. ఆయన కొడుకు శేఖర్ కూర్చుని వున్నాడు సిగిరెట్ దమ్ము కొడుతూ.

"మీ నాన్న లేడంటబ్బాయి?"

"లేడు బాబాయ్, దా, కూచో, ఏందీ పని మీద వచ్చావు? విత్తనాలు ఏమన్నా కావాలా?"

"కావాలబ్బాయి, ఎంతలో వున్నాయి రేట్లు?"

"జెకెహెచ్ 1-220, హెచ్4-240, డిసిహెచ్32- 140 రూపాయలూ'' చెప్పాడు శేఖర్.

"ధరలు ఎక్కువ చెపతన్నావబ్బాయి?"

"నాణ్యమైన యిత్తులు బాబాయ్. సరే, నువ్వు కావాల్సిన యిత్తులు తీసకపో, నాన్న వచ్చి రేట్లు వేసుకుంటాడు. లాభం లేకుండా మాకు వచ్చిన రేటే వేస్తాడ్లే బాబాయి నీకు నాన్న!"

"ఇప్పుడు తీసకపోయేటంత గత్తరలేదుగా. మీ నాన్న వచ్చిన తరవాతే డబ్బులు కట్టి తీసకపోతా'' అంటూ లేచాడు అంజయ్య.

డబ్బు అనే మాట విన్నవెంటనే శేఖర్ ఆత్రంగా అన్నాడు. "సంచికి మేం అమ్మే

రేటుకంటే 20 రూపాయలు తగ్గించి తీసుకో బాబాయ్ నువ్వు''

"మళ్ళీ వస్తాలే' అని అంజయ్య లేచి వచ్చాడు.

ఇంటికి వచ్చి రాజమ్మకి రేట్ల విషయం చెప్పి "ఏ పత్తి ఎన్ని ఎకరాలు యేస్తే బాగుండి ద్దంటావు?" అని అడిగాడు.

"నాకేం తెలుసయ్యా? ఏవి మంచివి అనుకుంటే ఆ యిత్తులు తీసుకరా! రెండు రకాలు ఆరేసి ఎకరాలూ, ఒక రకం ఐదు ఎకరాలూయే ద్దాం"

అంజయ్యా, అన్నపూర్ణా కూర్చుని విత్తనాలు ఎంత అవుతాయో లెక్క చూశారు. అంత డబ్బు జేబులో వేసుకుని బజారుకు వెళ్ళాడు అంజయ్య.

వెంకట్రామయ్య కొట్టుకి వెళ్ళి డబ్బు ఇచ్చి జెకెహెచ్1 రకం, డిసిహెచ్ 32 రకం విత్తనాలు తీసుకువచ్చాడు. హెచ్4 విత్తనాలు 220 రూపాయలకి తక్కువ ఇవ్వనని చెప్పటంతో అవి తిరుపతయ్య కొట్లో 200 చేసి తీసుకువచ్చాడు.

ఒక్క ఎకరానికి ఒక కిలో విత్తనాలు అవసరం అవుతాయి. మొత్తం 17 కిలోల విత్తనాలు కొనుక్కువచ్చాడు. వాటికి 31 వందల రూపాయలు అయ్యాయి.

"ఎదవ యిత్తులకే మూడువేలు అయినే, రేపు మందులకి ఇంకెన్ని వేలవుతాయో!" అంది రాజమ్మ ఆశ్చర్యంగానూ, కొంత ఆందోళనగానూ.

"కానియ్యావే, చేనుకి డబ్బులు పెట్టకుండా రమ్మంటే రేపు ఎక్కడ్నించి వస్తయ్యి? మంచి విత్తనం వెయ్యకుండా, మంచి పంట రమ్మంటే వచ్చిద్దా?"

"రేట్లు మరీ మండిపోతున్నయ్! నిరుడు అరవై రూపాయలకిచ్చిన సంచి ఇయ్యేడు 2 వందలంటే మాటలా? యిత్తులకి ఇంత రేటు ఎప్పుడూ లేదు''

"దేశమంతా పత్తేనే ఇయ్యేడు. అందరూ పత్తి నాటతా యిత్తులు కావాలని ఎగబడితే వాటికి మాత్రం రేట్లు పెరగవా?" అన్నాడు అంజయ్య.

అంజయ్య పొలం అంతా బాగు చేసిపెట్టాడు. దుక్కిలో ఎరువుమందు చల్లాడు. దుక్కిలో మందు చల్లితే మొక్కలు ఏపుగా పెరుగుతాయి.

ప్రతీ ఘడియా వానకోసం ఆకాశంలో మబ్బులకేసి ఆశగా ఎదురు చూస్తున్న రైతుల కలలు ఫలించినట్లు ఆగస్టు 15వ తేదీ ముసురుపట్టి తెలికపాటి జల్లులూ పడ్డాయి, 16న మంచి వర్షం కురిసింది. రైతుల హృదయాలు ఆనందంతో కేరింతలు కొట్టాయి.

15వ తేదీ రాత్రే రైతులు అందరూ విత్తనాలు నాటడానికి కూలీలకోసం మాదిగపల్లి, మాలపల్లిమీద పోయి పడ్డారు.

ఆ పల్లెల్లో వాళ్ళు కూడా దాదాపు అందరూ ఎకరం, అర ఎకరం, 10 సెంట్లూ, 20 సెంట్లూ పత్తి వేస్తున్నారు. వాళ్ళకి పొలాలు లేకపోయినా వాగులూ, వంకలూ, డొంకలూ, చేళ్లూ, బీళ్ళూ ఎవరికి ఎక్కడ కాస్తంత జాగా దొరికితే అక్కడ బాగుచేసుకుని పత్తి వేస్తున్నారు.

రేపు తమ పొలంలో విత్తనాలు నాటుకుని, తరువాత రోజు వస్తామని కూలీలు అన్నారు. ఇంట్లో ఎక్కువమంది జనాభావుండి, కూలీకి వెళ్ళేవాళ్ళు ఉన్నట్లయితే 30, 40 రూపాయలు కూలీ అడిగారు.

భూమిలో పైన తేమ వున్నప్పుడు నాటితే విత్తనాలు బాగా మొలుస్తాయి. తేమ ఆరిపోతే విత్తనాలు మొలకెత్తడం కష్టం. అప్పుడు మళ్లీ కావిళ్ళతో నీళ్ళు మోసి, అవి పోసి విత్తనాలు నాటాలి. కావిళ్ళు అయితే చాలా కూలి అవుతుంది.

బురదలో విత్తనాలు నాటాలని అంజయ్య కూలీలకోసం వూరంతా తిరిగి వచ్చాడు. అతి కష్టంమీద ఐదుగురు దొరికారు. సాధారణంగా 7, 8 రూపాయలు వుండే కూలీ ఆ రోజు 40!

రాజమ్మ ఆరోజు రాత్రే విత్తనాలు నీళ్ళలో

నానపోసింది. వాళ్ళ ఇంటికి దగ్గరగా వుండే వడ్డిపాలెం పోతే ఇద్దరు కూలీలు దొరికారు.

రాజమ్మా, అన్నపూర్ణా, చిన్నకూతురు రమా దేవికి బడిలేకపోతే ఆ అమ్మాయీ, కూలీలూ అందరూ వెళ్ళి విత్తనాలు నాటారు. వాళ్ళ పొలం మూడు రోజులు పట్టింది విత్తనాలు నాటడం.

రాజమ్మా, అన్నపూర్ణా కూలీలు విత్తనాలు ఎలా నాటుతున్నారో అని వాళ్ళని ఓ కంట కనిపెడుతూ, "అదునూ, పదునూపోతే రాద మ్మా, రేపు పడి విత్తనాలు వేసుకోవాలంటే బాధపడాలి. ఇవి ఖరీదు యిత్తులు. జాగ్రత్తగా నాటండమ్మా!" అని కూలీల్ని మరీమరీ హె చ్చరిస్తూ విత్తనాలు దగ్గర ఉండి నాటించారు.

★ ★ ★

నరసింహం పత్తికి ఇవ్వాల్సిన మిగిలిన బాకీ మొత్తం ఇంటికి తీసుకువచ్చి ఇచ్చాడు. "ఈ డబ్బుతో నీ బాకీ అంతా రద్దయిపోయిన ట్లే అంజయ్యా, ఇంక బాకీలేదు. దూది బేళ్ళు కొనేవాళ్ళు లేకా, డబ్బు దొరక్కా, పాపం, వాళ్ళూ ఇబ్బందుల్లో పడి ఆలస్యం చేశారు. డబ్బు అనుకున్నటయానికి కట్టలేకపోయారు''

"సరేలేమామా, వాళ్ళకీ దండగలొచ్చీ, దర ల్లేక ఇబ్బంది పడ్డారట్టుగా వుంది. వాళ్ళు మాత్రం కావాలని ఎందుకు ఆలిస్యెం చేస్తార్లే'

"నువ్వు జాతకుడివిరా అంజయ్యా, మంచి ధరకి పత్తి అమ్ముకున్నావు, ఇంకా ధర పెర్గిగి ద్దని అమ్మకుండా పత్తి ఆపుకున్నోళ్ళ పని చూడు! ఇయ్యాల ఆరొందలు చేసి కొనే నాధు డు లేడు. సరే, డబ్బు జేగర్తరో, బాకీ లేదు ఇంక" అని నరసింహం వెళ్ళిపోయాడు.

"ఇంటోవుంటే ఈ డబ్బు దేనికోదానికి కర్చయిపోయిద్దిగానీ, తీసకపొయ్యి ఏదో ఒక మందుల కొట్టో ఇచ్చిరాయ్యా. రేపట్నించీ పురుగుమందులూ, ఎరువులూ తెచ్చుకోవాలి గా మళ్ళీ'' అంది రాజమ్మ.

"ఏ కోట్లో కాతా పెట్టాలో అర్ధంకాలేదే. చిక్కి తే రైతుని పీల్చి పిప్పిచేసి వదిలి పెట్టేవాళ్ళా యెమనూరి ఎరువుల కొట్టోళ్ళు, నిరుడు ఎంక ట్రామయ్య డూప్లికేటు నువాక్రాను మందు తీసుకురాలా? ఈ సాల్లో కూడా తీసుకరాడని నమ్మకమేంది?"

"మరి మందుల కాతా ఎక్కడ పెడదాం?"

"నాగేస్సరావు కొట్లోనో, తిరపతయ్య కొ ట్లోనో కాతా పెడితే ఎట్టుండిద్ది?"

"వాళ్ళు కూడా నిరుడు డూప్లికేటు మందు తెచ్చారని అంటన్నారు గదయ్యా?"

"ఇయ్యేటికి ఎంకట్రామయ్య కొట్లోనే కాతా పెట్టండి బాబా. ఒకసారి కాకపోతే ఒకసారైనా ఈయన తనామనా అనుకుంటాడు. ఈయనకి మిగతా వోళ్ళంత డబ్బు దానుడు కూడాలేదు. వాళ్ళది మరీ నిలువు దోపిడాయె!" అంది అన్నపూర్ణ.

"అంతా ఒకర్ని మించిన వాళ్ళు ఒకర్లే అమ్మాయి. వీళ్ళతాత వాడు అయితే వాళ్ళ తాత వీడు. అందరూ నిలువుదోపిడీ చేసేటో ళ్ళే. సరే, ఇయ్యేటికి వాడి కొట్లోనే కాతా పెడదాంలే' అన్నాడు. అంజయ్య.

అంజయ్య ఆ డబ్బు తీసుకుపోయి వెంకట్రా మయ్య కొట్లో ఇచ్చాడు.

"ఎన్ని ఎకరాలు వేసావురా పత్తి?" అడిగా డు ఆయన.

"పదిహేడు ఎకరాలు వేశాను అన్నా''

"మరి పదిహేడు ఎకరాలు వేస్తే ఈ పదిహే ను వేలు ఏం సరిపోతయ్యిరా? ఇంకా పదిపది హేను వేలు చూస్తే మా తంటాలు మేం పడి మీకు చివరిదాకా అప్పు ఇస్తాం"

"సరే, అట్నే చూసి ఇస్తాలే అన్నా''

"ఎప్పుడు?"

"ఇరవై రోజుల్లో ఇస్తాగా''

"తరవాత దొరకలేదంటే మాత్రం బాగుండ దురా అంజయ్యా. నువ్వు ఇంకా పదిహేను వేలు ఇయ్యకపోతే మందులు ఇయ్యడం సగంలోనే మానుకుంటాం. ముందే చెపత న్నా. పైరు సగంలో మానుకుంటే ఇద్దరికీ

బాధే!"

"సరే'' అంటూ అంజయ్య లేచి వచ్చాడు.

★ ★ ★

వేకువజామునే అంజయ్య గొడ్లు దగ్గర బాగుచేసుకుని, పత్తి విత్తనాలు ఎలా మొలిచాయో చూద్దామని పొలం వెళ్లాడు.

దారిలో కొన్ని పొలాలు చుక్కల మాదిరిగా మొలిచి సాల్లు పట్టి కనపడుతున్నాయి. ఆలస్యంగా నాటిన వాళ్ల పొలాల్లో అప్పుడే మొలక వస్తోంది.

జెకెహెచ్‌వన్, హెచ్‌ఫోర్ నాటిన పొలాలు చూసిన అంజయ్యకు గుండె బేజారెత్తింది.

ఆ పొలాలు సరిగా మొలవలేదు. ఆ రెండు రకాల విత్తనాలు పన్నెండు ఎకరాలు నాటాడు. ఎక్కడో ఒక మొక్క కనపడుతోంది. ఐదారు పాదులు పెకిలించి చూశాడు. మొలక వస్తున్న జాడేలేదు.

డిసిహెచ్ చేలోకి వెళ్లాడు. ఆ విత్తనం బాగా మొలిచింది. అసలు ఆ చేలో పడి విత్తనాలు కూడా వేసే అవసరం లేనంత చక్కగా మొలిచింది.

"చివరి రోజున నాటిన డిసిహెచ్ బాగా మొలవడం ఏమిటీ? ముందు రోజునాటిన విత్తనాలు మొలవకపోవడం ఏమిటీ? సరే, రేపటికి ఏమైనా మొలక రావచ్చేమో'' అనుమానంగా అనుకుంటూ అంజయ్యా ఇంటికి వచ్చాడు.

"బాగా మొలిచినయ్యా పత్తిచేలు?" అంజయ్య కోసం ఎదురు చూస్తూ ఇంటికి వచ్చిన వెంటనే అడిగింది రాజమ్మ.

చెప్పాడు అంజయ్యా.

"ఆ రెండు పొలాలు ఎందుకు మొలవలేదు? నేనూ, అమ్మాయీ దగ్గరుండి జేగర్తగా నాటించామయ్యా యిత్తులు. మొలవకపోవడం ఏందీ?"

కొంతమంది పడి విత్తనాలు కూడా వేసుకుంటున్నారు. పత్తి విత్తనం నాలుగు రోజులకే మొలిచి రెండు ఆకులు వేస్తుంది. ముందు మొలిచిన మొక్కలతో సమంగా వెనుక మొక్కలు కూడా రావాలంటే, ఎంత తొందరగా పడి విత్తనాలు నాటుకుంటే అంత మంచిది.

రాజమ్మకి ఒక్క నిముషం కూడా ఇంట్లో ఉండ బుద్ధి కాలేదు. ఎప్పుడెప్పుడు పొలంపోయి చూద్దామా అని మనసు ఆతృత పడిపోతోంది. అంజయ్యకి అన్నం పెట్టి, తొందరతొందరగా తనూ తిని, కండువా తీసుకుని బయలుదేరింది.

వడివడిగా వచ్చి పొలమంతా చూసిన రాజమ్మకి బాగా నీరసం వచ్చేసింది. పన్నెండు ఎకరాలలో సగానికంటే ఎక్కువ దాదాపు ఎనిమిది ఎకరాలు మొక్కలు లేనట్లే.

"బాగా పడి విత్తనాలు పట్టేటట్లుగా వుందే!" అని చాలాసార్లు అనుకుంది. డిసిహెచ్ నాటిన పొలం ఒక్కటే సంతృప్తిగా వుంది.

చేలు అన్నీ చూసి, మధనపడుతూ వస్తుంటే దార్లో యల్లారావు కలిశాడు.

"ఇదేంది వదినా, మేము నాటి నాలుగు రోజులు అయితే మా చేలో ఒక్క మొక్కారాలేదు. మా చేను పక్కన రామసామి మేము నాటిన రోజే నాటాడు. వాడి చేలో ఒక్క విత్తనం బీరుపోకుండా మొలిచింది. ఒక వైకిరిగా వుందనుకో వాడి చేను. మా చేలో యిత్తుల్లో తేడాయే!"

"మేము కూడా వానపోయిన మరుసటి రోజు నాటితే మా చేలు కూడా సరిగా మొలవలేదు యల్లారావు. యిత్తుల్లో తేడాయేనంటావా?" రాజమ్మ అడిగింది.

"ఏమో, చెప్పలేం వదినా, విత్తనాల్లో మోసం జరిగిందంటన్నారు. యిత్తులకి ఇయ్యేడు బాగా గిరాకి వుంది. ఏదైనా మోసం జరిగితే ఈ గిరాకిలోనే జరిగిద్ది''

"అసలే అదును తూలిపోయి యేసాం పత్తి. ఏటామాదిరిగా వానలు వుండి, అదునులో పత్తిపడి వుంటే ఇప్పటికి మూడు నాలుగు

వరసలు మందు కూడా వాడి వుండేవాళ్లం. ఇప్పుడు ఇంక పడి మొక్కలు బతికిచ్చుకోవాలంటే ఎంత చావు?" అంది రాజమ్మ.

"తాగడానికి ఉత్తర పొలాన నీటి బొట్టులేదు. ఇంక పడి యిత్తులకి నీళ్లు ఎక్కడ దొరుకుతాయి వదినా?"

"ఎట్టోకట్ట చావాలిగా. ఎంతదూరం అయినా నీళ్లు మోసి పడి యిత్తులు వేయక తప్పిద్దా? ఇప్పటికే మూడు వేలు పోసాం యిత్తులకి. రేపు మళ్లీ పడి యిత్తులకి ఇంకెన్ని వేలు పోయాలో?" అంది రాజమ్మ. ఆమెకి బాగా దిగులుగా, విచారంగా వుంది.

వస్తూ దార్లో రాజమ్మ దడి దగ్గరకివెళ్లింది. అంజయ్య మంచం మీద కూర్చుని మోకుతాడు వేసుకుంటున్నాడు.

"పడి యిత్తులు చాలా పట్టేటట్టుగా వుండయ్యా. నువ్వు ఇటు పల్లెలోకి పోయి నాలుగు జతల్ని పిలువు. వస్తూ దార్లోమూడు కేజీలు వన్, మూడు కేజీలు హెచ్ఫోర్ యిత్తులు తీసకరా. రేపుపోయి పడి యిత్తులు వేద్దాం" భర్తతో చెప్పింది రాజమ్మ.

"చాలాయిత్తులు పడతయ్. నాలుగు జతలు సరిపోతారంటే?"

"నలుగురు ఆడవాళ్లకి తోడు అమ్మాయీ, నేనూ వుండటంలా? మగవాళ్లకి తోడు ఒకరిద్దరు ఆడవాళ్లనికూడ లేపి నీళ్లు మోయమంటే సరి! ఆడవాళ్లు నీళ్లు మోసినా మగవాళ్లకిచ్చే కూలి ఇయ్యంగా? కూలి అయినా మిగిలిద్ది. నువ్వు మంచి విత్తనాలు చూసితీసకరా''

భూమిలో పై భాగాన తేమలేకుండాపోయింది. దగ్గర్లో నీళ్లు కూడా లేవు. చాలా దూరం నించి నీళ్లు మోసుకువచ్చి పోస్తే రాజమ్మ, అన్నపూర్ణ, కూలీలు పడి విత్తనాలు నాటారు. 3 రోజులు పట్టింది. డిసిహెచ్ చేలో పెద్దగా పడి మొక్కలు పట్టలేదు.

"డబ్బులికి డబ్బులూ పోయె, చాకిరీ చేసుకోవాల్సి వచ్చె, అదునులో విత్తనాలూ మొలవకపోయె! మొదటి విడత మాదిరిగా పడి యిత్తులు ఎందుకు మొలుస్తాయి? పాదిని కనుక్కుని మకిల తినిద్దాయె!" అని రాజమ్మ మూడు రోజులూ విత్తనాలు నాటుతూ బాగా మధనపడిపోయింది.

ఆ సాయంత్రం పొగాకు కాడ కోసం రామస్వామి వచ్చాడు.

"ఏం అబ్బాయి రామసామీ... ఎట్ట మొలిచినయ్ మీ చేలో విత్తనాలు?" రాజమ్మ అడిగింది.

"మా బామ్మర్ది కర్నూలునించి పంపించిన యిత్తులు బెమ్మాండంగా మొలిచినయ్ అప్పా! పడి మొక్క పట్టనేలేదు. మన వూళ్లో తిరపతయ్య కొట్లో ఒక సంచి హెచ్ఫోర్ యిత్తులు తీసకపోయి యేస్తే ఒక్కమొక్క కూడా మొలవలేదు. రెండు వందల రూపాయలు వాడికి బాకీ తీర్చాము, ఏనాడో బాకీ పడి''

"మేం కూడా వాడికొట్లో హెచ్ఫోర్ తీసకపోయి ఆరు ఎకరాలు నాటితే మూడొంతులు మొలవలేదబ్బాయి. దొంగ సచ్చినోడు, మంచి యిత్తులు ఇచ్చి చావలేదు''

"తిరపతయ్యేకాదు అప్పా, మన ఊళ్లో అందరూ నాసిరకం యిత్తులే తెచ్చారు. ఒక్కొక్కరు ఒక్కో పేరుతోటి అమ్ముతున్నారు. వెంకట్రామయ్య కొట్లో వన్ నాసిరకం యిత్తులేనంట అప్పా. వాళ్ల కొట్లో వన్ యిత్తులు తీసకపోయినోళ్లందరూ మొలవలేదంటన్నారుగా''

ఆ మాట వినడంతోనే రాజమ్మ, అంజయ్య స్థాణువులైపోయారు.

"నిజమేంట అబ్బాయి, ఎవరెవరివి మొలవలేదు'' ముందుగా తేరుకున్న రాజమ్మ అడిగింది.

"ఊళ్లో చాలామందివి మొలవలేదంట అప్పా. పొద్దున సెంటర్ కాడ అనుకుంటుంటే నేను యిన్నాను. కొంపతీసి మీరు కూడా వాడికొట్లో వన్ యిత్తులు తెచ్చారేంది?"

"మొదట ఆరు సంచులు తెచ్చాంరా. అవి సరిగా మొలవకపోతే నాటడంలో తేడానో,

పదునులో తేడానో, ఎందుకు మొలవలేదో అనుకుని మళ్లీ పడి మొక్కలకి మూడు కేజీలు తెచ్చాంరా. నిజంగా వాడి కొట్లో యిత్తులు తేడాయేనంటావా?" అనుమానం తీరక అంజయ్య మళ్లీ అడిగాడు.

"ఏమోమామా, ఊళ్లో అనుకోవడమే, నాకేం తెలుసు? సరే, మొదటిసారి నాటిన యిత్తులు పోయినా, రెండోసారి నాటిన యిత్తులు రేపూ, ఎల్లుండిలో తెలిసిద్దిగా?" అన్నాడు రామస్వామి.

"ఏమైనా తేడా జరిగితే వదిలి పెడతానూ నాయాల్ని" ధీమాగా అన్నాడు అంజయ్య.

"అందరూ ఒకసారి బోల్తా పడతారు. మనం చూస్తాచూస్తా రెండుసార్లు బోల్తా పడ్డాం. అట్టుండిద్ది మన తెలివి" నిరాశగా, బాధగా అంది రాజమ్మ.

నాలుగు రోజులకి అంజయ్య చేలో హెచ్ఫోర్ విత్తనాలు బాగానే మొలిచాయిగానీ, జెకెహెచ్వన్ విత్తనాలు సరిగా మొలవలేదు. మళ్లీ మూడోసారి కూడా పడి విత్తనాలు వేయాల్సివచ్చింది.

కిలో 200 రూపాయలు హైబ్రీడు విత్తనాలకు పెట్టలేక, కిలో 15 రూపాయలు పెట్టి ఎంసియు 5 రకం విత్తనాలు తీసుకు వచ్చి పొలం అంతా పడి విత్తనాలు నాటారు.

మిగతా పొలంలో నామకార్థంగా విత్తనాలు పట్టాయికానీ, జెకెహెచ్వన్ చేలో మాత్రం చాలా విత్తనాలు నాటాల్సి వచ్చింది.

నీళ్లు మోసిన మగకూలీలకు, నాటిన ఆడ కూలీలకు చాలా కూలి అయింది.

పనికిరాని విత్తనాలు తీసుకు వచ్చి ఇచ్చి 2 వేల రూపాయలు కొట్టేసినందుకు రాజమ్మకి కడుపుమండిపోతూ వుంది. అంజయ్యకు కూడా కోపంగా వుంది.

ఇంటిముందుగా వెంకట్రామయ్య వెళ్తూ, వాకిట్లో రాజమ్మ నిలబడివుంటే "అంజయ్య ఉన్నాడంటమ్మాయి?" అని పలకరింపుగా అడిగాడు.

"లేదు మామయ్యా, దడి దగ్గరకిపోయాడు. సరేగానీ మామయ్యా, వన్ యిత్తులు మీ కొట్లో తెచ్చినాటితే ఒక వంతు మొలిచే, మూడొంతులు మొలవకపోయె! అలాంటి యిత్తులేనా తెచ్చేది? మీరు మీ లాభం చూసుకున్నారు కానీ అదునులో పైరుపడక, పడిత్తులు వేసుకునీ, కూలోళ్లని పెట్టుకునీ మేము ఎంత ఇబ్బంది పడ్డామో ఏమైనా చూశారూ? ముందుసారి ఆరు సంచులూ, వెనకసారి మూడు సంచులూ మాకు దండగేగా? రూపాయా, రెండు రూపాయలా, సంచి రెండు వందల లెక్కన పచ్చెనిమిది వందలే! ఎంత మేము తెలియని వాల్లమయినా ఇంత దురుమార్గం పనికిరాదు మామయ్యా!" అని వెంకట్రామయ్యని పట్టుకుని రాజమ్మ ముఖాన్నే అడిగేసింది.

"అదేందమ్మాయి అట్టంటావు, ఎవురు మోసం చేశారంటావు. మాచేలోకి వచ్చి చూడు, ఆ యిత్తులు ఎట్ట మొలిచినయ్యో! నాటుకోను చేతగాక ఎవుర్నో అంటే ఏంలాభం అమ్మాయ్?"

"ఇప్పుడు మాకు నాటుకోవడం చేతకాలేదంటన్నావ్, మరి ఈ పదేళ్లనించీ మా చేలల్లో ఎవురు నాటితే పత్తిత్తులు మొలిచినయ్? అప్పుడు చేతయింది, ఇప్పుడు చేతకాదూ? మీ దగ్గర తెచ్చిన తట్టీటూ యిత్తనాలు పక్కచేను మేమేగా నాటింది, మరి అది బాగానే మొలిచిందిగా? మీరు లాభం కోసం ఆశపడి నాసిరకం యిత్తులు తెచ్చి మాకు నాటుకోడం చేతకాలేదంటన్నావే?"

"ఇప్పుడు నువ్వు అగోరించేదేంది?" వెంకట్రామయ్య నిర్లక్ష్యంగా అన్నాడు. ఆ మాటతో రాజమ్మకి అరికాలిమంట నెత్తికెక్కింది.

"నేను అగోరించేదేంది? బుద్ధి తక్కువోడా, బుద్ధి తక్కువ పన్లు చేయవాకుమంటున్నా. నువ్వు మొలవని యిత్తులు తెచ్చి ఎవురి కొంపలు నాశినం చేద్దామనుకున్నావు? యేపారం చేతగాకపోతే చేతకానట్టు గాజులు తొడు

క్కని ముండమోపి మాదిరిగా మూలన కూర్చో! అంతేగానీ లోకుల కష్టార్జితం తేరగా వుందేంది తింటానికి? ఆ పియ్యి తినేకంటే యేట్లో పడి చావకూడదూ?"

"నీతోటి నాకెందుకులే అనవసరం మాటలు'' అంటూ వెంకట్రామయ్య మాటామాటా పెరిగి నలుగురూ పోగయితే తన బండారం బయటపడిపోతుందని తొందరగా వెళ్లిపోయాడు.

రాజమ్మ, ఒక ఆడది తనని అంత నిర్భయంగా నిర్మొహమాటంగా అంటుందని ఆయన అనుకోలేదు. గట్టిగా దబాయించి మాట్లాడితే నోరు మూసుకుని ఇంట్లోకి పోతుందిలే అనుకున్నాడుకానీ తనే నోరు మూసుకుని వెళ్లాల్సి వుంటుందని ఊహించలేదు.

సాయంత్రం అంజయ్యా చేలోకి వెళ్లాడు. పత్తి మొక్కలు మొలవలేదుకానీ కలుపు మొక్కలు మాత్రం బాగా మొలిచాయి.

హెచ్‌ఫోర్ చేలో మొక్కలు పర్లేదు. జెకె హెచ్ వన్ విత్తనాలు నాటిన పొలం అధ్వాన్నంగా వుంది. కలుపూ, పత్తిమొక్కలు అన్నీ పాదుల్లో లేకపోవడం. మొదట్లో మొలిచిన మొక్క ముదురు అయితే వెనుక మొలిచిన మొక్కలేత. పొలంలో కలుపు పోవడానికి సేద్యం చేయాలన్నా సాధ్యంకాదు. సేద్యం చేస్తే లేత మొక్క మట్టి కింద పడి పూడిపోతుంది.

పైపైన కలుపు అయినా తీయించి, వారం రోజులు ఆగి గుంటకలు తోలుకోవచ్చనుకున్నాడు అంజయ్య. దడి దగ్గర గొడ్లుకి మేతవేసి కలుపు కూలీల కోసం మాదిగపల్లెలోనికి వెళ్లి వాళ్లని పిలిచాడు.

పల్లెలో నించి వస్తుంటే, దారిలో ఎక్కడ నించో వస్తూ వెంకట్రామయ్య కలిశాడు. అంజయ్యకు ఆయన మీద కోపంగా వుంది. అయినా ధైర్యం చేసి అడిగే స్వభావం కాదు. పిరికితనం ఎక్కువ. మొహమాటస్తుడు.

★ ★ ★

"వన్ యిత్తులు కావాలని అంజయ్య రెండో సారి వచ్చినప్పుడు మంచి యిత్తులు ఇయ్యక పొయ్యావంట్రా? చిలకలూరి పేటనించి తెచ్చిన యిత్తులు ఎందుకిచ్చా?" ఆరోజు రాత్రి ఇంటి దగ్గర శేఖర్‌ని అడిగాడు వెంకట్రామయ్య.

"ఒక సంచి మంచి యిత్తులే ఇచ్చి, రెండు సంచులు పేట నుంచి తెచ్చిన యిత్తులు ఇచ్చా నాన్నా''

"పడి యిత్తులు యేసుకునేటప్పుడు మంచి యిత్తులు ఇస్తే బాగుండేదిరా. రెండోసారి కూడా మొలవకపోయేసరికి మజ్జెన్నం ఆ అంజయ్య పెళ్లాం నన్ను ఎట్టంటే అట్ట మాట్టాడింది. ఇంక పేట యిత్తులు ఎవురికీ అమ్మొకు''

"ఇంక అసలు యిత్తులు ఎవురు కావాలంటున్నారు నాన్నా. అందరూ పత్తియిత్తులు వేయడం ఎప్పుడో అయిపోయింది''

"మనం పొరపాటు పని చేశాంరా శేఖరూ. రైతు వచ్చి నాలుగు సంచులు కావాలని అడిగినప్పుడు రెండు సంచులు పేటయిత్తులు ఇచ్చి రెండు సంచులు మంచి యిత్తులు ఇస్తే సరిపోయేది. కొన్ని యిత్తులు మొలవకపోయినా అప్పుడు ఎవురికీ అనుమానం వచ్చేదికాదు. నాటడంలో తేడానో, పదునులో తేడానో, భూమిలో మకిల కొట్టిందనో అనుకునేవాళ్లు. మనం ఎక్కువ నాసి యిత్తులు ఇచ్చి, మంచి యిత్తులు తక్కువ ఇచ్చేసరికి చాలామంది కనుక్కున్నారు''

"కనుక్కున్నా ఎవరేం చేస్తార్లే నాన్నా?"

"ఎవరన్నా ఏమైనా చేస్తారని కాదు. ఇట్టయితే యేపారంలో ముందుముందు దెబ్బ తగిలిద్ది. మనల్ని ఎవురు నమ్ముతారు? చేసేది నమ్మకంగా చేయాలిరా, ఎవురికీ అనుమానం రాకూడదు''

"ఇద్దరు ముగ్గురు కనుక్కుని బాగా ప్రచారం చేసారు నాన్నా!"

"చేస్తారు, ఎందుకు చేయరు? మొత్తం

మనం ఎన్ని సంచులు అమ్మినట్లు?"

"పేటనుంచి తెచ్చిన యిత్తులు 130 సంచులు అమ్మాం నాన్నా, ఆ యిత్తుల మీదనే 26 వేల రూపాయలు వచ్చినయి. కర్చులూ, మిల్లువాడికి ఇచ్చిందీ మొత్తం వెయ్యి రూపాయలు పోయినా పాతికవేలు నికరంగా వచ్చినట్టు నాన్నా''

"ఒక్కో ఏడు కుదిరిద్దిరా పాటు! ఈ యిత్తుల మీదనే పాతికవేలు వచ్చే. మంచి యిత్తుల మీద 10 వేలు లాభం వచ్చినా 35 వేలు యిత్తులమీదే ఆదాయం వచ్చినట్టు ఇయ్యేడు. ఏటా ఇట్టవుంటే ఇంక కావాల్సిందేం వుండిద్ది?"

"ఆ తిరపతాయ్‌గాడు కూడా వంద సంచులు అమ్మివుంటాడు నాన్నా. వాడు హెచ్‌ఫోర్ అని చెప్పి అమ్మాడు''

"వాడి దెబ్బ మనకి ఎక్కువ అయిందిరా. మిగతా కొట్టోళ్లతో మనకి బాధలేదు. వీడు అన్నిట్లో మనకి పోటీ వస్తున్నాడు'' వెంకట్రామయ్య కోపంగా అన్నాడు.

చిలకలూరిపేటలోని పత్తి మిల్లులో శేఖర్ పనికిరాని విత్తనాలు 2 క్వింటాళ్లు తీసుకువచ్చాడు. నూనె మిల్లులకి కూడా పనికిరాని విత్తనాలు అవి. చూడటానికి అన్ని విత్తనాలూ ఒకేలా వుంటాయి. కిలో విత్తనాలు పట్టేలా సంచులు కుట్టించి, సంచుల్లో ఈ విత్తనాలు పోసి, కేజీ 200 రూపాయలు చేసి రైతులకి అమ్మారు.

తిరుపతయ్య కూడా అదే మిల్లునుంచి, అవే విత్తనాలు 2 క్వింటాళ్లు తీసుకువచ్చాడు. ఆ మిల్లు గుమస్తా తిరుపతయ్య, శేఖర్‌లతో ఒకరి విషయం ఒకరికి చెప్పాడు. దొంగలు ఇద్దరూ కుక్కిన పేనుల్లా ఎవరికివాళ్లు గుట్టుచప్పుడు కాకుండా అమ్ముకోవాలనుకున్నారు. వాళ్లు విజయవంతంగానే అమ్ముకున్నా జనం మాత్రం విషయం తెలుసుకున్నారు.

కానీ ఏం లాభం? అప్పటికే చేతులు కాల్చుకున్నారు.

రైతాంగం కూడా కల్తీ సరుకులకి అలవాటు పడిపోయింది. కల్తీలేని సరుకు కావాలన్నా అది రైతుకి దొరకడం అసాధ్యమే! ప్రతి ఏడాది విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు వీటిలో కనీసం ఒక దానిలో అయినా సరే కల్తీవాతకు గురికావాల్సిందే!



పొలం అంతా కలుపు మొలిచింది. కూలీలకు డిమాండ్‌గా వుంది.

రాజమ్మ, అన్నపూర్ణ నలుగురు కూలీల్ని తీసుకుపోయి కలుపులు తీసుకున్నారు. పాదిలో ఒక మొక్కలేకపోయినా పత్తి దిగుబడి తగ్గుతుందని నాలుగోసారి కూడా పడి విత్తనాలు వేశారు.

ఇనుప గొర్రులూ, ఆట గొర్రులూ, గుంటకలూ లాంటివి కట్టుకుని అంతర్‌సేద్యం చేస్తున్నారు పత్తి పొలాల్లో.

కలుపు తీసిన కూలీలు డబ్బుకోసం ఇంటికి వచ్చారు. అంజయ్య భోషాణం పెట్టె తీసి, వాళ్లకి కూలీ ఇచ్చి పంపించాడు.

"పెట్టెలో ఇంక నాలుగు వందలే వున్నయ్యే! రేపట్నించీ కూలీనాలికీ, ఇంకో ఖర్చులికీ డబ్బు లేకపోతే యట్ట? సొసైటీలో లోన్లు ఇస్తన్నారంట, మనం కూడా లోన్ పెట్టుకుందాం"

"ఏం లోన్లో, ఏం పాడో, పోయిన సాల్లో లక్ష రూపాయలు వచ్చినయ్యంటే, వచ్చినయ్యే గానీ చివరికి రూపాయి లేకపోయే! అమ్మాయి పేరుతో బేంకిలో వేద్దామనుకున్న 50 వేలు

వేసినా ఇయ్యాల మనకి ఒకరితో పనిలేకుండా పోయేది. కౌళ్లు కట్టీ, కర్చుపెంచుకునీ చివరికి చేతిలో రూపాయలేకుండా చేసుకుంటిమి. అసలు మనకి మిగిలింది ఏందో, ఏం పాడో!"

"వెంకట్రామయ్య కొట్లో 15 వేలు కడితిమి, బాపయ్యకి కౌలు 13 వేలు కడితిమి, గొడ్లు మేతా, వడ్లూ తెచ్చుకుంటిమి, ఎద్దులు కొనుక్కుంటిమి, అబ్బాయి కాలేజీలో చేరేటప్పుడు గుడ్డలనీ, గోచిలనీ నాలుగువేలు కర్చయ్యాయి, పత్తి యిత్తులకి నాలుగువేలు తగలేసుకుంటిమి! ఇవన్నీ ఇయ్యేడు మనకి మిగిలినయ్యేగదా?" అన్నాడు అంజయ్య.

"మనం కౌలుకి పట్టకుండా వున్న బాగుండేదనిపిస్తందయ్యా నాకు. ఇయ్యాల అప్పు చెయ్యడం సులభమే, రేపు తీర్చొద్దూ?"

"నిరుడు ఎకరానికి ఆరేడు వేలు మిగిల్నియ్ గదా! ఇయ్యేడు కర్చులు పెరిగినా కనీసం 4 వేలైనా మిగలవూ? మనం పొలం కౌలుకి తీసుకుని వేసుకుంది మరిన్ని డబ్బులొస్తాయని కదంటే!"

"యంకట్రామయ్యగోడు కొట్లో ఇంకో 10 వేలు కట్టమంటున్నాడు అంటన్నావుకదా? మన బంగారం బేంకిలో పెడితే 12 వేలు ఇస్తారు. అది వాడి మొకాన పడేద్దాం. ఇంక సొసైటీలో లోను ఎందుకయ్యా?"

"మరి ఇప్పట్నించీ కర్చులకీ, కూలినాలికి ఎట్టచేద్దామే? సొసైటీలో వడ్డీకూడా తక్కువ. మనకి లాభమేగనీ దండగవుండదు"

"సరే అయితే" అంది రాజమ్మ.

అంజయ్య పొలం, దడీ దగ్గరికి వెళ్లేదారిలోనే ఆ వూరి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం ఆఫీసు వుంది. అంజయ్య దడి దగ్గరకి వెళ్తూ అక్కడికి వెళ్లాడు. పెయిడ్ సెక్రటరీ కూర్చుని వున్నాడు. అతని పేరు నారాయణ.

"ఏంది అంజయ్యా... ఏందీ పనిబడి వచ్చావు?"

"పనిపడే వచ్చానబ్బాయి. సొసైటీలో పొలాలు పెట్టుకుని లోన్లు ఇస్తున్నారంటగా! మాకు కూడా కొద్దిగా లోను ఇప్పించు నారాయణా ఇయ్యేటికి" అభ్యర్థిస్తున్నట్లు అడిగాడు అంజయ్య.

"అయితే ఇప్పుడంట అంజయ్యా వచ్చేది? మూడు నెల్లనించీ లోన్లు రాసుకుంటంటే నీకు ఇప్పుడా తీరుబాటు అయ్యిందీ? నీకు లోను అవసరమైతే ముందే అడక్కపోయావు? మేము రాసి కాగితాలు పైకి కూడా పంపించాంగా మరి?"

"అట్టంటే ఎట్టబ్బాయి? నాకు తెలవదు, తెలిస్తే ఇంతకుముందే వచ్చేవాడ్ని. ఎట్టోకట్ట రాసిపెట్టబ్బాయి ఇయ్యేటికి?"

"ఎట్టరాస్తాం అంజయ్యా? కాయితాలు ఒంగోలు బేంకికి పంపించి కూడా పది రోజుల పతండే! ఇంక నెల రోజులు ఆగితే రబీ పంటకి లోన్లు అని ఏమన్నా ఇస్తారేమో అప్పుడు చూడాల్సిందే!"

"ఇప్పుడు అవసరం అని కదా నారాయణా వచ్చింది. మొన్న కూడా ఎవురియ్యో రాసావంటగా?"

"మొన్న ఇద్దరియ్యి రాసా. అవి నిన్న ఒంగోలుజిల్లా బేంకి దగ్గరకి తీసకపోయి ఇస్తే అక్కడ గుమస్తాలు టైం అయిపోయిందని, కాదు కూడదని చెప్పి చివరికి ఒక్కో దానికి వంద రూపాయలు లంచం ఇస్తే అప్పుడు ఈ కాగితాలు తీసుకున్నారు"

"అట్నే నేను కూడా వంద రూపాయలిస్తాన్లే అబ్బాయి"

"సరే అయితే, నువ్విస్తానంటే రాస్తాలే! కానీ ఇవి నాకు ఉండేయ్యికాదు. ఒంగోలు బేంకిలో గుమాస్తాలకి ఇయ్యాల్సిందే! మరి నువ్వు రిజిస్టారు ఆఫీసుకి పోయి ఇసీలు తీసకరావాలి. ఎంత తొందరగా నువ్వు ఇసీలు తెచ్చుకుంటే అంత మంచిది. ఎంత కావాలి లోను?"

"ఎంత ఇస్తన్నారేంది?"

"మొదటిసారి కాబట్టి ఆరువేల కంటే ఎక్కువ ఇవ్వం. రెండు ఎకరాలకి ఇసీలు తెచ్చుకో. నీ ఒక్కడికేనా లోను?"

"నాకేనబ్బాయి''

"మీ ఆడవాళ్లకి కూడా రాయించుకోకపోయావా? పనిలో పని యల్లబారి పోయిద్ది. ఆమె పేరుతో కూడా ఆరువేలు ఇవ్వవచ్చు. అయితే ఆమె పేరుతో కూడా రెండు ఎకరాలకి ఇసీలు తెచ్చుకోవాలి''

"దాని పేరుతో రెండు ఎకరాలు పొలం లేదే, ఒక్క ఎకరమేగా వుంది!"

"పొలం లేకపోయినా పర్లేదులే. రిజిస్ట్రారాఫీసులో పాతిక రూపాయలు పడేసి పాతిక ఎకరాలకి ఇసీలు ఇవ్వమన్నా ఇస్తారు. వాళ్లు అక్కడ కూర్చుంది డబ్బు మేయడానికే!" నవ్వుతూ అన్నాడు ఆ వేతన కార్యదర్శి.

"సరే వస్తానబ్బాయి. అవసరం అయితే మా ఆడదాని పేరుతో కూడా లోను పెడదాం"

"నువ్వు రిజిస్టరాఫీసుకి పోయి ఇసీలు తెచ్చుకోడమే ఆలిస్సెం! నువ్వు ఎంత తొందరగా అవి తెచ్చుకుంటే అంత మంచిది. ఇంక మాదేం లేదు''

"రేపు పొద్దున్నే పోయి తెచ్చుకుంటానబ్బాయి. మనం పొలం నంబరు చెబితే ఇస్తారుగా ఇసీలు''

"నంబరు తీసకపోయి అప్లికేషను పెట్టుకుంటే ఇసీలు ఇస్తారు. అయితే లెక్క ప్రకారం అప్లికేషన్లు పెట్టుకున్న నాలుగు రోజులకి ఇస్తారు. మామూలుగా ఇసీకి 30 రూపాయలు లంచం తీసుకుంటారు అంజయ్యా! మనకి అదే రోజు కావాలంటే లంచం రెండింతలు గుంజుతున్నారు. ఇంతకుముందు అప్లికేషన్ ఇచ్చిన రోజే ఇసీ ఇమ్మంటే రూపాయికి రూపాయిన్నర తీసుకునే వాళ్లు. ఇప్పుడు రెట్టింపు చేశారు. ఎంత తీసుకున్నా అడిగేవాడు ఎవడు వున్నాడ్లే?" విషయం చెప్పాడు వేతన కార్యదర్శి.

"పనుల రోజుల్లో మళ్లీ ఇంకో రోజు పని మానుకుని పోవాలంటే ఇబ్బంది. ముప్పైకి ఇంకో ముప్పై పోతే పోనీయి. రేపు తీసకవస్తానబ్బాయి''

"నువ్వు ఇసీలు అర్జంటుగా తెస్తేనే మరి పనయ్యేది. అరవై రూపాయలు అయితే కానీయి. మనం చేసేదేముంది? అవసరం మనది. నువ్వు ఇంకో రోజు పని మానుకుని, చార్జీలు పెట్టుకుని తిరిగి వచ్చేకంటే ఇదే నయం కూడాలే'

"సరే వస్తానబ్బాయి'' అంటూనే అంజయ్య కొద్దిసేపు కూర్చుని సొసైటీ లోన్లు, వడ్డీలు, బాకీలులాంటి కాలక్షేపం కబుర్లు కొద్దిసేపు మాట్లాడి దడి దగ్గరకి వెళ్లిపోయాడు.

"మంచి పద్దే దొరికింది. ఈయన దగ్గర ఎంతో కొంత కొట్టేయాలి'' అప్పటివరకూ రిజిస్ట్రార్ ఆఫీసులోని అవినీతి గురించి ఉచిత ఉపన్యాసం దంచిన వేతన కార్యదర్శి అనుకున్నాడు.

"రేపు పొగులు ఎద్దుల దగ్గర వుండాలే నువ్వు. నేను అమ్మనబోలు పోయి ఇసీలు తీసకరావాలి. సొసైటీలో లోను ఇస్తానన్నాడే గుమస్తా'' సాయంకాలం ఇంటికి వచ్చిన అంజయ్య రాజమ్మతో చెప్పాడు.

"అట్నేలే, పోయిరా''

"ఇయ్యేడు ఇసీలు తెచ్చుకుని లోను పెట్టుకుంటే, ఇంక నాలుగేళ్లదాకా ఈ కాయితాలతో పనిలేదని చెప్పాడే గుమస్తా. వచ్చే ఏడు అమ్మాయికి పెళ్లి చేసి పంపిస్తే మనకి డబ్బుకి ఇబ్బంది అయిద్ది. ముందు నా ఒక్కడి పేరుతోటే లోను తీసుకుందాం అనుకున్నా గానీ, తరువాత చూస్తే ఇద్దరి పేర్లతోటీ లోను తీసుకోవటం మంచిదనిపిస్తంది. అయ్యే కర్చేదో ఒక్కసారే అయిద్ది. పనిలో పని యల్లబారి పోయిద్ది''

"సరే, అట్నేకానియ్యయ్యా! మందుల కొట్లో రెండు రూపాయల వడ్డీ కాజెయ్యడంలా? సొసైటీలో అంత వడ్డీ ఎందుకుండిద్ది?"

"సొసైటీలో ఎనభై పైసలేనంటనే వడ్డీ! ఇయ్యేడు మాత్రం ఇసీలకే, మనం ఆలిస్సెం చేసినందుకూ కొద్దిగా ఖర్చులు పడతయ్. వచ్చేఏడు నుంచీ పైసా కూడా కర్చులేకుండా లోను ఇస్తారు''

"అసలు ఇయ్యేడు ముందు ముందు ఇంకె న్ని కర్చులు వచ్చిపడతయ్యో! పదిహేడు ఎకరాల పత్తి అంటే సామాన్యమా? ఎంత కర్చు, ఎంత బాధ, ఎంత చాకిరీ! సొసైటీలో లోను పెట్టుకోవడమే మంచిదనిపిస్తుంది''

★ ★ ★

మరుసటి రోజు ఉదయం అమ్మనబ్రోలు సబ్‌రిజిస్ట్రార్ ఆఫీసుకి ఇసీలకోసం వెళ్లాడు అంజయ్య.

బయట ప్రయివేటు చేసేవాళ్ల దగ్గర రెండు అప్లికేషన్ ఫారాలు రెండు రూపాయలు పెట్టి కొని, అవి రాసిపెట్టినందుకు వాళ్లకి రెండు రూపాయలు ఇచ్చి ఆఫీసుకి తీసుకుపోయాడు.

వాళ్లు ఆ అప్లికేషన్ ఫారాలు తీసుకుని నాలుగు రోజులు ఆగి రమ్మన్నారు.

"నాకు ఇవ్వాళ కావాలండీ!"

"ఇవ్వాళ్టికి ఇవ్వాళ కావాలంటే యట్ట వీల యిద్దయ్యా?"

"మీకు మామూలు ఇస్తాలెండి''

"నువ్వు ఇవ్వవని కాదు. మాస్టాఫ్ ఇద్దరు రాలేదు ఇవ్వాళ, సరే సాయంత్రంరా చూస్తాం. మరి రేటు తెలుసుగా?" అడిగాడు హెడ్ గుమస్తా.

"తెలుసండీ!" వినయంగా తలవూపుతూ అన్నాడు అంజయ్య. అంజయ్య ఆ ఆఫీసుకి దగ్గరగా ఉన్న చిన్న హెూటల్‌కి పోయి టిఫిన్ చేశాడు. మధ్యాహ్నం వరకూ అక్కడే కూర్చుని ఆఫీసులోకి వెళ్లాడు, ఇసీలు తీసు కుందామని.

"సాయంత్రం రమ్మన్నాం కదయ్యా?" చీమనో, దోమనో, పురుగునో చూసినట్లు అంజ య్యని చూసి ముఖం చిట్లిస్తూ అసహనంగా అన్నాడు సబ్‌రిజిస్ట్రార్.

"పోవాలండీ, మళ్లీ బస్సు దొరకదు. ఇంటి దగ్గర గొడ్డుకి మేత వేసే సంతన కూడా లేదు''

"అయితే మమ్మల్ని వచ్చి నీ గొడ్లకి మేత వేయమంటావేమిటి? ఒక గంట ఆగిరా!" నిర్లక్ష్యంగా విదిలించి కొడుతూ అన్నాడు అత ను.

అంజయ్య మళ్లీ ఆ హెూటల్ దగ్గరకి వెళ్లి గోళ్లు గిల్లుకుంటూ, అక్కడ ఉన్న పేపర్‌లోని సినిమా బొమ్మలు చూస్తూ, పేపర్ రాజకీయం అక్షరం అక్షరం కూడబలుక్కుని చదువు కుంటూ, చుట్ట తాగుతూ కూర్చున్నాడు.

మధ్యాహ్నం 3 గంటల వరకూ అలాగే కాలక్షేపం చేసి మళ్లీ వెళ్లాడు.

బంట్రోతు అంజయ్య వెళ్లిన వెంటనే ఇసీలు ఇచ్చి "160 రూపాయలు ఇవ్వండి'' అన్నాడు లంచగొండి తనాన్ని ప్రభుత్వం చట్టబద్ధం చేసిందా అనిపించేంత సహజంగా. షాపులో వస్తువు ఇచ్చి దాని ఖరీదు ఇవ్వమన్నంత సులభంగా అడిగాడు.

"అంత ఎందుకండీ?" ఆశ్చర్యంగా నోరు వెళ్లబెట్టి అంజయ్య ప్రశ్నించాడు.

"ఇందాక తెల్సన్నావుగదయ్యా, మరి ఎంతనుకున్నావు?"

"120 రూపాయలు అవుతాయని సొసైటీ గుమస్తా చెబితే అంతే తెచ్చానండీ!"

"మంచివాడివే! ఒక్క ఇసీకి వచ్చి నలభై రూపాయలు. అప్లయ్ చేసిన రోజే ఇవ్వాలంటే ఎనభై. పెంచి నెల రోజులపైనే అయింది, మీ గుమస్తాకి తెలియదుగామాలు. గంటసేపు రికా ర్డులు మొత్తం వెతికి ఎంత చాకిరీ చేసాం"

'పొద్దుట్నించీ సందకాడదాకా నడుములు విరక్కొట్టుకుంటే కూలోడికి ఇచ్చేది పది రూ పాయలేగా?' అనిపించింది అతను ఆ మాట అన్న తక్షణం అంజయ్యకి.

అంజయ్య ఇంటిదగ్గర నుంచి నూటయాభై రూపాయలే తెచ్చాడు. పది రూపాయలు ఖర్చ

య్యాయి.

"ఇంతవరకూ తీసుకొండి'' తిరుగుప్రయాణానికి పది రూపాయలు ఉంచుకుని నూట ముప్పై ఇచ్చాడు.

"ఇంకా ముప్పై ఇవ్వు''

"లేవండీ, ఈసారికి సర్దుకొండి. తెలియక ఇంతమట్టుకే తెచ్చాను''

"అయితే ఒక పనిచేయి. ఇవ్వాళ ఒక ఇసీ తీసకపోయి, రేపు వచ్చి మిగతా ముప్పై ఇచ్చి రెండో ఇసీ తీసకపో'' వ్యంగ్యంగా అన్నాడు బంట్రోతు.

"ముప్పై రూపాయలేగదండీ. ఇప్పుటికి పోనీయండి'' బతిమాలుతున్న ధోరణిలో లంచమే కదా అనుకుని అన్నాడు అంజయ్య.

"ఇదేం బెండకాయల బేరమా, దొండకాయల బేరమా, మిగతా ముప్పై ఇచ్చి రెండో ఇసీ తీసకపో'' హుంకరిస్తూ అన్నాడు సబ్‌రిజిస్ట్రార్.

"లంచం తీసుకోవడం చట్టప్రకారం కఠినమైన, శిక్షార్హనేరం. మీరు ఇచ్చట లంచం ఇవ్వకుండా మీ పని పూర్తి చేసుకొండి'' అని పెద్దపెద్ద అక్షరాలతో ఆయన కూర్చున్న కుర్చీ వెనుక వైపు గోడకి పెద్ద రేకు బోర్డు వేలాడగట్టి వుంది. అతి తెలివిపరులైన ఆ ఆఫీసు సిబ్బంది అక్షరాలు కనబడకుండా బోర్డుని వంగతీసారు. ఆ చివరా, ఈ చివరా అక్షరాలు జాగ్రత్తగా చూస్తే కానీ కనిపించవు.

"మీలాంటివాళ్లని మేము రోజూ ఎంత మందిని చూట్టంలేదు. మిగతా డబ్బు ఇచ్చి తీసకపోవయ్యా'' అన్నాడు హెడ్‌గుమాస్తా సౌమ్యంగా.

అంజయ్యకు ఏం చేయాలో తోచలేదు.

తెల్సినవాళ్లు ఎవరైనా ఉన్నారా అని ఆలోచించాడు. వాళ్ల వూరి అతను నాగేశ్వరరావు కాన్వెంట్ నడుపుతున్నాడు ఆ వూళ్లో.

అంజయ్య ఆ కాన్వెంట్ ఎక్కడో కను



క్కని వెళ్లాడు. అడిగిన వెంటనే ఆయన 30 రూపాయలు ఇచ్చాడు.

పది రోజులు ముందుగా ఇసీలకు అప్లయ్ చేసుకుని, తరువాత వచ్చి తీసుకపోయి నట్లయితే 80 రూపాయలు మిగిలివుండేవికదా అని అంజయ్య ఏ పదిసార్లో అనుకున్నాడు. మామూలుగా ఇచ్చేలంచం 80గాకుండా అదనంగా ఎనభై రూపాయలు వదిలినందుకు అతని మనసు విలవిల్లాడిపోయింది.

అంజయ్య ఇసీలు తీసుకుని మధ్యలో మరో బస్సుమారి ఇంటికి వచ్చేసరికి బాగా చీకటిపడింది.

★ ★ ★

"ఊళ్లో అందరూ పత్తి తోటలకి మందులు ఏద పెట్టుకుంటున్నారయ్యా! మనం కూడా తొందరగా ఏదపెట్టుకుంటే మంచిది. వానపడితే చప్పున పట్టిద్ది మందు'' అంది రాజమ్మ.

"నేను కూడా అందుకే చూస్తున్నానే! ఎంకట్రామయ్య కొట్టుకి ఇంకా మందు రాలేదంట. రెండు మూడు రోజుల్లో వచ్చిద్దంటన్నాడు.



మనమేమొ డబ్బులన్నీ వాడి చేతికి ఇచ్చి కూర్చుంటిమి. ఆయన మందు ఎప్పుడు తెస్తాడో, మనం ఎప్పుడు ఏద పెట్టుకుంటామో!" అన్నాడు అంజయ్య.

"అదునుపోయిన తరువాత తీసకొస్తాడేంది వొంగసచ్చినోడు, ఏద పెట్టుకోవాలని గట్టిగా అడక్కపోయావా?"

"నాలుగు రోజుల్నించీ రోజూ అడుగుతూనే వున్నానే, రేపు మాపంటన్నాడు!"

"రోజూ మబ్బులు లేస్తండయ్. వాన పడటానికి ముందు ఏద పెట్టుకుంటే బెమ్మాండంగా వుండిద్ది. తొందరగా ఎరువులు తెచ్చిపెట్టమని చెప్పు'' అంది రాజమ్మ.

రెండు రోజులకి వెంకట్రామయ్య కొట్టుకి 28-28-0 ఎరువు మందు లారీ వచ్చింది. ఆ విషయం తెలిసి అంజయ్య కొట్టు దగ్గరకి వెళ్లాడు. అప్పటికే ఆ మందుకోసం కాతాలవాళ్లు ఎగబడుతున్నారు. వెంకట్రామయ్య వాళ్లని కుక్కల్ని విదిలించి కొట్టినట్లు విదిలించి కొడుతున్నాడు.

"ఈ లారీ మాత్రం కాతాలవాళ్లకి ఎవురికీ ఇచ్చే పనిలేదురా! పక్కన మేం కేష్ పెట్టి కొనుక్కొచ్చాం. డబ్బులు కట్టే వాళ్లకే ఈ మందు'' వెంకట్రామయ్య సీరియస్‌గా ముఖం పెట్టి అంటున్నాడు.

"అదేందన్నా, మరి కాతాల వాళ్లేం కావాలి?" అంజయ్య అడిగాడు.

"ఇయ్యాల సందకాడో, రేప్పొద్దునో ఇంకో లారీ వచ్చిద్దిరా, ఆ లోడు కాతాలవాళ్లకి ఇస్తాం"

ఇవ్వాళో, రేపో అన్నాడంటే ఆ వచ్చేది ఎన్ని రోజులకో వీళ్లకి బాగానే తెలుసు.

"నాకు ఐదారు ఎకరాలకు ఇవ్వన్నా. అరక వూరక వుండకుండా అంతమట్టుకి ఈ రెండు రోజుల్లో ఏదపెట్టుకుంటే తరువాత వచ్చినప్పుడు కొరవతీసుకుంటాను''

అంజయ్య మాదిరిగానే కాతాలవాళ్లు వెంక

ట్రామయ్యని బతిమలాడుతున్నారు. మరో వైపు శేఖర్ డబ్బులు తీసుకుని లారీ మీద సరుకు బిల్లులు రాసుకుని అమ్ముతున్నాడు. శేఖర్ చుట్టూ కొంటున్నవాళ్లు ఈగలు ముసురుకున్నట్లు ముసురుకున్నారు.

అంజయ్య కళ్లముందే ఎద్దుల బండ్లమీదా, రిక్షాలమీదా, సైకిళ్లమీదా లారీ మీదనుంచే సరుకు దించుకుని తీసుకుపోయారు. లారీ మీద సరుకు లారీ మీదనే అమ్ముడుపోయింది. గంటలోపే సరుకు మొత్తం అయిపోయింది.

"అదేందన్నా, నీ చేతికి మొదట్లో డబ్బులు ఇస్తే ఎప్పుడు కావాల్సిన మందు అప్పుడు ఇస్తానని చెప్పావు. డబ్బు నీకు ఇయ్యకుండా నా దగ్గిరే పెట్టుకుని ఇప్పుడు తెచ్చిస్తే మందు ఇచ్చేవాడివిగా! నీ దగ్గర కాతా పెట్టిన నేరానికి మేము అదునులో పని గాకుండా ఆగిపోవాలా?" కోపంగా అంజయ్య అడిగాడు.

"నన్నేం చేయమంటావురా చెప్పు? ఈ లోడేమో పక్కన కేష్ ఇచ్చి తెచ్చింది. రేపు పొద్దున లోపు ఖాయంగా ఒక లోడు వచ్చిద్ది. అందులో నీకు కావాల్సినన్ని బస్తాలు తీసకపో!" ముఖాన నవ్వు పులుముకుని అన్నాడు వెంకట్రామయ్య.

అంజయ్యకి విపరీతమైన కోపంగావుంది. అవసరమైనప్పుడు మందు ఇవ్వకుండా తరువాత ఎప్పుడో ఇస్తే ఏం ఉపయోగం?

"ముందుగా డబ్బులు ఇచ్చి నీ చేతిలో చిక్కాం అనేగా నువ్వీ పని చేసింది? ముక్కూ ముఖమూ తెలియని వాళ్లకే, దిక్కుమాలిన నా కొడుకులకీ ఇస్తివీ, కాతాలవాళ్లకి ఏగేస్తివీ?"

"అంత కోపమైతే ఎట్రా అంజయ్యా... రేపు ఇస్తానని చెపతన్నాగా!"

అంజయ్య ఒక్క విసురుమీద ఇంటికి వచ్చాడు.

28-28-0 మందుకి డిమాండుగా వుంది. నూటడబ్భైఐదు రూపాయలు చేసి అమ్మాల్సిన ఎభై కేజీల బస్తా మందుని నూటతొంభై చేసి అమ్ముతున్నారు.

బస్తాకి పదిహేను రూపాయల అదనపు ఆదాయం! ఒక లారీకి వచ్చి మూడు వేలు కంపెనీవాళ్లు ఇచ్చేలాభం గాకుండా ఎక్కువ వస్తుంది.

కాతాలవాళ్లు ఎప్పుడైనా తాము ఇస్తేనే తీసుకునేది. కేష్‌బేరం అయితే ఇంకో కొట్టుకి ఆ మందు వస్తే అక్కడ తెచ్చుకుంటారు. ముందు కేష్ ఇచ్చే వాళ్లకి అమ్ముకుని, చివర కాతాల వాళ్లకి ఇవ్వవచ్చని వెంకట్రామయ్య ఆలోచన.

రెండు రోజులకి వెంకట్రామయ్య కొట్టుకి ఒకేసారి మూడు లారీలువచ్చాయి. ఆయన అంజయ్య ఇంటికి వచ్చి చెప్పాడు.

"ఒరే అంజయ్యా 28 మందు మూడు లోళ్లు వచ్చినయ్యిరా, నీకు ఎన్ని బస్తాలు కావాలంటే అన్ని బస్తాలు తీసకపో! మూడు లారీలు కావాలన్నా తీసుకో!" చొరవగా అన్నాడు ఆయన.

"నాకు మూడు లారీలు ఎందుకులే, అదొక ఎగతాళి! మొన్న ఇచ్చినట్లయితే నిన్నా, ఇవ్వాళా ఏదపెట్టుకుని వుండేవాళ్లంకదా? ఇప్పుడు మబ్బులు లేస్తుండే, వానపడితే ఏమయిద్ది మా పని?"

"ఆ లోడు కంపెనీ నించిగాకుండా బైట మార్కెట్లో కొనుక్కొచ్చాంరా! అప్పుడు 190 చేసి అమ్మామూ, ఇప్పుడు 188రా రేటు!"

"రెండు రూపాయలు పట్టుకున్నయ్యేంది? మాకు కావాల్సిన టయింలో ఇవ్వలేకపోయావుగదా? సరే నువ్వు పా, బండి కట్టుకుని వస్తా!" అని అంజయ్య మాదిగపల్లెలోనికి పోయాడు.

పోలయ్యని తీసుకుని దడి దగ్గరకిపోయి బండికట్టుకుని వచ్చాడు.

"నాన్న ఇప్పుడే బైకు వేసుకుని ఒంగోలు పోయాడు బాబాయ్. నీకు ఎన్ని బస్తాలు కావాల్సివుంటే అన్ని బస్తాలు ఇవ్వమని చెప్పాడు. ఎన్ని బస్తాలు రాయమంటావు?"

శేఖర్ బిల్లు పుస్తకం తీసి అడిగాడు.

అంజయ్య మనసులో లెక్క చూసుకుని, పైకి అన్నాడు. "ఎకరాకి రెండు కట్టల లెక్కన ఏద పెడదామనుకుంటున్నాను. సరే, మొత్తం ముప్పైఐదు కట్టలకి రాయిబిల్లు''

"బిల్లు మొత్తం 6,580 రూపాయలు అయింది బాబాయ్''

"సరే' అంటూ అంజయ్య బిల్లు తీసుకుని, మందు బస్తాలు పోలయ్య నెత్తి కెత్తుతుంటే, పోలయ్య బండి మీద వేసాడు.

అంజయ్య ఇంటికీ, కొట్టుకీ బండి రెండుసార్లు తిరిగింది.

"ఓరే పోలుగా.. రేపు యేకువ జామునే రారో... రేపట్నించీ వరసగా పొలం అంతా మందు ఏద పెడదాం. నాలుగు రోజుల్లో ఏదకావాలి. పొద్దున అరకకడితే పొద్దు కొండల్లో పడితేనే ఎద్దుల భుజాల మీద నుంచి కాడి దించేది!"

"వస్తాలే బాబా.. యేకువ జామున ఇంటికొస్తా, దడి దగ్గరకి రాను. నాకోసం చూడకుండా బండి కట్టుకునిరా, మందు కట్టలు యేసుకుని పోదాం" అన్నాడు పోలయ్య.

"అన్నం తిని పోరా పోలుగా'' అంది రాజమ్మ.

"ఇప్పుడు ఎందుకు పిన్నాం, ఇంటికి పోయి తింటాలే'

"నీ మొకం మీ ఇంటి దగ్గర తినేదేందిరా, ఇక్కడ తిని పోకూడదేట్రా? తినిపో!" చనువుగా మందలించి, విస్తరాకు తెప్పించి, పోలయ్యకు అన్నం పెట్టింది.

మరుసటి రోజు కోడి కూయకముందే, ఆ రోజుకి సరిపడా మందుబస్తాలు బండిమీద వేసుకుని పోయారు.

అంజయ్య అరకతోలుతూ వుంటే, పోలయ్య జడ్డిగంలో మందు ఏద పెట్టాడు. రాజమ్మ ఏ సాలుకి ఆ సాలు మందు మానికతో కొలతవేసి, పోలయ్యకి వడిలోపోసింది.

దట్టంగా మబ్బులు లేస్తున్నాయి. ఉరుములు, మెరుపులతో ఏ క్షణంలో వాన ముంచేస్తుందో అనిపించేలా వాతావరణం వుంది.

వానకి తడిస్తే మందు జావగారిపోతుంది. తడిసిన బస్తాలు మళ్లీ బురదలో, రొచ్చులో ఇంటికి తీసుకుపోవాలి. ఎంతమందు చేలో పడితే అంత మంచిదనే వుద్దేశంతో అంజయ్య ఎద్దుల్ని పరిగెత్తిస్తూ అరకతోల్తన్నాడు.

"బెమ్మాండమైన గిత్తలు బాబా ఇయ్యి. నడకచూడు, రాజా నడకే! ఈ గిత్తలు మాత్రం ఎప్పటికీ అమ్మవాకే బాబా!" పరుగు మీదనే మందు ఏదపెడతూ పోలయ్య మాట్లాడుతున్నాడు.

మొత్తానికి అంజయ్య, పొలం అంతా ఐదు రోజుల్లో ఏదపెట్టాడు.

రసాయన ఎరువు ప్రభావంతో మోచేతి నించీ, చిటికెన వేలివరకూ పోలయ్య చేతులు పచ్చి పుండ్లయిపోయాయి. బొబ్బలు బొబ్బలుగా పుండ్లులేచి, విపరీతమైన నొప్పి, మంట, బాధ పుట్టించాయి.

మందు ఏద పెడితే ఎవరి చేతులైనా పుండ్లు పడక తప్పదు. పుండ్లతో బాధపడటం, మితిమీరితే ఆస్పత్రిపాలు గావటం మినహాయించి ఎరువులు ఏదపెట్టే ప్రత్యామ్నాయ విధానమేదీ రూపుదిద్దుకోలేదు.

అంజయ్య వాళ్లు మందు ఏదపెడుతున్నన్ని రోజులూ అనుక్షణం భారీ వర్షం పడే సూచనలు ఇచ్చిన మేఘాలు పటాపంచలైపోయాయి. వాన జాడలేకుండాపోయింది.

మందు ఏద అయిన తరువాత పురుగు మందు మొదలుపెట్టారు. దగ్గర్లో నీళ్లు లేకపోవడంతో చాలాదూరం నించి నీళ్లు మోసుకొచ్చి పోస్తున్నారు. పోలయ్యకి తోడు మరో కూలి మనిషి కొండయ్యని పిలిచి, వాళ్లు ఇద్దరూ మందు వేస్తుంటే, మందులోనికి అంజయ్య నీళ్లు మోస్తున్నాడు.

పత్తి పంటకి విపరీతంగా పురుగుపడుతుంది. చాలా ఎక్కువగా పురుగు మందులు వాడాలి. ఏ ఇతర పంటకి కూడా ఇంత

ఎక్కువగా, భారీగా మందు వాడాల్సిన పని వుండదు.

పురుగు మందు అయిపోతే తీసుకు రావడా నికి వెంకట్రామయ్య కొట్టుకి వెళ్లాడు అంజ య్య.

"డబ్బు చూడాల్రా అంజియ్యా... మంచి అవసరంగా వుంది డబ్బుకి. ఇప్పుడు గానీ ఇచ్చావంటే ఇంక చివరిదాకా నిన్ను పైసా అడగనురా!" వెంకట్రామయ్య అన్నాడు.

"సొసైటీలో లోను పెట్టుకున్నా అన్నా! నాలుగు రోజుల్లో ఇస్తారంట లోన్లు. వాళ్లుఇ చ్చిన వెంటనే ఇస్తాను''

"నువ్వు ఎంత తొందరగా ఇస్తే అంత మంచిది''

అంజయ్య ఎండోసల్ఫాన్ ఒక గ్యాలనూ, క్వినాల్ఫాస్ ఒక గ్యాలనూ మందు తీసుకుని ఇంటికి వచ్చాడు.



రోజూ ఉదయం తొమ్మిదిన్నర ప్రాంతంలో ఇంటికి వచ్చి, పంపులూ, మందు ట్యాంకు లూ, కావిడీ తీసుకుని చేలోకి వెళ్లే మందు కూలీలు పోలయ్యా, కొండయ్యా ఆ రోజు 10 గంటలయినా ఇంకా రాలేదు.

"ఇంత ఎండబడ్డావాళ్లు రాలేదు. వాల్లదేం పోయింది, ఎప్పుడో వస్తారు! నువ్వు కూర్చుంటేయట్టు, పోయి కేకేసి రాక!" అంది రాజమ్మ.

అంజయ్య పల్లెలోకి బయలుదేరాడు. దార్లో ఇద్దరు ముగ్గురు రైతులు ఎదురు వచ్చి "మందు కూలోళ్లు ఇయ్యాల సమ్మె చేస్తండా రు, కూలి పెంచాలంట! ఇంకా ఎంత కావా లనో వాళ్ల ఆశ!" అన్నారు.

విషయం తెలుసుకుందామని పల్లెలోనికి వెళ్లాడు అంజయ్య.

పోలయ్యా, కొండయ్యా గుడిసె ముందు వేపచెట్టుకింద కుక్కి మంచం మీద కూర్చుని బీడీలు తాగుతూ మాట్లాడుకుంటున్నారు. ఇద్ద రుముగ్గురు ఆడవాళ్లు నిలబడివున్నారు.

"ఏందిరా, ఇంత ఎండబడ్డా ఇంకా మందు కి రాలేదు. ఇయ్యాల రారెట్టా?" అడిగాడు అంజయ్య, సమ్మె విషయం తెలియనట్లు.

"ఇయ్యాల మా పల్లెలో వాళ్లం అంతా సమ్మె చేస్తన్నాం బాబా! మందు వేసేవాళ్లకి 12 రూపాయల కూలి ఏ మూల కబురు? ఇంక పదిహేను రూపాయలు ఇస్తేనే మందుకి వస్తాం. మందుయేసి ఇంటికి వచ్చిన రోజు ఉచ్చ కూడా రాదు. అంత యేడి తీసుకునిద్ది మందు. యేడి తగ్గడానికి ఒక రూపాయి చల్లనీళ్లు తెచ్చుకుందామన్నా మీరిచ్చే డబ్బు లు కూరకీ, నారకీ చాలకపోతండే!" అన్నాడు కొండయ్య.

"తట్టీటూ చేలో బాగా పురుగు పడిందిరా, ఇయ్యాల్టికి రండి మందుకి, ఇయ్యాల మందు యేస్తే రేపటి యవారం రేపు చూద్దాం"

"పదిహేను రూపాయలియ్యివస్తాం" అన్నాడు కొండయ్య.

"నేను ఒక్కడ్నీ ఇచ్చేదేందిరా, ఊళ్లో అంద రూ ఇస్తే నేను మాత్రం ఇయ్యనా? నాదే ముందిరా!"

కూలీలు సమ్మె చేయడం అదే ప్రథమం. అంతకుముందు సమ్మె అంటే ఏమిటో ఎలాంటిదో కూడా వాళ్లకి తెలియదు. కూలీలకు చాలా సరదాగా, సంతోషంగా వుంది.

"సరే మీ ఇష్టంరా, వస్తే రండి, లేకపోతే లేదు'' అంటూ ఇంటికి వచ్చాడు అంజయ్య.

"ఇయ్యాల వాళ్లు రారంటనే, కూలి పెంచ మని సమ్మె చేస్తన్నారు. తట్టీటూ చేలోనేమొ పురుగు తెగపడింది'' అన్నాడు అంజయ్య రాజమ్మతో.

"సరే, ఇయ్యాల ఒక్కరోజుకి ఇస్తానని పిలవకపొయ్యావా?"

"మనం ఒక్కరం ఇస్తేయట్ట? అందరూ వేలెత్తి చూపెడతారు! ఇయ్యేడు చాలా పొలం వేస్తున్నామని ఇప్పటికే జనం కుళ్లికుళ్లి ఏడ్చిచ స్తన్నారు. అందరూ ఇస్తే నేను కూడా ఇస్తానని చెప్పి వచ్చా!"

"సమ్మె ఎవురు చేయించారంట బాబా?" అన్నపూర్ణ అడిగింది.

"రేడికల్ పార్టీ వోళ్లంట!"

"వాళ్లకి పనీపాటా ఏముంది? సరేగనీ, నువ్వు పల్లెలోకి పోయినప్పుడు నీకోసం సొసైటీ వాచిమన్ను వచ్చిపోయాడు. నిన్ను సొసైటీ గుమస్తా రమ్మన్నాడంట!" చెప్పింది రాజమ్మ.

"ఒకాళ లోను ఏమన్నా వచ్చిందేమొ, ఏందో కనుక్కొని దడి దగ్గరకి పోతా! గొడ్లని బయట ఎండలో కట్టేసి వచ్చా!" అంటూ అంజయ్య సొసైటీ దగ్గరకు వెళ్లాడు.

"దా అంజియ్యా... కూచో' అంటూ పెయిడ్ సెక్రటరీ ఎదురుగా వున్న కుర్చీ చూపెట్టాడు.

"ఏందబ్బాయి నారాయణా, పిలిచావంట?" అంజయ్య అడిగాడు.

"నీకూ, మీ ఆడోళ్లకీ ఇద్దరికీ లోన్లు వచ్చినయ్యి అంజియ్యా. చెరి ఆరువేలు వచ్చినయ్యి. అయితే షేరు ధనమని వెయ్యి రూపాయల అప్పుకి వంద రూపాయలు కట్టాలి. ఈ డబ్బు మీ పేరుతో సొసైటీలో వుండిద్ది''

"ఎప్పుడు కట్టాల?"

"లోన్లు అందరికీ ఎల్లుండి ఇస్తన్నారు. మీరు ఇయ్యాలా, రేపట్లో కడితే ఎల్లుండి అందరితో పాటు మీరు కూడా లోను తీసుకోవచ్చు''.

"ఎక్కడైన్నా చేబదులు తీసుకుని రేపు కడతాను నారాయణా. ఎల్లుండి ఖాయంగా ఇస్తారుగా లోను''

"కాగితాలు పైనుంచి వచ్చినయ్యి. మేము ఇయ్యాలా, రేపూ రాసుకుని ఎల్లుండి ఇయ్యడమే లోన్లు. అయితే అంజియ్యా... నేను అటు తిరిగీ, ఇటు తిరిగీ నాకు చాలా కర్చులు అయినయ్. అందరి దగ్గిరా వందకి రెండు రూపాయలు తీసుకుందామనుకుంటున్నాను'' ఏమంటావు అన్నట్లు అంజయ్య ముఖంలోనికి చూశాడు.

"వందకి రెండు అంటే చాలా అయిద్దిగా నారాయణా.... అందరితో మాట్లాడు, అందరూ ఏమంటారో' అని అంజయ్య లేచి దడి దగ్గరకి వెళ్లిపోయాడు.

మరుసటి రోజు అంజయ్య పన్నెండు వందలు తెచ్చి షేరుధనం సొసైటీలో కట్టాడు.

★ ★ ★

పొరుగు గ్రామంలోనే ఉన్న జిల్లా సహకార కేంద్ర బ్యాంకు శాఖ కార్యాలయానికి మరుసటి రోజు అంజయ్యా, రాజమ్మతోపాటు కొంతమంది లోన్లు తెచ్చుకోవడానికి వెళ్లారు.

బ్యాంకులో డబ్బులేదని జిల్లా బ్యాంకు నుంచి తీసుకు రావడానికి ఒంగోలు వెళ్లారట. వాళ్లు డబ్బు మధ్యాహ్నం రెండు గంటలకు తీసుకువచ్చేరు. డబ్బు తీసుకు వచ్చిన తరువాత కూడా రెండుగంటలసేపు ఇవ్వకుండా రైతుల్ని కూర్చోపెట్టారు, తెచ్చిన డబ్బు లెక్క పెట్టుకుంటూ.

ముసలివాళ్లూ, ఆడవాళ్లూ కూడా లోన్ కోసం వచ్చిన వాళ్లు ఉన్నారు. ఉదయం 9 గంటలకు ఇంటి దగ్గర బయలుదేరిన రైతులు సాయంత్రం నాలుగు గంటల వరకూ పడిగాపులు పడాల్సి వచ్చింది. అప్పటికీ దేవతలు కరుణించలేదు.

"అవతల మనకి పనులు లేవనుకు

న్నారేందిరా, పొద్దున అనంగా వస్తే ఇంతసేపు కూర్చోపెట్టారు!" ఒక రైతు కడుపుమండి, విసుగుపుట్టి తోటి రైతులతో అన్నాడు.

గదిలోనికి పోతున్న మేనేజర్ చెవిలో ఈ మాటపడింది. అంతే, ఆయన అగ్గిమీద గుగ్గిలం అయిపోయాడు.

"ఏంటయ్యా నువ్వనేది, ఇక్కడమేం ఏమైనా ఊరక కూర్చున్నామా? పనిచేస్తున్నది కనబడటంలా, అంత మాత్రం ఓపికతో వుండలేనివాడివి లోను తీసుకోకపోతేనేం?" అంటూ పొరం తీసుకున్నాడు.

ఆ రైతు మౌనంగా వుండిపోయాడు.

సొసైటీలలో లోను డబ్బు మొత్తం రైతు చేతికి ఇవ్వరు. వందకి డబ్బై రూపాయలు చేతికి ఇచ్చి ముప్పై రూపాయలకి ఎఫ్ఎల్‌పీఓ అని ఇస్తారు.

కొన్ని సొసైటీలు వ్యాపారాలు చేస్తాయి, కొన్ని చేయవు. వ్యాపారాలు చేసే సొసైటీలకు ఈ ఎఫ్ఎల్‌పీఓలు ఇచ్చి అక్కడ వున్న మందులు ఏవో అవి రైతులు తెచ్చుకోవాలి. దాదాపుగా రైతులకి అవసరమయ్యే ఎరువులూ, పురుగుమందులూ అక్కడ వుండవు. పనికిరాని తుక్కు మందులు అయినా సరే, ఎఫ్ఎల్‌పీఓలు మార్చుకోవడానికి తప్పనిసరిగా తెచ్చుకుని అవి నష్టంతో బయట అమ్ముకోవాలి. కొందరు ఈ రభస పడకుండా ఎరువుల కొట్లలో ఇస్తేవాళ్లే మార్చుకుంటారు.

ఈ సహకార వ్యవస్థ పరమ లోపభూయిష్టంగా తయారై అవినీతి అంటుజాడ్యంలా వ్యాపించిపోయింది.

రైతులు అందరూ కలిసి మాట్లాడుకుని పెయిడ్ సెక్రటరీకి వందకి ఒక రూపాయి ఇవ్వాలని నిర్ణయించుకున్నారు. అంతకంటే ఎక్కువ ఇవ్వలేమని చెప్పారు.

ఆరువేలు ఇవ్వాల్సిన లోన్‌కి ఎఫ్ఎల్‌పీఓల కి పద్ధెనిమి వందలు చెల్లు పెట్టుకుని అంజయ్యకీ, రాజమ్మకీ చెరి నలభైరెండు వందలు చేతికి ఇచ్చారు. పెయిడ్ సెక్రటరీకి ఇవ్వవలసిన లంచం ఇచ్చి చీకటిపడిన తరువాత ఇంటికి చేరారు.

లోన్‌వచ్చిన ఎనభైనాలుగు వందలలో కొంత వుంచుకుని అరవై నాలుగు వందలూ, ముప్పై ఆరు వందల విలువ చేసే ఎఫ్ఎల్‌పీఓలు తీసుకుపోయి వెంకట్రామయ్య కొట్లో ఇచ్చాడు అంజయ్య. మొత్తం పదివేలు అని గుర్తు పెట్టుకున్నాడు.

"ఇయ్యి ఏం సరిపోతయ్యిరా, ఇంకా చూడాలా! మాకు అసలు పైన మందులు అప్పియ్యటంలా!" అన్నాడు వెంకట్రామయ్య.

"వారం రోజుల్లో ఇంకా కొద్దో, గొప్పో చూస్తాలే అన్నా!"

"మళ్లీ అదుగో, ఇదుగో అంటే మాత్రం కుదరదురా. నువ్వు వారం రోజుల్లో గట్టిగా చూడాలి, లేకపోతే ఇద్దరం ఇబ్బంది పడతాం"

"నేను వాయిదాలు వేసేవాడ్ని అంట అన్నా? అంతమాత్రం తెలియదూ, ఇన్నేళ్లుగా కాతాపెట్టి మందులు తీసకపోతంటే!"

"గట్టిగా చూడమని చెప్పాలేరా, దాందేముందిగనీ, ఈ చిట్టీలు మార్చాలంటే చిట్టీకి వంద రూపాయలు కర్చయిద్దిరా! రెండు చిట్టీల మీదా రెండు వందలు మినహాయించి, మిగతాది జమ రాసుకుంటాం" అన్నాడు ఎఫ్ఎల్‌పీఓలని చూపెట్టి వెంకట్రామయ్య.

"అదేందన్నా ఒక్కోదానికి వందరూపాయలు తగ్గించుకునేది ఎందుకు?" అమాయకంగా అడిగాడు అంజయ్య.

"ఈ కాగితాలు తీసకపోయి ఇస్తే డబ్బులు ఇవ్వర్రా! ఏవో మందులు ఇస్తారు. వీటి కోసం ఒంగోలు తిరగాలి. చాలా కర్చయిద్దిరా! వందకి 7, 8 రూపాయలు లెక్కలేకుండా అయిద్ది. అయినా సరే, మొత్తం మీద రెండు వందలు తగ్గించుకుంటున్నా!"

"సరే కానివ్వండి, తప్పేదేముంది?" అంజయ్య కొన్ని మందులు తీసుకుని అన్నాడు.

అంజయ్యా, రాజమ్మా తీసుకున్న లోన్‌కి ఇసీల ఖర్చూ, షేరు కేపిటల్, ఎఫ్ఎల్పీఓల మార్జిన్, లంచాలూ మొత్తం లెక్క చూసు కుంటే రెండువేల కంటే ఎక్కువే ఖర్చ య్యాయి.

"వడ్డీ తక్కువ అనేకానీ ఆరు వేలకి ఐదు వేలు కూడ నిండా చేతికి రాకపోయె!" అంది రాజమ్మ నిరాశగా.

★ ★ ★

వర్షం కురిసి నెల రోజులు అవుతోంది. పత్తితోటలు బెట్టకువచ్చాయి. పొలం అంతా నెర్రెలు కొట్టింది. చెట్లు వాడిపోతున్నా పురుగు మందులు మాత్రం వేయక తప్పటంలేదు.

రైతులు వర్షం కోసం ఎదురు చూస్తున్నారు. ఊళ్లో ఉన్న మహాలక్ష్మమ్మ గుడికి ప్రతి శుక్ర వారం ప్రభలు కట్టి, పొంగళ్లు పెట్టుకుని సంబరాలు చేసుకుంటున్నారు.

పత్తితోటలు తిరగబడిపోతున్న దశలో వీళ్ల మొరని వానదేవుడు ఆలకించాడు కాబోలు తేలికపాటి జల్లులు రెండు రోజులు పడ్డాయి ఆ చిన్న వర్షానికే రైతులు ఉప్పొంగిపోయారు

మళ్లీ రెండోవరస సత్తువ మందు ఏద పెట్టడానికి ఎరువుల కోసం రైతులు కొట్ల మీద పోయిపడ్డారు.

అంజయ్య కూడ రెండోసారి ఏదపెట్టడానికి 17-17-17 అనే మందు 32 కట్టలు తీసుకున్నా డు. బిల్లు మొత్తం నాలుగున్నరవేలు అయింది.

పోలయ్యని తీసుకునిపోయి ఐదు రోజులు పొలం అంతా మందు ఏదపెట్టారు.

"అదును తూలిపోయింది. ఇప్పుడు మనం మందు ఏద పెట్టింది దండగేమో అని పిస్తందే! ఏటా ఈపాటికి పొలంలో సగం పత్తి తీసివుండేవాళ్లమి. ఇయ్యేడు అర్ధపంట రా వడం కూడా గగనమే!" అన్నాడు అంజయ్య.

"కానియ్యయ్యా, పొలంలో పెట్టిన సత్తువ ఎక్కడికి పోయిద్ది? ఇయ్యేటికి కాకపోతే మీద టికి పట్టదేంది?" భరోసాగా అంది రాజమ్మ.

"మీదటికి పొలానికి పట్టినా ఇయ్యేడు పెట్టుబడి పెట్టొద్దూ? వడ్డీలూ, వాచీలూ ఎంత వుతాయి?" ప్రశ్నించాడు అంజయ్య.

ఊళ్లో కొంతమంది రైతులు రెండో వరస మందు ఏదపెట్టలేదు.. అంజయ్యకు కూడా ఏద పెట్టడం పెద్దగా ఇష్టంలేదు. రాజమ్మ బలవంతం మీదనే రెండో వరస మందు ఏదపెట్టారు.

ఎండిపోయిన నేలమీద వర్షం పడటంతో ఆ నీటిని భూమి త్వరగా పీల్చేసింది. అది భారీ వర్షం కూడా కాదు.

వారం రోజులకే మళ్లీ పత్తి తోటలు వేలాడి పడిపోయాయి.

సమృద్ధిగా వర్షాలు వున్నప్పుడే సత్తువ మందు ఏద పెట్టాలి. అప్పుడే ఆ మందు మొక్కకి అందుతుంది. నీరు పుష్కలంగా లేని సమయంలో రసాయన ఎరువు వేస్తే మొక్క ఎండిపోవటమో, దెబ్బతినటమో జరుగుతుంది. పత్తితోటల విషయం కూడా అదేఅయింది.

వర్షం లేక పత్తితోటలు అన్నీ బెట్టకు వస్తే దానికి తోడు రసాయన ఎరువులు ఏద పెట్ట డంతో మరీ బెట్టకువచ్చాయి.

ప్రభలు, పొంగళ్లు అయిన తరువాత వాన కోసం భజనలు చేయడం మొదలు పెట్టారు. ప్రతీరోజూ రాత్రి మూడు, నాలుగు గంటలు క్రమం తప్పకుండా ఉగ్రరూతలూగిపోతూ తమ గాత్ర సౌందర్యానికి దేవతలంతా ముగ్ధులై మురిసిపోయి వాన కురిపిస్తారని మహదా నంద పడిపోతూ భజనలు చేస్తున్నారు భక్తి పారవశ్యంతో.

రాజమ్మా, అన్నపూర్ణా కూడా భక్తితో భజన లకు పోతున్నారు.

పంటల సంగతి తరువాత, పశువులకీ, మనుషులకీ తాగడానికి కూడా నీరు లేని దుర్భర పరిస్థితి దాపురించింది.

డిసెంబర్ నెల కూడా వచ్చింది. వర్షాలు లేవు.

ఒక్క ప్రకాశం జిల్లాకే పరిమితంకాదు అనావృష్టి. రాష్ట్ర వ్యాప్తంగా తీవ్రమైన అనావృష్టి పరిస్థితులు నెలకొన్నాయి.

అంతవరకూ కాసిన పత్తికాయలు కూడా పగులుతున్నాయి. చిన్న సైజు నారింజ కాయల పరిమాణంలో వుండే పత్తికాయలు వాన లేకపోవడంతో బలంగా లేక గోలీకాయల ఆకారంలోనే పక్వానికి వచ్చి పగిలిపోతున్నాయి.

పురుగుమందు వేయడం కూడా విరమించారు. తల్లీకూతుళ్లిద్దరూ నలుగురైదుగురు కూలీల్ని తీసుకుపోయి ప్రతీరోజూ పత్తి తీయించుకుంటున్నారు.

కౌలు పొలం తీసుకుని నష్టపోయాం అని రాజమ్మా, అంజయ్యా బాధపడుతున్నారు.

"కౌలుకి పొలం పట్టకపోయినా బాగుండేదయ్యా! బాపయ్యగాడి మొకాన చూస్తాచూస్తా పదమూడు వేలు పోసాం" అంది రాజమ్మ.

"వాడికి ఏనాడో బాకీ వున్నాం. పదమూడు వేలు ముందే ముకబదులు కట్టి వాడి బాకీ తీర్చాం" అంజయ్య అక్కసుతో అన్నాడు.

ఇటీవల ఆ దంపతులకు అలా అనడం, బాపయ్యని తిట్టడం, బాధపడటం అలవాటై పోయింది.

"చూస్తాచూస్తా ఇయ్యేడు ఎంత నష్టపోయామయ్యా? పెళ్లి కావాల్సిన పిల్ల డబ్బులు తీసకపోయి పత్తికి పెట్టి నాశినం చేసుకున్నామే! అమ్మాయికోసం అనుకున్న డబ్బులు కదిలిచ్చడమే బుద్ధితక్కువ" బాధగా అంది రాజమ్మ. ఆమెకి కూతురిపెళ్లి విషయమే మనసులో దిగులుగా వుంది.

★ ★ ★

రైతుల పని సక్రమంగా లేకుండావుంటే, ఇక కూలోళ్ల పని బొత్తిగా అధ్వాన్నంగా వుంది. అంతకుముందు ఏడాది కాంట్రాక్టుగా పత్తితీసి మనిషికి 30, 40 రూపాయలు సంపాదించుకున్నారు. ఇప్పుడు కాంట్రాక్టుగా పత్తి తీసేవాళ్లకి





పది రూపాయలు రావడం కూడా గగనమైపోయింది. ఇక రోజు కూలి అయితే నాలుగు రూపాయలు. కంట్రాక్టుగా పత్తి తీయడం అంటే కేజీకి రూపాయి ఇస్తారు. ఎన్నికేజీలు తీసుకుంటే అన్ని రూపాయలు.

వానలు బాగా కురిసి, పంటలు పండితే కూలీలకు బాధలేదు. బాగా పనులు దొరుకుతాయి. ఇప్పుడు పనికివస్తామన్నా పిలిచేవాళ్లు లేకుండా పోయారు.

పొలానికి పెట్టుబడిపెట్టి, పంట పండక, డబ్బు పోగొట్టుకుని ఆర్థికంగా అవస్థలు పడుతూ మానసికంగా రైతులు బాధపడుతుంటే, పనులు లేక, కూలిదొరక్క తిండిగింజలు కొనుక్కోలేక ఆకలీ, అర్ధాకలితో శ్రామికులు శారీరకంగా బాధపడుతున్నారు.

★ ★ ★

1985 జనవరి.

నూతన సంవత్సరం ప్రారంభంలోనే ముసురుపట్టి వాన జల్లులు పడ్డాయి.



"ఇక పత్తీగిత్తీ ఏం పండిద్దికానీ, పత్తి పీకేసి గొడ్లమేత ఏద పెట్టుకుందామే!" అన్నాడు అంజయ్య.

"కాయ కూడా ఏం లేదు. ఎందుకు ఇంక అనవసరంగా పత్తి? పీకిపారేసి గొడ్ల మేత ఏద పెట్టుకోవడమే మంచిది'' అని రాజమ్మ కూడా వంత పలికింది.

చాలామంది రైతులు పత్తితోటలు పీకి పారేసి పశువుల మేతకు జొన్న, వరిగె, కొల్లగంజేరు, ఉలవ, జనుములాంటి పైర్లు ఏదపెట్టుకుంటున్నారు. వానజల్లులుపడి నీటి ఎద్దడి తొలగిపోయినందుకు రైతుకూలీలు ఊరట చెందారు.

అంజయ్య కూలోళ్లని తీసుకుపోయి, కొంత పొలం పత్తిపీకి, ఆ పొలంలో జొన్న ఏదపెట్టాడు. కొంత పొలం పత్తి పీకకుండానే పట్టెల్లో జొన్న ఏదపెట్టాడు. సంక్రాంతి పండగనాటికి పొలం అంతా ఏదపెట్టడం అయిపోయింది.

పండుగకి హనుమంతరావు గుంటూరు నించి వచ్చాడు.

"యట్ట చదువుతున్నావురా?" అంజయ్య అడిగాడు.

"బాగా చదువుతున్నా బాబా! ఇయ్యేడు ఫస్టుక్లాసు వచ్చిద్ది. రేపు ఎండాకాలం సెలవల్లో ఇంటికి కూడా రాను. అక్కడే వుండి కోచింగ్ తీసుకుంటాను''

"వచ్చేఏడు కూడా ఇంటర్ చదవాలి కదరా? ఎంట్రన్స్ రాసేది వచ్చే ఏడాయె, అప్పుడు తీసుకోవచ్చుగా కోచింగ్' అడిగింది అన్నపూర్ణ.

"అట్ట బాగుండదులే అక్కాయ్. ఏ ఏడు సిలబస్ ఆ ఏడే కోచింగ్ తీసుకుంటే బాగుండిద్ది. వచ్చేఏడు సులభం అయిద్ది''

"గుంటూరు పొయ్యానూ, చదువు వెలగబెడుతున్నానూ అంటేకాదు, మంచి మార్కులు రావాలి. ఫలానా అంజియ్యగారి అబ్బాయి బాగా చదువుతున్నాడు అనిపిచ్చుకోవాలి నలు

గురిచేతా! ఇప్పటిదాకా మంచి పేరుంది నీకు, ఆ పేరుని నిలబెట్టుకోవాలి'' హితోపదేశం చేశాడు అంజయ్య.

"నువ్వు చెప్పాలెట్టా వాడికి? అంతమాత్రం తెలియదేంది చదువుకోవడం?" రాజమ్మ విసుక్కుంది భర్తమీద.

సంక్రాంతి పండుగకి ధాన్యం అంతా ఇండ్లకు వచ్చి, ఇండ్లనిండా గింజలతో నిండుగా కళకళలాడుతూ వుండేది.

పత్తి పంట వచ్చిన తరువాత ధాన్యం అనేమాటే లేదు. కనీసం కూరగాయలు కూడా పండించేనాధుడు లేడు. ఉల్లిపాయలూ, మిరపకాయలతోసహా సమస్తమూ కొనుక్కోవాల్సిందే.

"ఈ పండక్కి ఇంటినిండా గింజలు పుట్లు పుట్లూ రాసులు రాసులూ వుండేయి. ఇప్పుడు ఇంత వూరుమీద గిద్ద గింజలు పండించేవాడు లేకపోయా! కాలం ఎంత మారిపోయింది'' అన్నాడు అంజయ్య.

"గింజా గిట్రా లేకపోయినా ఏటా సంక్రాంతి పండక్కి యాభైవేలూ, నలభైవేలకి పత్తి అమ్మేవాళ్ళము. ఇయ్యేడు మొత్తం పత్తి అమ్ముకున్నా అందులో పదోవంతు వచ్చిద్దో, చచ్చిద్దో!" అంది రాజమ్మ బాధగా.

పదిరోజులు గడిచాయి.

520 రూపాయలు చేసి కొనుగోలు చేసిన పత్తిని 450 రూపాయలకి అడుగుతున్నారు.

"పత్తి అమ్ముదామయ్యా, రోజురోజుకీ రేటు తగ్గిపోతండే! పత్తి బరువు కూడా ఎండలు ముదిరేకొద్దీ తగ్గిపోయిద్దాయె'' అంది రాజమ్మ.

"అమ్ముదాంలేవే, తొందర పడతావెందుకు? 450 అంటున్నారు ధర, ఇంతకంటే ఇంకా ఏం తగ్గి చచ్చిద్ది?" అన్నాడు అంజయ్య.

"తగ్గినా, తగ్గకపోయినా అమ్ముకుంటే మనకి బరువు లేకుండా పోయిద్దిగా'' అంది రాజమ్మ.

★ ★ ★

"అంజియ్యన్నో, యార్డులో పత్తి కొంటన్నారంట, తీసకపోదామన్నా! 440, 460 చేసి కొంటన్నారంట! మనూళ్ళో 4 వందలకే అడుగుతున్నారు'' అంటూ యల్లారావు వచ్చాడు. అంజయ్యా, రాజమ్మా కూడా చర్చించుకుని తీసుకుపోదామనుకున్నారు.

"ఎన్ని బూరేలు అవతయ్యిరా నియ్యి?"

"8 అవతయన్నా!"

"నావి 50 కావచ్చురా. ఇయ్యాల తొక్కి రేపు తీసకపోదాం"

ఆరోజు రాత్రే అంజయ్య పల్లెలోనికిపోయి కూలీల్ని పిలిచాడు, పోలయ్యా, వాళ్ల నాన్నా, పోలయ్య భార్యావచ్చారు. వీళ్ల కుటుంబంలో నలుగురు కూడా పనిచేశారు. మొత్తం 51 బూరేలు అయ్యాయి.

యల్లారావూ, అంజయ్యా కలిసి ట్రాక్టర్ మీద బూరేలు యార్డుకి తోలారు.

అక్కడ జనం పలచగా వున్నారు. బూరేలు ట్రాక్టర్లూ, బండ్లుమీదా వస్తున్నాయి.

ఒకచోట కొందరు రైతులు గుంపుగా కూడి మాట్లాడుకుంటున్నారు. "ఇంక మనం మెత్తగా వుంటే లాభం లేదురా. ఇయ్యాల తేల్చిపారెయ్యాల్సిందే'' వాళ్లలో ఒకరైతు ఆవేశంగా అన్నాడు.

చిన్నగా ఆ గుంపు పెరిగింది.

"ఏందంట?" యల్లారావు ఒక రైతుని అడిగాడు.

"ఈ బయ్యర్‌నాకొడుకు వ్యాపారస్తులకు ధర బాగా యేసి, రైతులకి యిరగ్గోస్తన్నాడు. యేపారస్తులు యీడికి కమీషన్ ఇస్తన్నారంట! ఇయ్యాల ఆ యవారమేందో తేల్చాల!" ఆ రైతు చెప్పాడు.

ఉదయం నించీ రైతులు తిండీ, నీళ్లూ లేకుండా బయర్‌కోసం ఆపసోపాలుపడి ఎదురుచూస్తుంటే అతను మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో తీరుబడిగా వచ్చాడు.

మనిషి నల్లగా, దున్నపోతులా బలిసి వున్నాడు. ఆయన పేరు రమేష్. ఆయనకి సిసిఐలో ఉద్యోగం వచ్చి ఐదు సంవత్సరాలు అయింది.

ఆయన ఎక్కడ ఉద్యోగం చేసినా, అక్కడ వ్యాపారులతోనూ, సిసిఐ ప్రత్తిని అద్దె ప్రాతిపదికన జిన్నింగ్ చేసే జిన్నింగ్ మిల్లు యజమానులతోనూ ఒప్పందాలు కుదుర్చుకుంటాడు.

అలాగే ఈ యార్డుకి ట్రాన్స్‌ఫర్‌మీద వచ్చిన వెంటనే చుట్టుపక్కల గ్రామాల పత్తి వ్యాపారులని పిలిచివాళ్లతో ఒప్పందాలు కుదుర్చుకున్నాడు.

వ్యాపారులు రైతుల వద్ద తక్కువ రకం పత్తి కొనుగోలుచేసి సిసిఐకి తీసుకురావాలి. బయ్యర్ ఆ పత్తికి మంచి ధర వేస్తాడు. లాభం సగం, సగం.

వ్యాపారులు 320 చేసి తక్కువ రకం పత్తి కొనుగోలుచేసి సిసిఐకి తీసుకువస్తే ఈయన ఆ పత్తికి 420 రూపాయల ధర వేస్తాడన్నమాట! వ్యాపారి 50, బయ్యర్ 50 పంచుకుంటారు. అది ఒక ఒప్పందం.

కొందరు వ్యాపారులు క్వింటాల్‌కి 70 రూపాయలు మామూలు ఇవ్వాలి. వాళ్ళకి కోరిన లాభం చూపెట్టే బాధ్యత బయ్యర్‌ది.

పంట పండక, ధర లేక రైతులు బాధపడుతుంటే ఈ బయ్యర్ పుణ్యమా అని మరింత నష్టపోయే పరిస్థితి ఎదురైంది.

ప్రతీరోజూ గుంటూరునుంచి వచ్చిపోతుంటాడు.

ఒంటిగంటకు వచ్చిన బయ్యర్ రమేష్‌గుప్తా ఆఫీసులో కూల్‌డ్రింక్ తాగి, కొద్దిసేపు విశ్రాంతి తీసుకుని, సిగిరెట్ ముట్టించి విలాసంగా పొగ వదులుతూ ఫ్లాట్‌ఫారం మీదకు వచ్చాడు.

పత్తి వున్న ఆ ఆవరణలో పొగ తాగడం పూర్తి నిషేధం. అది ఆయనకు వర్తించదేమో!

ఆరోజు ఇద్దరు వ్యాపారులు పత్తిని సిసిఐకి తెచ్చారు. రైతులు కూడా 50 మందికంటే ఎక్కువ లేరు.

గత ఏడాది బయ్యర్ మంచి ధర వేయడం, తనని మెచ్చుకోవడం గురించిన స్మృతులలోనే అంజయ్య వున్నాడు. తన ఒక్కడి పత్తికైనా మంచి ధర వేస్తాడని కలగంటున్నాడు.

బయ్యర్ పత్తి చూసుకుంటూ, 380 నుంచీ 410 మధ్య రేట్లు వేస్తూ కొన్ని బూరేల్ని రిజెక్ట్ చేస్తూ వ్యాపారి బూరేలు దగ్గరకు వచ్చాడు. ఆ వ్యాపారి 30 బూరేలు తీసుకువచ్చాడు.

వ్యాపారి తెచ్చిన పత్తి పరమ నాసిరకం పత్తి.

పంట అయిపోయిన తరువాత రైతులు పొలాలు వదిలిపెడితే వ్యవసాయకూలీలు ఆ పొలాల్లో పత్తి ఏరుకుంటారు. దీనినే పరిగ పత్తి, గుడ్డి పత్తీ అనీ అంటూంటారు.

పనులు అయిపోయిన వేసవికాలంలో మహిళా వ్యవసాయ కూలీలకు ఈ పరిగ పత్తి నెలరోజులకు పైచిలుకు జీవనాధారం చూపెడుతుంది.

మంచి పత్తి ధర కిలో 4 రూపాయలుంటే, ఈ పరిగ పత్తికిలో ఒక రూపాయి ధర వుంటుంది. చిల్లర వ్యాపారులు ఈ పత్తిని కొంటూంటారు.

ఈ పరిగ పత్తి దారానికి పనికిరాదు. ఈ పత్తినుంచి వచ్చే దూది చౌకబారు హోటళ్లలో పరుపులకీ, బస్సుల్లో సీట్లులాంటి వాటికీ ఉపయోగిస్తారు.

వ్యాపారి తెచ్చిన 30 బూరేల నాణ్యతనీ బయ్యర్ చూశాడు. వాటిలో ఒక్క బూరేం కూడా సిసిఐ కొనదగ్గ బూరేంలేదు.

పరిగ పత్తినీ, మంచి పత్తినీ కలిపి మిక్సింగ్‌చేసి తీసుకువచ్చిన పత్తి అది. ఆ పత్తిని చూడటంతోనే అవి అన్నీ నిస్సందేహంగా రిజెక్ట్ చేసి తీరవలసిన బూరేలు. అక్కడ వున్న రైతులకి స్పష్టంగా ఆ విషయం అర్థమైపోయింది.

మంచి పత్తిలో ఎక్కువ పరిగ పత్తి

మిక్సింగ్ కాబట్టి వ్యాపారి ఉదయమే బయ్యర్‌తో ఫోన్‌లో మాట్లాడాడు. క్వింటాల్‌కి వంద రూపాయలు ఇచ్చే షరతు మీద బేరం కుదిరింది.

బయ్యర్ చాలా మురిసిపోయాడు. 30 బూరేలు 40 క్వింటాళ్లు వుంటాయి. అంటే 4 వేలు! రోజూ ఇలాంటి కష్టమర్స్ ఇద్దరు వచ్చినా చాలనుకున్నాడు.

వ్యాపారి బూరేల్ని బయ్యర్ రిజెక్ట్ చేస్తాడో, లేదా ఎంత ధర వేస్తాడో చూద్దామని రైతులు ఆసక్తిగా, పట్టుదలగా వున్నారు.

పత్తి నాణ్యతని చూసిన వెంటనే రైతులకి సంబంధించిన బూరేలు అన్నింటికీ కలిపి ధర పెద్దగా ప్రకటించడం మామూలు. బయ్యర్ వ్యాపారి బూరేల రేటు ప్రకటించలేదు. మౌనంగా చేతిలోని ప్యాడ్‌మీద వోచర్స్‌లో మాత్రం ధర నోట్ చేసుకున్నాడు.

"శెట్టి బూరేలు ఎంత వేసారండీ రేటు?" ఒక రైతు అమాయకంగా అడిగాడు. బయ్యర్ ఆ ప్రశ్న వినిపించుకోనట్లు రైతుకి చెందిన పత్తి నాణ్యతని పరిశీలించడంలో మునిగిపోయాడు.

"ఆ పత్తి ఎంత ధర వేశారు?" ప్యాంట్ వేసుకున్న ఒక రైతుకుర్రాడు గట్టిగా అడిగాడు.

"ఎంత అయితే నీకెందుకయ్యా, నీ పత్తి నువ్వు చూసుకో!" సీరియస్‌గా ముఖం పెట్టి నిర్లక్ష్యంగా అన్నాడు బయ్యర్.

"అదేంటండీ, శెట్టి గుడ్డి పత్తి తీసుకొచ్చి పెడితే దాన్ని కొంటం ఏందీ, మా మంచి పత్తిని పనికిరాదని తిరక్కొట్టడం ఏందీ'' నురో రైతు దబాయించి అడిగాడు.

"నన్ను కొనమంటారా, మానుకోమంటారా?" రైతులకు ఎక్కువ మాట్లాడే అవకాశం ఇవ్వకుండా సూటిగా అడిగాడు బయ్యర్.

"మా కోసం, మేం బతకలేమని కొంటన్నావా ఏందీ?"

"నీ అబ్బ సొమ్ము ఏమన్నా తెచ్చిపెట్టి కొంటన్నావెట్టా?" ఒక్కో రైతు ఒక్కోరకంగా మాట్లాడుతూ వుండగానే ఒక కుర్రాడు బయ్యర్ చేతిలోని ప్యాడ్ లాక్కున్నాడు.

"శెట్టి గుడ్డి పత్తికి 440 యేసాడ్రా ధర?"

"మా పత్తి బాగలేదంట, వద్దని తిరక్కొట్టాడు. శెట్టిగాడి గుడ్డి పత్తిపాటి మా పత్తిలేదు గామాలి''

"నా కొడుకు నా పత్తికి 4 వందలేగా ధర వేసింది''

"బాది పారేయండ్రా, తరవాత యవారం తరవాత చూద్దాం" అందరూ ఒక్కసారే నోటికి వచ్చినట్లు అంటున్నారు.

పరిస్థితి విషమించిందని గ్రహించిన బయ్యర్ రైతుల్ని తోసుకుని ఆఫీసులోనికి పోయే ప్రయత్నం చేశాడు.

అయితే అప్పటికే రైతుల కోసం పరిధిని దాటింది.

కిందపడేసి పొడిచే గొడ్డుని బాదినట్లు చావ బాది వదిలిపెట్టారు.

యార్డులోని హమాలీలు కూడా మౌనంగా చూస్తూ నిలబడ్డారు. వాళ్ళకి కూడా బయ్యర్ మీద బాగా కసిగా వుంది. చివరికి ఇద్దరు ముగ్గురు శాంతమూర్తులు ఉగ్రరూపం ఎత్తిన రైతుల్ని వెనక్కిలాగి, వాళ్ల చేతుల్లోనించి బయ్యర్‌ని తప్పించి సాదరంగా సాగనంపారు.

రైతులు ఇంకా కసి తీరక భయంకరమైన బండబూతుల పురాణం మొదలుపెట్టారు.

సాయంత్రానికి బయ్యర్ రేట్లు వేసిన పత్తివరకూ తూకం వేశారు. 440 ధర వేసిన వ్యాపారి పత్తి కూడా తూకం వేయడానికి యార్డులోని సిబ్బంది ప్రయత్నిస్తే రైతులు అంగీకరించలేదు.

చాలామంది రైతుల పత్తి ఆగిపోయింది. అంజయ్య, యల్లారావు పత్తి కూడా ఆరోజు కొనుగోలు జరగక నిలిచిపోయింది.

"ఏం చేద్దాం అంజియ్యన్నా?" యల్లారావు అడిగాడు.

"చేసేదేముంది? పత్తి ఇక్కడే పడేసి మళ్లీ రేపు రావడమే'' అన్నాడు అంజయ్య. మిగ తార్రైతులు కూడా తరువాత రోజు రావాలనుకు న్నారు.

బయ్యర్ రైతులమీద పోలీస్ కేసు పెట్టా లని ప్రయత్నించాడు. అయితే మందు బాగా బిగించి వ్యాపారి మిత్రులతో మాట్లాడిన తరు వాత ఆ ప్రయత్నం మానుకున్నాడు. కేసు పెడితే ఒరిగేదేమీ లేదు. ఇంకా బహిరంగం కావాల్సివస్తుంది. కేసులో తీగ లాగవలసిన పరిస్థితి రావచ్చు. అప్పుడు డొంక అంతా కదులుతుంది. చివరికి తనే ఎక్కువ నష్టపోవా ల్సివుంటుందని పోలీసు కేసు మానుకుని, రైతులు దౌర్జన్యం చేశారని ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేశాడు.

తరువాత ఉత్తర్వులు వచ్చేవరకూ కొనుగో ళ్లు ఆపమని వాళ్లు ఆదేశించారు.

అంజయ్యా, యల్లారావూ మరుసటిరోజు వచ్చారు.

"పైవాళ్లు కొనుగోళ్లు ఆపమన్నారు ప్ర స్తుతం. రెండు మూడురోజుల తరువాత కానీ మళ్లీ కొనుగోళ్లు సాగించం" అన్నారు అక్కడ సిబ్బంది.

"పత్తి ఇంటికి తీసుకుపోయి ఏం చేసు కుంటాం? మన ఊళ్లో మాత్రం ఎవడు కొంటు న్నాడు? రెండు మూడురోజులు ఆగి ఇక్కడే అమ్ముకుందాం. అటుతిప్పి, ఇటుతిప్పి తరు గుబోయిద్ది తప్ప చేసేదేమీ లేదు. ఇక్కడే వుంచి అమ్ముకోవటం మంచిది'' అన్నాడు అంజయ్య యల్లారావుతో. అందుకు అతను కూడా తలవూపాడు.

అంజయ్యా, యల్లారావూ లాంటి రైతులు వేలూ, లక్షలూ పెట్టుబడి పెట్టి, చెమటోడ్చి చాకిరీచేసి రెక్కలు ముక్కలు చేసుకుని, భయంకరమైన పెస్టిసైడ్ కాలుష్యాన్ని అనుభ వించి, శరీరం హూనం, విషపూరితం చేసు కుని పండించిన పంటని, ఏడాది ఫలసాయా న్ని, వాళ్ళ ఏడాది కలలపంటని ఆ దిక్కుమా లిన స్థలంలో వదిలి ప్రశాంతంగా ఇంటి దగ్గర వుండలేకపోయారు.

"పత్తి ఎవరైనా కాజేస్తారేమొ, ఎండలకి ఎంత తరుగుబోతుందో, నిప్పు అంటు కుంటుందేమొ'' అని అనుక్షణం భయపడ తూ, మధనపడుతూ, రోజులు నెలలుగా పరిగ ణిస్తూ ఆ మార్కెట్‌యార్డులో కుక్క కాపలా కాస్తూ ఎదురుచూసినా ఫలితం కనిపించలేదు. సిసిఐ వాళ్లు కొనుగోళ్లు మొదలుపెట్టలేదు.

ఎప్పటికప్పుడు "మాకు పైనుంచి ఆర్డర్స్ రాలేదు. రెండు మూడు రోజుల్లో కొంటాం" అని చెప్పుకుంటూ వస్తున్నారు.

బయ్యర్ మాత్రం అడ్రస్ లేకుండాపోయా డు. పదిరోజులు గడచిపోయాయి. తక్కువ ధరకి అయినా మిల్లులవాళ్లు బొత్తిగా పత్తి కొనడంలేదు.

ఎదురుచూసి, నిరాశచెంది కొంతమంది రైతులు పత్తిని ఇంటికి తోలుకుపోవడం మొద లుపెట్టారు.

అంజయ్య ఒకరోజూ, యల్లారావు ఒకరోజూ వాళ్ల ఊరునుంచి మేదరమెట్ల యా ర్డు దగ్గరకు వచ్చి పత్తిని చూసిపోతున్నారు. ఇంటి దగ్గర పనిమానుకుని రోజూ ఒకరు వచ్చిపోవటం ఇబ్బందిగా వుంది. చార్జీలు దండగా, పనిదండగా!

"మేదరమెట్లలో ఎవరైనా మిల్లువాళ్లు కొంటారేమొ కనుక్కోరా యల్లారావు. తెగన మ్ముదాం. ఇయ్యేడు అంతా దండగేలే!" అన్నాడు అంజయ్య విసుగుదలతో.

అంజయ్య కూడా ఊళ్లో వున్న ఎరువుల షాపుల చుట్టూ తిరుగుతున్నాడు.

తిరుపతయ్య కొట్టుకి ఒక మిల్లువాళ్లు వచ్చారు.

"మాకు లాటుకి కొరవపడ్డయ్యండీ! 80, 90 క్వింటాళ్లు పత్తి సరిపోయిద్ది. న్యాణ్యమైన పత్తి ఇప్పించండి'' అని అడిగారు వాళ్లు.

తిరుపతయ్య వాళ్లని అంజయ్య ఇంటికి తీసుకువచ్చాడు.

"మేదరమెట్ల యార్డులో వుంది పత్తి. సరుకు నికార్సయింది. మా వూళ్లో అందరి పత్తికంటే నాది మిగులే కానీ తరుగు కాదను కొండి'' అంజయ్య బడాయికి పోయాడు.

"సరే కానివ్వండి, పోయి చూద్దాం" మోటా రుసైకిల్‌మీద అంజయ్యని కూర్చో పెట్టుకుని మేదరమెట్ల తీసుకుపోయారు.

అక్కడే యల్లారావు కూడా వున్నాడు. పత్తిని చూసి బేరసారాలు జరిపారు.

అంజయ్య పత్తి 400, యల్లారావు పత్తి 390 రూపాయలకు బేరం కుదిరింది. అప్పుడే కాటా లు కూడా వేసుకున్నారు.

అంజయ్య పత్తి 70 క్వింటాళ్లు అయింది. డబ్బు రెండురోజుల్లో ఇస్తామని తిరుపతయ్య వప్పుకున్నాడు.

యల్లారావు పత్తి 11 క్వింటాళ్లు అయింది. ఇద్దరూ గుండెలమీదనుంచి పెద్ద బండరా యిని దించినట్లు సంతోషంగా ఇంటికి వచ్చా రు.

రెండు రోజులకు డబ్బు ఇస్తానన్న తిరుపత య్య వారంరోజులకు ఇవ్వాల్సిన మొత్తం 28. వేలు తెచ్చి ఇచ్చాడు.

"పొలానికి 60 వేలు పెట్టుబడి పెడితే 28 వేలా రావడం! ఎంత దండగే ఇయ్యేడు?" అని అంజయ్య బాధపడ్డాడు.

"మీ తమ్ముడికి మగతా కట్టాల, వడ్లు కొనుక్కోవాల, గొడ్లమేత వేసుకోవాల, అబ్బాయి చదువుకుంటుండే, ఇవన్నీ యట్టచే యాలి? అమ్మాయికి పెళ్లి ఇంకేం చేస్తాం ఇయ్యేడు? చూస్తా చూస్తా అమ్మాయికి అనుకు న్న డబ్బు మొత్తం కాజేసుకుంటిమి'' రాజ మ్మ అంది.

"ముందు ఎవరిబాకీ వాళ్లకి తీరుద్దాం. కొట్లో మందులబాకీ ఎంతయిందో, ఏం. పాడో... పూర్ణా... కొట్లో ఎంత ఇవ్వాలో లెక్క చూడమ్మా?"

కొట్లో తెచ్చిన మందులు ఎప్పటికప్పుడు అన్నపూర్ణ ఇంటి దగ్గర రాస్తుంది. అంజయ్య చెప్పిన వెంటనే పుస్తకం తెచ్చి లెక్కచూసింది.

"వడ్డీగాకుండా అసలు 3 వేలు ఇవ్వాల్సివ చ్చాం బాబా''

"అంతేనా, నేను చాలావుండిద్ది అనుకున్నా నే. వడ్డీ ఎంతో చూడరాదూ!"

"వడ్డీవాళ్లు చూస్తార్లే' అంది అన్నపూర్ణ.

ప్రతిఏటా దాదాపు 20, 25 వేలు బాకీవుండే వాళ్లు. ఈ సం॥రం ఎక్కువ మొత్తం బాకీ లేకపోవడంతో ఊపిరి పీల్చుకున్నాడు అంజ య్య.

అన్నపూర్ణ చెప్పిన తరువాత అంజయ్య కొట్లో కూడా ఒకసారి లెక్కచూసి, మళ్లీ వచ్చి డబ్బు తీసుకుపోయి ఇద్దామని వెంకట్రామ య్య కొట్టుకి వెళ్లాడు.

"యార్డులో పత్తి అమ్మావంట్రా?" అని వెంకట్రామయ్య పలకరించాడు.

"అమ్మాను అన్నా. కొట్లో బాకీ ఎంతవుందో లెక్కచూడండి. డబ్బు వచ్చింది, కడతాను''

శేఖర్ కాలిక్యులేటర్‌తో లెక్కలు కూడి "మొత్తం 12 వేలా 460 ఇవ్వాల్సివచ్చావు బాబాయ్, వడ్డీతోటి'' చెప్పాడు.

"అంత ఎందుకు వుందబ్బాయ్? అమ్మాయి లెక్కచూసి అసలు 3 వేలు అన్న దే!"

"అమ్మాయి పొరపాటుపడి వుండిద్ది బా బాయ్. మన దగ్గర లెక్క తేడా రాదు'' అన్నాడు శేఖర్.

"మేము పొరపాటు పడతాంలే, మీరయితే కరెక్టు మనుషులు మరి! లెక్క అంతా ఒక కాగితంమీద రాసివ్వు''

అంజయ్య పొలానికి వాడుకున్న మందు లూ, కొట్లో ఇచ్చిన డబ్బులూ మొత్తం ఒక కాగితంమీద రాసి ఇచ్చాడు శేఖర్.

ఆ కాగితం తీసుకుపోయి అన్నపూర్ణకు ఇచ్చి "లెక్క సరిగా చూడమ్మా పూర్ణా... 9 వేలు లెక్క తేడా వస్తన్నది. పద్దు అంతా ఈ

కాగితంమీద వేసి ఇచ్చాడు'' అని ఆ కాగితం ఇచ్చాడు అంజయ్య.

అన్నపూర్ణ రాసుకున్న పుస్తకం తెచ్చి, ఈ కాగితంతో పోల్చి లెక్కచూసింది.

"వాళ్లు పొరపాటు పడరు అంటనా? నిజమే, వాళ్లు ఎందుకు పొరపాటు పడతారు, జనాన్ని మోసం అయితే చేస్తారుకానీ... మనం సొసైటీలో లోను తెచ్చినప్పుడు వాళ్లకి ఇచ్చిన జమ 64 వందలూ రాసుకోలేదు బాబా! నువ్వాక్రాను గ్యాలను ఒకటి మన కాతాలో ఎక్కువ రాశాడు''

"మొదట్లో 20 లీటర్ల రమ్ము వాడాం. తరవాత 10 లీటర్ల రమ్ము తెచ్చాం. అంతే కానీ, గేలన్ డబ్బా ఎప్పుడు తెచ్చాం?" అని అంజయ్య మళ్లీ కొట్టు దగ్గరికి వెళ్లాడు.

వెంకట్రామయ్య వాకిట్లోనే కూర్చుని పేపరు చూస్తూ, అన్నాడు "లెక్క రైటేకదరా అంజియ్యా?"

"కాదు తప్పు''

"ఏందిరోయ్?" ఉలిక్కిపడ్డాడు ఆయన.

"నేను ఒకసారి 64 వందలు ఇస్తే అవి జమ రాసుకోలేదు మీరు. నువ్వాక్రాను ఒక గేలను నా పద్దులో ఎక్కువ రాశారు''

"64 వందలు ఎప్పుడు ఇచ్చావు? మేము రాసుకోకుండా ఎందుకు వుంటాము? తలకాయ వుండే మాట్లాడతన్నావంటరా నువ్వు?" ఆవేశపడిపోతూ కోపంగా లేచి అన్నాడు వెంకట్రామయ్య.

"సొసైటీలో మాకు లోను వచ్చినప్పుడు నీకు 64 వందల రొక్కం, 36 వందల రూపాయలకు చీట్లు తెచ్చి ఇయ్యలా? మొత్తం 10 వేలు ముద్దరసుద్దిగా వుండిద్దిలే అన్నా అని నేను అనలా? బాగా గుర్తుతెచ్చుకో, డబ్బులు చూడు చూడు అని నువ్వు గోలచేస్తంటేనే సొసైటీలో లోను తీసుకుంది'' గుర్తు చేశాడు అంజయ్య.

"నువ్వు డబ్బు ఇస్తే పద్దు రాసుకోకుండా ఎందుకు వుంటామురా? నువ్వు ఆ చీటీలు ఇచ్చినట్టు గుర్తే?"

"ఆ చీటీలే ఇచ్చాననూ? అవే ఇచ్చి డబ్బులు ఇయ్యకపోతే నువ్వసలు మందులు ఇచ్చేవాడివేనాంట? సొసైటీలో తెచ్చిన డబ్బు నేను ఏం చేశాననుకుంటన్నా! బాగా గేపకం చేసుకో' అన్నాడు అంజయ్య.

"మన కొట్లో పొరపాటు ఎప్పుడూ జరగదురా, పద్దు రాసివుండాలికదా!"

"నువ్వు పద్దు రాయకపోతే మేం డబ్బు ఇయ్యనట్టా? నువ్వు రాసుకోటం మర్చిపొయ్యావా లేకపోతే గుర్తువుండి కూడా లోకుల సొమ్ము కాజేద్దామనుకుంటన్నావా? నాసిరకం యిత్తులు తెచ్చి ముంచావనుకో' విజృంభించాడు అంజయ్య.

"తొందరపడతావెందుకురా, తప్పు ఎక్కడ జరిగిందో చూడాల కానీ..." కాళ్ళబేరానికి వచ్చాడు వెంకట్రామయ్య.

"తొందరపడక ఏందన్నా, రూపాయా, రెండ్రూపాయలా? ఆరేడేలు డబ్బు తీసుకుని ఎప్పుడిచ్చావని నంగనాచి మాటలు మాట్లాడతంటవి? మేం ఇంటి దగ్గర ఎదురు పద్దు రాసుకోబట్టి సరిపోయిందిగానీ, లేకపోతే ఏమయ్యేది మా పని!"

"నువ్వు ఇచ్చిన రోజు శేఖర్ వున్నాడా?"

"ఏమో, ఎవుడికి గుర్తు అవన్నీ!"

"వాడు అప్పుడు వుండి వుండడ్రా, వుంటే అప్పటికప్పుడే పద్దు రాసివుండేవాడు. నేను వాడిచేత రాపిద్దామనుకుని మర్చిపోయివుంటాను. నువ్వు నిజంగా ఇచ్చావుకదరా?"

"నిజమేందీ, అబద్ధమేందీ ఇందులో? ఇయ్యకుండా ఇచ్చానంటానా? సొసైటీ చీట్లతోపాటు తీసుకుంది గుర్తుచేసుకో నువ్వే''

"సరే, ఆ డబ్బు జమరాసి మిగతా బాకీ లెక్క చూడ్రా శేఖరూ..."

"నువ్వాక్రాను ఒక గేలను రాశారబ్బాయి నా పద్దులో! నేను గేలన్ ఎప్పుడూ తీసుకుపోలా! 20 లీటర్లూ, 10 లీటర్లే తీసుకున్నా కానీ, గేలను

ఎప్పుడు తీసుకున్నాను?"

"నీ పద్దులో రాసివుంది బాబాయ్, తీసకపొయ్యావు నువ్వు'' శేఖర్ గట్టిగా అన్నాడు.

"కొద్దిగా వళ్లు దగ్గర పెట్టుకుని మాట్లాడు. నేను తీసకపోలేదురా అంటే తీసకపొయ్యానంటావేం?" గద్దించి అన్నాడు అంజయ్య.

శేఖర్ పద్దు పుస్తకాలూ, బిల్లు పుస్తకాలూ అన్నీ తీసి గంటసేపు చూశాడు. పేజీలు తిప్పాడు. హైరానాపడ్డాడు.

"పొరపాటు అయింది బాబాయ్, నారాయణ కాతాలో రాయాల్సింది, నీ కాతాలో రాశాను''

"సరే, మళ్లీ ఇంకోసారి లెక్కచూసి మీకు ఎంత ఇవ్వాలో చెప్పు. తెచ్చిఇస్తా''

శేఖర్ మళ్లీ లెక్కచూసి చెప్పాడు. "అసలు 3 వేలూ, వడ్డీ 650 అయింది బాబాయ్. నువ్విచ్చిన డబ్బుకీ, మా దగ్గర తీసుకున్న మందులకీ రెంటికీ లెక్కకట్టాను''

"ఎన్ని రూపాయల వడ్డీ కట్టావేంది?"

"మామూలు వడ్డీయే! అందరి దగ్గరా మూడు రూపాయల వడ్డీయేగా తీసుకునేది''

అంజయ్య ఇంటికి వచ్చాడు.

"ఏమన్నారు బాబా?" అన్నాపూర్ణ అడిగింది.

"మొదట గట్టిగా వాగారు. మెత్తబడకుండా నేను కూడా గట్టిగా ఎదురుతిరిగి మాట్టాడేసరికి తోక ముడిచారు. అసలు పొరపాటు మనదేలే అమ్మాయ్. మనం పుస్తకం పెట్టుకున్నా, పద్దులు మనం రాయకుండా, వాళ్ళ చేత్తోనే ఎప్పటికప్పుడు రాయించుకుని వస్తే సరిపోయేది''

"ఇట్ట మోసం చేస్తారనీ, తేడాలు వస్తయ్యనీ ఎవురు అనుకున్నార్లే బాబా? మూడేళ్ల నించీ మనం రాసుకోడంలా, ఎప్పుడు తేడా వచ్చింది? తింటన్న ఆదాయం చాలడం లేదేమొ, ఇంకా కాజేద్దామని చూస్తున్నారుగా మాలి!" అంది అన్నపూర్ణ.

"ఇంక మన జేగర్తలో మనం వుంటం మంచిది'' అని అంజయ్య వాళ్లకి ఇవ్వాల్సిన డబ్బు మొత్తం లెక్క పెట్టుకుని, తీసుకుపోయి ఇచ్చివచ్చాడు.



ఢిడి దగ్గరనించి అంజయ్య ఇంటికి వచ్చేసరికి వెంకటేశ్వర్లు కూర్చుని వున్నాడు.

వెంకటేశ్వర్లుని ఊళ్లో పెద్ద మనిషిగా అందరూ గౌరవిస్తారు. ఆ ఊళ్లో అందరికంటే ఎక్కువ పొలం, డబ్బు ఉన్నది వెంకటేశ్వర్లుకే. ఆయనది మంచి స్వభావం. ఊళ్లో ఎవరైనా తగాదాలుపడి పరిష్కరించమని ఆయన దగ్గరకి వెళ్తుంటారు. ఆయన ముఖమాటానికి పోకుండా న్యాయంగా పరిష్కరించాలని ప్రయత్నిస్తాడు. ఇంట్లో మాత్రం ఆయన పెత్తనం పెద్దగా సాగదు. ఆడవాళ్లదే రాజ్యం ఇంట్లో. ఈయన ఆర్థికంగా ఎవరికీ పెద్దగా సాయపడకున్నా ఇతర విషయాలలో సాయం చేస్తాడు.

"బాబాయి మన అమ్మాయికి సమ్మంధం తీసకొచ్చాడు'' నిరాశగా నవ్వుతూ రాజమ్మ అంది అంజయ్యతో.

"మనమ్మాయికి అన్నివిధాలా తగిన సమ్మంధంరా! పోతవరంలో మన పెద్దమ్మాయిగారి ఇంటిపక్కనే వాళ్ల ఇల్లు. అబ్బాయి మన సుధాకర్ క్లాసుమేటు కూడా. నేను మొన్న అమ్మాయిగారింటికి వెల్తే వాళ్లనాన్న సమ్మంధం చూడమన్నాడు. కట్నకానుకలు కొద్దిగా తగ్గినా పిల్ల గుణవంతురాలు కావాలన్నాడు''

# ఏరిన ముత్యాలు

☆ "మతం మనుషులు పరస్పరం ద్వేషించుకోవడానికి తగినంతగానున్నది. కానీ ప్రేమింప చేయడానికి చాలినంతగా లేదు''

-జోనాథన్ స్వీఫ్ట్

☆ "నీకు చదవడం తెలియాలే కానీ, తెలిస్తే ప్రతి మానవుడు కూడా ఒక పుస్తకమే''

-ఎనియమ్‌వల్లాలీ చానింగ్

☆ "పుష్పానికి పరిమళం ఎలాంటిదో మనిషికి విశిష్టమైన శీలం అలాంటిది''

-చార్లెస్ ఎం. ప్రానజ్

☆ "ప్రేమికులు ఒకరంటే ఒకరికి విసుగుపుట్టకపోవడానికి కారణం వారు ఎంతసేపూ తమ గురించి చెప్పుకోవడం"

-రోష్‌షోకార్ట్

☆ "అదృష్టం మనకు మంచి తల్లిదండ్రులను ప్రసాదిస్తుంది. కాని, అవకాశంతో మనం మంచి స్నేహితులను సంపాదించుకోవచ్చు''

-వెలీలీ

☆ "అవినీతికి పాల్పడినవారికి చివరికి మిగిలేది ఆవేదనా అవమానాలే'

-సి. సిమ్సన్

☆ "మతం అనేది దీనజనోద్ధరణకన్నా ముఖ్యమైనది కాదు. ఈ మతం భాష కర్మకాండలో లేదు''

-మహాత్మాగాంధీ

☆ "సరిదిద్దకుండా వదిలివేసిన తప్పును మించిన ఆపద ఇంకోటిలేదు''

-చాసా

☆ "ప్రకృతిని గురించిన భయమే మతస్థాపనకు దారితీసింది''

-బెర్ట్రండ్ రసెల్

☆ "చెడును ఉపేక్షించడం అంటే, మంచిని నిర్లక్ష్యం చెయ్యడమన్నమాట"

-టాల్‌స్టాయ్

☆ "చట్టబద్ధమైన న్యాయం కొరకు కోర్టుల కెక్కడం పిల్లిని రక్షించుకోవడానికి పాడి ఆవును పోగొట్టుకోవడంలా వుంటుంది''

-చైనా సామెత

☆ "నూరుమంది పురుషులు చేరినచోట ఒక బస ఏర్పడుతుందేమోగాని ఆడది లేనిదే ఒక్క గృహాన్ని సృష్టించలేము''

-చైనాసామెత

☆ "విచారణకు భయపడి పారిపోయేవ్యక్తి తన నేరాన్ని అంగీకరించినట్లే''

-వైరస్

సేకరణ: కె.వెంకట రామఅక్కయ్య

"నిజమే మామా, ఇయ్యేడేమొ పొలంలో దండగలొచ్చా!"

"దండగా, లాభాలదేముందిరా? ఒక ఏడు పండుతుంటయ్, ఒక ఏడు ఎండుతుంటయ్! దండగలొచ్చినయని ఈడొచ్చిన పిల్లకి పెళ్లిచే యడం మానుకుంటామా? ఇంతమాత్రం సమ్మంధం దొరకడం కష్టంరా అంజియ్యా''

"అయితే వాళ్లు ఎంతలో ఉన్నారేంది?"

"అబ్బాయి పాలిటెక్నిక్ చదివి ఆర్ అండ్ బిలో సూపర్‌వేజర్‌గా చేస్తన్నాడ్రా. మంచి ఉజ్జోగం. 50 వేలు డబ్బూ, 10 సవర్ల బంగారం, ఎకరం పొలం పెడితే పనయిద్దిరా! వాళ్లు చాలా ఆశలో వున్నారనుకో'

"మా యవారం నీకు తెలియదంట మా మా? ఆరెకరాల వాళ్లం మేము? అంత ఇయ్యడం మా వల్లయిద్దీ?"

"అది ఇయ్యాల తక్కువ కట్నంరా! ఈ మిడిమాలపు పత్తి వచ్చిన తరవాత లక్షల్లక్షలు ఇస్తన్నార్రా కట్నం! నీకు తెలియందేముంది? నువ్వు అసలు ఎంతలో ఉన్నావో చెప్పు, దాన్నిబట్టి మాట్టాడదాం"

"ఇప్పుడు చేతిలో ఎర్ర ఏగానీ లేదు మా మా! ఇయ్యేడు పత్తిలో 30, 40 య్యేలు మునిగాం. తంటాలుపడి 30 వేలు డబ్బూ, 5 సవర్ల బంగారం పెడతాం. అంతకంటే ఎక్కువ మమ్మల్ని కోసినా దొరకదు''

"వాళ్లు కేషే 70, 80 వేలమీద వున్నార్రా. బంగారం, పొలం కూడా అడుగుతున్నారు. ఇంకా కొద్దిగా పెట్టే పనయితే చూడ్రా. వాళ్లు గట్టిగా అడిగేవాళ్లు కూడా కాదు. తగ్గుతారను కో, అయితే కుడిఎడంగా పోవాలిగా!"

"ఇంక పెట్టలేం మామా! వెనక ఇంకో పిల్లవుండే, మంచి సమ్మంధం అంటన్నావ్‌గా బట్టి ఎకరం పొలం కూడా ఇస్తాం"

"సరే, ఏదైనా నేను రేపు సందకాడ చెప తారా! మనకి అందే పనయితే చూద్దాం. లేకపోతే చేసేదేముంది అనుకో, వస్తామరి!" అంటూ వెంకటేశ్వర్లు వెళ్ళిపోయాడు.

"ఈ మనువు కుదిరితే బాగుండిద్దయ్యా!" అంది రాజమ్మ ఆశగా.

"వెంకటేశుల్లు మామ మనిషి మంచోడే, మంచి సమ్మంధం అయి వుండిద్ది, లేకపోతే ఆయన పట్టించుకునేవోడు కూడా కాదు. ఇంటి కల్లా వచ్చి చెప్పాడంటే ఇంటికి వచ్చిన అదృష్టాన్ని కాలదన్నుకోవటమే! మన శక్తికొద్దీ వెనకాడకుండా చూద్దాం" అన్నాడు అంజ య్య

అన్నపూర్ణకి కూడా ఈ సంబంధం కుదిరితే బాగుంటుందని మనసులో కోరిక కలిగింది.

మరుసటిరోజు సాయంత్రం మళ్ళీ వెంకటే శ్వర్లు వచ్చి చెప్పాడు, "మనకి అందేటట్టు లేదురా అంజియ్యా యవారం. నేను నిన్న చెప్పినంత అయితే వాళ్ళు లొంగుతారు. ఆ అబ్బాయికి పొలం వుందీ, ఉజ్జోగం వుందీ, డాబా వుంది. ఒక్కడే కొడుకు. వాళ్ళు ఎక్కువ కూడా ఆశపట్టంలేదు. నువ్వేమో గీసిన గీటు దాటనంటుంటివి!"

"మా తాహతు నీకు తెలుసు కద బా బాయ్!" అంది రాజమ్మ.

"సరే, ఊరక వున్నవాళ్ళని కదిలించి ఆశ పెట్టానని బాధపడతన్నానమ్మాయి. నిరుడు ఒకసారి వీడు అమ్మాయికి బాగానే ఇస్తాం అన్నాడమ్మా నాతో. అందుకు తెచ్చాస మ్మందం"

"కాలం నిరుడు వున్నట్టు వుంటే ఇయ్యాక పొయ్యామంట మామా!" అన్నాడు అంజ య్య.

"మీకు అనవసరంగా ఆశ పెట్టానని పిస్తందిరా! నాకు బాధగా వుంది''

"మా మంచి కోరే నువ్వు సమ్మంధం తెచ్చావుగా బాబాయ్... సరే, ఇందులో ఆశప డేది ఏముందిలే? మన తాహతుకి అందదను కుంటే సరిపోయా!" అంది రాజమ్మ.

★ ★ ★

"అబ్బాయి దగ్గరనుంచి వుత్తరం

వచ్చింది, డబ్బు పంపించమని..." రాజమ్మ అంది, పాలు పిండుకోవడానికి దడి దగ్గరకి వెళ్ళి, అంజయ్యతో.

"రేప్పొద్దున పోస్టాఫీసుకి పోయి పంపిస్తాలే వే! అసలు ఉత్తరం రాకముందే పంపిద్దాం అనుకుంటానే మరచిపోయాను''

"అబ్బాయి దగ్గరకు పోయి వద్దామయ్యా! ఎట్ట చదువుతున్నాడో, ఏమో! పోయి చూసొద్దాం. నాకు వాడిమీద గుబులుమళ్ళింది''

"వంద రూపాయలు కర్చవుతాయ్ కదే?"

"కానీయ్, పిల్లోడికంటే ఎక్కువేంది? నల భైయ్యేలు తగలేసాం పత్తిలో! అందులో ఇది ఒక లెక్కా?"

"సరే అయితే, రేప్పొద్దున పోయొద్దాం. పన్లు కూడా ఏమున్నాయి? గొడ్ల దగ్గిర అమ్మాయి వుండిద్ది, సందకాడికి తిరగ్గొట్టుకుని వద్దాం"

రాజమ్మ ఆరోజు రాత్రి లడ్లూ, కారపూసా వండింది.

అవి తీసుకుని మరుసటిరోజు వుదయం భార్యాభర్తలు ఇద్దరూ గుంటూరు వెళ్ళారు.

రాజమ్మ గుంటూరు చూడటం అప్పుడే. బస్టాండూ, ఆ వీధులూ, ఓవర్‌బ్రిడ్జీ, బిల్డింగు లూ చూసి ఆశ్చర్యపోయింది.

హనుమంతరావుకి ట్యూషన్ ఫీజులకీ, పరీక్ష ఫీజులకీ, మెస్ బిల్లుకీ 2 వేల రూపాయ లు ఇచ్చి వచ్చారు.

వీళ్ళు ఇంటికి వచ్చేసరికి అంజయ్య తమ్ముడు రామయ్య బళ్ళారినుంచి వచ్చి వున్నాడు.

"ఎప్పుడొచ్చావురా?" అంజయ్య అడిగాడు.

"మీరు పొద్దున అటు పొయ్యారూ, నేను ఇటు వచ్చా! అబ్బాయి బాగా చదువుతున్నాడా?"

"బాగానే చదువుతున్నాడు. అమ్మా, పిల్లలూ బాగున్నారా? వాళ్ళని కూడా తీసకరాకపొయ్యావా?"

"అందరూ వస్తే చార్జీలూ, కర్చులూ రెండు వేలు అవుతాయ్! దగ్గిరా, దాపా? పొలంలో డబ్బులు బాగా వస్తే ఎట్ట తిరిగినా సరిపోయిద్ది. ఇయ్యేడు అక్కడ మాకూ దండగలే!"

"బళ్ళారిలో దండగలురావుగానీ, దానికీ దానికీ సరిపోద్ది అన్నాడే యెంకమ్మగారి యెంకట్రావు!"

"పంట పండటం పర్లేదుకానీ, ధరల్లేవన్నా! నిరుడు ఈ రోజుల్లో అక్కడ 900లకి కొన్న పత్తి ఇప్పుడు 500లకి అడుగుతున్నారు!"

"నయం, అక్కడ పంట అయినా వుంది. ఇక్కడ పంటాలేదు, ధరలూ లేవు!"

"నాకు కావడానికి 150 క్వింటాళ్ళు అయింది పత్తి. కర్చులు పెరిగితే పెరిగినయ్, పత్తికి రేటు ఏది? నిరుటి రేటు వున్నా ఇంకా 60, 70 వేలు వచ్చేయ్యి! ధర లేకపోయేసరికి లాభం రాలా!"

"ఇక్కడ ఇయ్యేడు మాకు 40 య్యేలు దండగ! ఎంతకాలం చాకిరీ చేస్తే ఈ దండగని పూడ్చుకుంటాం!" అన్నాడు అంజయ్య బాధగా.

"దేశమంతా ఇయ్యేడు రైతుపని బాగలేదన్నా! మా కేంప్‌లో క్రిష్టాజిల్లావోడు నాలుగేళ్ళ నాడు పొలంకొని ఇప్పుడు బేరం పెట్టాడన్నా! ఐదెకరాల సదరం. ఎకరా 16 వేలు. నా దగ్గర 60 య్యేలు వున్నయ్ ఇప్పుడు మన అన్నపూర్ణకి పెళ్ళి చేసే పనయితే సరే, లేకపోతే నువ్వు 20 య్యేలు సర్దితే ఆ పొలం కొంటా అన్నా!"

"మా యవారం నీకు తెలియదంట్రా? ఈ సాల్లో చూస్తా చూస్తా 40 య్యేలు దండగపడ్డా! అమ్మాయి పెళ్ళికి కట్నం కోసమని 50 వేలు మిగిల్చి అవి కూడా పత్తిలో తగలేసుకున్నా! మొన్న పోతవరంనుంచి అమ్మాయికి సమ్మంధం వచ్చింది. అబ్బాయికి మంచి ఉజ్జోగం కూడా నంట! చేతిలో పైసాలేకపోతే ఏం చేస్తాం పెళ్ళి?"

"అయితే 20య్యేలు దొరకవంటన్నా?"

"ఎక్కడున్నయిరా? నీకు మీదటకి పొలం

మగతా డబ్బు ఇద్దామనుకున్నా! నువ్వేమొ పొలం బేరం చేశానంటుంటవి! ఏడెనిమిది వేలు తీసుకోరా ఇయ్యేటికి. మిగతా డబ్బు మీదటకి ఇస్తా!"

"అట్టంటేయట్టన్నా? నువ్వు 20య్యేలు సర్దుతావని ఆశపడి ఇంతదూరం వచ్చా! సరే, నువ్వు అంత ఇవ్వలేకపోయినా మగతా డబ్బు అయినా మొత్తం ఇయ్యి. పొలం కండింపుకి కొరవపడితే నా తంటాలు నేను పడతా!"

"మొత్తం దొరకవురా!" నసుగుతూ అన్నాడు అంజయ్య?

"పక్కన బాపయ్యకి 9 నెల్లనాడే ముకబదులు కట్టలా? నేనేమన్నా ముందు డబ్బు ఇస్తేనే చేలోకి దిగు అన్నానా? ముందే మగతా డబ్బు కట్టిచ్చుకుంటే నాకు వడ్డీ కూడా రాకపొయ్యిందీ? ఎక్కడైనా అప్పు అయినా తీసుకుని ఇయ్యి!" నిర్మొహమాటంగా అన్నాడు రామయ్య.

అంజయ్య మౌనంగా వున్నాడు.

మరుసటి రోజు అంజయ్య తన దగ్గర వున్న డబ్బుతోపాటు, ఊళ్ళో చేబదులు తీసుకుని వచ్చి రామయ్యకి మగతా డబ్బు కట్టాడు. ఎకరా 21 వందల లెక్కన 6 ఎకరాలకీ మొత్తం డబ్బు ఇచ్చాడు.

రామయ్య ఆ డబ్బు తీసుకుని సూట్‌కేసులో పెట్టుకుని అన్నాడు. "వచ్చే సాల్లో కూడా నా పొలం నువ్వే చేసుకో అన్నా!"

"పోయిన సాల్లో ఉన్న డబ్బు మొత్తం ఊడ్చుకుపోయింది. వచ్చేఏడు పెట్టుబడికి పైసా ఇచ్చేదిక్కులేదు. మా వల్లకాదయ్యా, ఎవురికో ఇచ్చుకునిపో నీ పొలం" అంది రాజమ్మ. ఆమె మాటల్లో నిష్ఠూరం వుది.

"సరే, ఎవురన్నా అడిగితే ఇయ్యన్నా నువ్వే! నువ్వు వేసుకునే పనయితే వెనక చిక్కిఇచ్చినా పర్లేదు డబ్బు. ఎవురికన్నా అయితే ముకబదులు కట్టిచ్చుకుని ఇయ్యి. ఆ డబ్బు నాకు బేంకిలో పంపించు'' అన్నాడు రామయ్య.

"ఇయ్యేడు అందరికీ దండగలాయె! వచ్చేఏడు మగతాలు మాత్రం ఏముంటాయ్? రేట్లు బాగా తగ్గుతయిరా!"

"ఏవైనం వుత్తరం రాయన్నా, వస్తానేను'' అని చెప్పి రామయ్య బళ్ళారికి వెళ్ళిపోయాడు.

"పొలం లేదూ, పాడు లేదూ! మనం ఇవ్వం అని మీకక్కాయి అట్టచెప్పి తీసుకున్నాడు డబ్బులు'' రామయ్య వెళ్ళిన తరువాత అంది రాజమ్మ.

"నీయన్నీ అనుమానాల్లే! అందరూ మీ వాళ్ళ మాదిరిగా నోరు తెరిస్తే అబద్దాలు చెపతారనుకుంటేయట్ట?" అని తేలిగ్గా తీసి పారేశాడు అంజయ్య.

"నీకు ఇంక మావాళ్ళు చులకన! అందరూ నీ మాదిరిగానే సచ్చహరిచ్చంద్రుడిలా వుంటారనుకుంటే యట్ట? మీ తమ్ముడు కొన్నదీ, లేనిదీ నాలుగు రోజులు ఆగితే బండారం బయటపడదూ?" ఈసడింపుగా అంది రాజమ్మ.

రామయ్య నిజంగా పొలం కొనలేదు. తర్వాత తెలిసింది. అలా చెప్పకపోతే తప్ప అన్న డబ్బులు ఇవ్వడని అబద్ధం చెప్పి డబ్బు వసూలుచేసుకున్నాడు. ఆ విషయం రాజమ్మ సరిగానే గ్రహించింది.

★ ★ ★

ఎండాకాలం వచ్చింది.

అంజయ్య డబ్బులేక సరిపడేటంత వరిగడ్డి కొనలేదు. వడ్లు కొనుక్కోలేదు. ఎప్పటికప్పుడు రైసుమిల్లులో ఒక బస్తా బియ్యం తెచ్చుకుంటున్నారు.

వర్షాలు బొత్తిగా లేకపోవడంతో నీటి ఎద్దడి ఏర్పడింది. అంతకుముందు ఆ వూళ్ళో నీటిసమస్య ఎప్పుడూ వుండేది కాదు.

బావుల్లో నీళ్ళు పూర్తిగా ఎండిపోయాయి. కోడికూయకముందే నిద్రలేచిన వాళ్ళకి రెండు మూడు జోళ్ళు నీళ్ళు దొరుకుతున్నాయి.

ఊళ్ళో ఒకే ఒక్క బోరింగ్ బావి వుంటే అందులో మాత్రం నీళ్ళు వస్తున్నాయి కానీ, అక్కడ ఇసుకవేస్తే రాలనంత జనం!

బరిగొడ్లుకీ, ఎద్దులకీ ఊళ్ళోనించి నీళ్ళు దడి దగ్గరకి మోసుకొని పోవడంతోనే అంజయ్యకి కాలం కాస్తా గడచిపోతున్నది.

ఎండాకాలమాయె, గొడ్లు ఎండుమేత మేసి, ఎక్కువ నీళ్ళు తాగుతుండటంతో ఒక్కోరోజు రాజమ్మ కూడా పెద్ద బిందెతో నీళ్ళు మోస్తున్నది.

ప్రభుత్వం ఆ జిల్లాని కరువు ప్రాంతంగా గుర్తించింది. అంతే, ప్రభుత్వం బాధ్యత తీరిపోయింది.

కరువు ప్రాంతంగా ఆర్భాటంగా ప్రకటించిన ప్రభుత్వం అక్కడి ప్రజలకు మాత్రం ఎలాంటి సహాయచర్యలూ, కార్యక్రమాలూ చేపట్టలేదు.

న్యాయంగా ప్రజలకు బియ్యం, జొన్నలు, కొర్రలు, రాగులు లాంటి ఆహారధాన్యాల్నీ, నిత్యావసర వస్తువుల్నీ ఉచితంగానో పోనీ తక్కువ ధరకి అయినా పంపిణీ చేయాలి. అయితే ప్రభుత్వం అలాంటివేమీ చేయలేదు.

కూలీలకు కనీసం చేసుకోవడానికి మట్టి పనులు సైతం దొరకడం కష్టమైపోయింది.

భూమిలేని పేదలు తిండి లేకుండా అల్లాడిపోసాగారు. పనులు చేసుకోగలిగిన ఓపిక వున్నవాళ్ళు గుంటూరు జిల్లాలోని మాగాణి ప్రాంతాలకూ, నెల్లూరు జిల్లాకూ వలసలు పోయారు. దూర ప్రాంతాలకు పనులకోసం వెళ్ళలేని పిల్లల తల్లులూ, ముసలీ ముతకా పరిస్థితి దుర్భరం.

అప్పోసప్పో, లాభమో, నష్టమో రైతాంగానికి తిండిసమస్య అనేది లేదు. పేదల పరిస్థితే బాధాకరం.

★ ★ ★

జూన్ మాసం వచ్చింది.

తొలకరి జల్లులు బాగా పడుతున్నాయి.

చేతిలో సమృద్ధిగా డబ్బులేకపోయినా రైతాంగం అంతా జోరుగా పొలాలు బాగుచేసుకుంటున్నారు. ఎద్దులకీ, మనుషులకీ క్షణం తీరికలేకుండా పని!

నుయ్యిమట్టి తోలుకునే వాళ్ళూ, పొలాల్లో మొలిచిన చెట్లు కొట్టుకునే వాళ్ళూ, గుంటకలూ, గొర్లూ తోలుకునే వాళ్ళూ- గత ఏడాది నష్టాలతో మొహంలో కళే లేదు కానీ- పనిమాత్రం తీరికలేకుండా చేసుకుంటున్నారు.

"ఇయ్యేడు ఎంత యేద్దామే పత్తి?" అంజయ్య భార్య సలహా అడిగాడు.

"మనకి పెట్టుబడికావాలి గదయ్యా! నిరుడు సొసైటీలో తీసుకున్న అప్పే నిలబడిపొయ్యా! మనకి పెట్టుబడి ఎవురుఇస్తారు?"

"చేలో యిత్తులు నాటితే పైరుని చూసయినా ఎవుడోకడు పెట్టుబడి పెట్టడా? ఇయ్యేడు మాత్రం కాలం బెమ్మాండంగా వుండిద్దే!"

"నిజమేనయ్యా, ముందటేడు పండినట్టు ఈసాల్లో కూడా తెగపండిద్ది పత్తి. నిరుటి సాల్లో వానలు లేనందుకు అయ్యా, ఇయ్యా కలిసి ఈ సాల్లో తెగ కురుస్తయ్. వానలుంటయ్, పత్తి బాగపండిద్ది, మరి మనకి పెట్టుబడిదేనయ్యా బాధ" అంది రాజమ్మ.

"ఏందప్పా పొలం యవారం మాట్లాడుకుంటున్నారు. పొలం ఏమన్నా మగతాకి పడతారేంది?" అంటూ రామస్వామి వచ్చాడు.

"చేతిలో డబ్బు లేదబ్బాయ్! అది వుంటే నాలుగు ఎకరాలు తీసుకుంటే దండగేముంది?" అంది రాజమ్మ.

"ఇయ్యేడు మగతా ఎకరం 15 వందలే అంజియ్య మామా! మగతా తేలిపోయింది"

"అవి ఇవ్వడానికి కూడా ఎవురి దగ్గరున్నయ్యిరా? అందరికీ దండగలొచ్చి దెబ్బతింట్రి!"

"మా పొలానికి తోడు ఒక్క ఎకరమైనా కౌలుకి తీసుకుందామని మా ఆవిడ ఎగురుతోంది అంజియ్యమామా నాకైతే అంత

ఇష్టంలేదు. ఎందుకొచ్చిన బాధ? దండగపడితే ఇంక లేచే పని వుండదు!" అన్నాడు రామ స్వామి.

"అట్టంటేయట్రా? ఎప్పుడూ దండగలొ స్తంటే ఇంక రైతు బతికి బట్టకడతాడూ? ఒక ఏడు లాభాలొస్తంటయ్, ఒక ఏడు దండగలొ స్తంటయ్! లాటరీ సామెతే అనుకో!"

"లాభాలొస్తే తినేవాళ్ళమే కానీ, దండగలొ స్తే అడక్కతిని పోవాల్సిందే కద అంజియ్య మామా?"

"సరే కానీ, వొరే రామసామీ... మీ దగ్గర 10 వేలు ఏమన్నా దొరుకుతయ్యంట్రా? మీరు కోరినంత వడ్డీ ఇస్తాలే!"

"మా దగ్గిర ఎక్కడున్నయ్యి మామా?"

"ఇయ్యేడు పెట్టుబడికి, చేతిలో పైసాలే దురా. వడ్డీ ఇస్తాలేరా!"

"నాదేముంది అంజియ్యమామా! మా ఆవి డ్ని అడుగు, పెత్తనం దాని చేతిమీదగానే పోతందిగా!"

"సరే, నీ పెళ్ళాన్నే అడిగి చూస్తా, ఏమని ద్దో?" అన్నాడు అంజయ్య.

రామస్వామికి ఒక కాడ పొగాకు ఇచ్చి, అప్పటికప్పుడే అంజయ్య పనివున్నట్లు రామ స్వామి ఇంటికివెళ్ళి, అతని భార్యతో కుశలప్ర శ్నలూ, ఇతర లోకాభిరామాయణం కొద్దిసేపు మాట్లాడి, చివరకి డబ్బు అడిగాడు.

ఆమె లేవు, లేవంటూనే 4 వేలు ఇవ్వడానికి వప్పుకుంది. అయితే ప్రస్తుతం కాదనీ, నెలరో జులు ఆగిన తరువాత ఇస్తాననీ ఆమె చె ప్పింది.

బాపయ్య అంజయ్యగారింటికి మనిషిని పంపించాడు. అంజయ్య గడిచిన ఏడాది కౌలుకి చేసుకున్న పొలం మళ్ళీ ఈ ఏడాది కూడా ఇస్తాను తీసుకొమ్మని కబురు చేశాడు.

"ఏం చేద్దామే, తీసుకుందామా? పత్తిలో వచ్చిన నష్టం పత్తిలో పూడ్చుకోవాల్సిందే కానీ, ఇంకొక దారిలేదు'' అంజయ్య అన్నాడు రాజమ్మతో.

"తీసుకుంటే ఇయ్యేటికి మీ తమ్ముడి పొలం తీసుకుందామయ్యా! అంతే కానీ, తలకుమించిన బరువు నెత్తికెత్తికుని ఎక్కడ బాధలు పడదాం?"

"నిరుడు మనం తీసుకున్న పొలం అంతా కాదే! అందులో ఎకరం అయినా తీసుకుందా మని..."

"ఎకరమూ వద్దూ, సెంటూ వద్దూ! మూట లు మూటలు డబ్బు రాకపోయినా పర్లేదుకానీ, పెళ్ళి కావాల్సిన పిల్లని మనకి తోడు ఎందాకా పొలాలచుట్టూ తిప్పుదాం" అంది రాజమ్మ.

పొలం వద్దని వచ్చిన మనిషితోనే బాప య్యకి తెలియచేశారు.

వర్షాలు బాగా కురుస్తున్నాయి. ముందు ముందు కూడా మంచి వర్షాలు కురుస్తాయనే ఆశతో రైతులు పొలం మళ్ళీ కౌళ్ళకు తీసుకో వడం మొదలుపెట్టారు.

రామయ్య పొలం, తల్లికి ఇచ్చిన ఎకరం పొలం మళ్ళీ తామే చేసుకుంటున్నామని బళ్ళారిలోని తమ్ముడికి ఉత్తరం రాయించాడు అంజయ్య కూతురితో.

అంతకుముందు మూడేళ్ళక్రితం అనావృష్టి పరిస్థితులు ఏర్పడి రైతుకి ఎక్కువ ఆదాయం రాలేదు. తరువాత ఏడాది మంచి వర్షాలు కురిసి లాభాల పంట పండింది.

ఒక ఏడాది అనావృష్టి పరిస్థితులు అయితే తరువాత ఏడు విస్తృతంగా వర్షాలు కురిసి లాభాలు వస్తాయనే నమ్మకం రైతులకి ఏర్ప డింది.

ఈ ఏడాది కూడా వానలు బాగా కురుస్తా యని రైతాంగం బాగా పత్తి నాటారు.

రైతన్న ఆశించినట్లే వానలు కురుస్తు న్నాయి. వేసిన పత్తి విత్తనం వేసినట్లు మొలి చింది. పడివిత్తనాలు పట్టనేలేదు.

అంజయ్య నాటిన 13 ఎకరాలూ చక్కగా మొలిచాయి. 8 ఎకరాలు డిసిహెచ్ 32, 4 ఎకరాలు ఎంసియు 5, ఒక ఎకరం జెకెహెచ్ వై

వన్- ఈ మూడు రకాల విత్తనాలూ నాటాడు.

నాటిన విత్తనాలు మొలిచి అంజయ్య పత్తి తోటలు నవనవలాడిపోతున్నాయి.

పొలం బాగా వుండటంతో ఈ ఏడాది అయినా ఆదాయం బాగా వస్తుందని అంజయ్య, రాజమ్మ సంతోషంగా పొలం పని చేసుకుంటున్నారు.

పొలంలో పైరు బాగుంటే అంతకుమించిన ఆనందం రైతుకి ఏం వుంటుంది?

రామస్వామి భార్య 2 రూపాయల వడ్డీకి 4 వేలు అప్పు ఇచ్చింది. కూలీనాలీకి ఆ డబ్బే జాగ్రత్తగా వాడుతున్నారు.

పత్తి మొక్క మొలిచిన 15, 20 రోజుల నించే పురుగుమందు వేయడం ప్రారంభిస్తారు. రసం పీల్చేపురుగు ఆశించకుండా మొదట డైమిథియేట్ మందు వాడతారు.

ఆ మందు 2 లీటర్లు తీసుకువచ్చి పొలం మొత్తానికి వేద్దామని అంజయ్య ఆ మందు కోసం వెంకట్రామయ్య కొట్టుకి వెళ్ళాడు.

కొట్టుదగ్గర పది మంది రైతులు ఆయన కోసం ఎదురుచూస్తూ పడిగాపులు పడుతున్నారు. ఈ రైతులు మందులు అప్పుగా ఇవ్వమని అడగడంకోసం వచ్చినవాళ్లు.

కొద్దిసేపటికి ధగధగా మెరిసిపోతున్న బంగారు వన్నె ఇస్త్రీ చేసిన వస్త్రాలతో పంచె చెంగు ఒక చేత్తో, మరో చేత్తో సిగిరెట్ పట్టుకుని 'రాజు వెడలె' నన్నట్లు వెంకట్రామయ్య కొట్టుకి వేంచేశాడు.

"ఏరా యల్లయ్యా, పుల్లయ్యా, మల్లయ్యా, చెల్లయ్య, బుల్లయ్యా బాగున్నారా? పత్తి తోటలు యట్టున్నయ్యిరా?" అంటూ అందర్నీ పేరు పేరునా పలకరించి ఠీవీగా కుర్చీమీద ఆసీనుడయ్యాడు.

ఆ రైతులందరికీ వెంకట్రామయ్య అంటే మనసులో ద్వేషం వుంది. డబ్బు కోసం ఈయన ఎంతటి నీచానికీ, అకృత్యానికీ, మోసానికీ అయినా పాల్పడతాడని వాళ్ళందరికీ తెలుసు.

అయినా పైకి మహా వినయంగా చిరునవ్వులు చిందిస్తూ "పత్తితోటలకేం మామా, బెమ్మాండంగా వుండయ్యి. ముందటేడు పండినట్టు ఇయ్యేడు యిరగపండిద్ది పత్తి" అన్నాడు ఒకరైతు.

"నిజమేరా, నా పొలమూ బాగుంది పత్తి. ఇయ్యేడు పత్తికి రేటు కూడా బాగుండిద్ది. మీరు మందుల దగ్గర యామాలవద్దు. ఎంత బాగా మందులు వేసుకుంటే అంతబాగా దిగుబడి వచ్చి, డబ్బులొస్తయ్యి" అన్నాడు వెంకట్రామయ్య.

"నిజమే అన్నా!" అన్నాడు ఒకరైతు.

"ఇయ్యేడు కొట్లో కాతా పెట్టి మందులు అప్పు ఇయ్యి అన్నా!" అని ఒక్కోరైతు బతిమలాడుకునే ధోరణిలో అడుగుతున్నారు ఒక్కోరకంగా.

"లాభం లేదురా. మందులు మాకు కూడా పైన అప్పు ఇయ్యడంలేదు. ఇంక మేం మీకు ఎక్కడ తెచ్చిఇచ్చేది? అంతగా అయితే యెనకచిక్కి పంట చివర్లో చూడాల్సిందే!" అని వెంకట్రామయ్య తేల్చి చెపుతున్నాడు.

కొంతమంది రైతులు అప్పుపెట్టమని కాళ్ళా, వేళ్ళా పడినంత పని చేసినా ఆయన ససేమిరా కాదంటున్నాడు. కొంతమందికి మాత్రం చూద్దాం అంటున్నాడు.

"నాకు రెండులీటర్లు రోగోరు ఇయ్యన్నా! అప్పుగాదులే, వారంరోజుల్లో డబ్బులిస్తా!" అంజయ్య అడిగాడు.

"రెండుగాకపోతే నాలుగు లీటర్లు తీసకపోరా! నీకు అడ్డేముంది? సరేగానీ, కాతా ఎక్కడ పెట్టావురా?" అడిగాడు వెంకట్రామయ్య.

"ఇంకా ఎక్కడా కాతా పెట్టలేదన్నా!"

"మన కొట్లో కాతా పెట్టుకునే పనయితే పెట్టుకో. అయితే డబ్బుమాత్రం ముందే ఎకరానికి 15 వందలన్నా ఇయ్యాలిరా! ఎన్ని ఎకరాలు వేస్తే అన్ని 15 వందలు ఇస్తే అప్పుఇస్తాం, అదీ నీ మట్టుకే! చూశావుగా ఎంతమంది

అప్పు పెట్టమని అడుగుతున్నారో, వాళ్ళకి కాదని నీకు ఎందుకు ఇస్తన్నాం అప్పు, నువ్వు మనోడివనే గదరా''

"సరే, వస్తా అన్నా, మందోళ్ళు వచ్చేయేళయింది'' అని అంజయ్య మందు డబ్బాలు తీసుకుని, పరిగెత్తినట్లు ఇంటికి వచ్చాడు.

తొందరతొందరగా కాళ్ళు కడుక్కొని, పీట వేసుకుని కూర్చున్నాడు అంజయ్య. రాజమ్మ వడ్డించింది.

"యెంకట్రామయ్య మందులు అప్పు ఇస్తానన్నాడే!" అన్నం తింటూ ఒకింత సంతోషంతో చెప్పాడు అంజయ్య.

"ముందే కొంత డబ్బు కట్టమన్నాడమ్మాయి. రేప్పొద్దున చందలూరు పోదామనుకుంటున్నా. చెల్లెమ్మ శారదని అడిగి బంగారం తీసుకుని బ్యాంకులో పెడతా, ఆ బంగారానికి పది వేలన్నా లోను ఇస్తే కొట్లో కడితే ఇప్పటికి సరిపోయిద్ది'' అన్నాడు అంజయ్య.

"ఆ అమ్మాయిని అడగటం ఏం బాగుండిద్దయ్యా?"

"మరి ఎట్టచేద్దామే? చేతిలో కాణీ లేకపోయా!"

"శారదమ్మ మనా తనా అనుకునే మనిషే, కానీ వాళ్ళాయన బంగారం ఇయ్యడానికి ఒప్పుకుంటాడా అని?"

"అమ్మాయిదే కానీ బంగారం ఆయనదా ఏంది? రెండు మూడు నెలల్లో వాళ్ల బంగారం వాళ్ళకి ఎట్టాగూ ఇస్తామాయె!" అన్నాడు అంజయ్య.

పోలయ్య వచ్చాడు. అంజయ్య అన్నం తిన్నతరువాత మందు ట్యాంకులూ, పంపులూ తీసుకుని పొలం వెళ్ళిపోయారు.

రోజురోజుకీ పత్తితోటలు కళకళలాడిపోతున్నాయి. ఆ తోటలు చూస్తూ రైతులు ఆనందపడిపోతున్నారు. భవిష్యత్‌ని గూర్చి బంగారు కలలు కంటున్నారు.



★ ★ ★

రెండు రోజుల తరువాత అంజయ్య ప్రయాణమై చందలూరు వెళ్ళాడు.

అన్న వచ్చాడని శారద ఎంతో సంతోషించింది. ఆప్యాయంగా పలకరించింది. శారద భర్త కూడా బావమరిదిని కుశల ప్రశ్నలూ వేసి క్షేమసమాచారాలు తెలుసుకున్నాడు.

శారద భర్త పేరు హరిబాబు, ఆయనకి ఆరు ఎకరాలు పొలం వుంది. ఆ పొలం కౌలుకి ఇచ్చుకుని ధాన్యం కమీషన్ వ్యాపారం చేస్తుంటాడు. డబ్బు దగ్గిర మొండివాడు.

అంజయ్య వచ్చిన పని నెమ్మదిగా శారదతో చెప్పాడు, ఆ సమయంలో హరిబాబు ఇంట్లోలేడు.

"బంగారం ఇయ్యడానికి ఆయన అంత తేలిగ్గా ఒప్పుకోడన్నాయ్!"

"ఎట్టో కట్ట ఆయన్ని వప్పించమ్మాయ్. పత్తి తోటలు మోకాటి ఎత్తుకి వచ్చినయ్. పత్తి చేలోనించి వచ్చిన వెంటనే అమ్మి మీ బంగారం మీకు తెచ్చిస్తాను''



అంతలో హరిబాబు బజారునించి వచ్చాడు.

శారద వాళ్ళ అన్న వచ్చిన పని విషయం భర్తతో చెప్పింది.

"మాకు కూడా ఇప్పుడు డబ్బు అవసరం బావా! నేనే బంగారం బ్యాంకులో పెట్టుకుని డబ్బు తెచ్చుకుందామనుకుంటున్నాను'' అన్నాడు అతను.

"మనకేం అవసరం అండీ డబ్బుతో?" శారద భర్తని అడిగింది.

"నీకు తెలియదు, నువ్వూరుకో' భార్యని కసురుకుని అంజయ్యతో అన్నాడు అతను.

"నేను చిలకలూరిపేటలో బియ్యం కొట్టు పెడదామనుకుంటున్నా బావా! నిరుడే పెట్టాలనుకుంటే చేతిలో సమయానికి డబ్బులేక ఆగిపోయా! మొన్నపోయి బియ్యం కొట్టుకి ఇల్లు కూడా చూసొచ్చా!" హరిబాబు చెప్పాడు.

అంజయ్యకి శారద మీద నమ్మకం వున్నా హరిబాబుదే కొద్దిగా అనుమానం. అతనిది పిసినారి తత్వం అయినా తను నోరు తెరిచి అడిగితే అంత తేలిగ్గా కాదనడు అనే ధీమాతోనే అంజయ్య చెల్లెలి వూరు వెళ్ళాడు.

సాయంత్రం వరకూ వుండి అంజయ్య తిరిగి బయల్దేరి పమిడిపాడు వచ్చాడు. చెల్లెలి వాళ్లని ఎందుకు అడిగానా అని మనసులో మధనపడిపోయాడు. మళ్లీ వేరే దారిలేకనే కదా అని తనకి తనే సమాధానపరుచుకున్నాడు.

ఉసూరుమంటూ వచ్చిన అంజయ్య వాలకం చూసి రాజమ్మ పోయిన పని కాలేదని గ్రహించింది.

సాయంకాలం అన్నం తిని దడి దగ్గరకి వెళ్లడానికి లాంతరు వెలిగించుకుంటున్న అంజయ్యని అన్నపూర్ణ అడిగింది.

"అత్త ఏమంది బాబా?"

"అత్తదేముందమ్మాయి? ఆ అమ్మాయి

ఇద్దామన్నా వాళ్లాయన వప్పుకోలా! పేటలో బియ్యం కొట్టు పెడతాడంట! వాళ్లే బేంకిలో పెట్టుకుని డబ్బు తెచ్చుకుంటామన్నారు''

"అయినోళ్లు ఆకుల్లో పెడితే కానోళ్లు కంచాల్లో పెడతారంట! ఆ అబ్బాయి ఇస్తాడని నాకైతే నమ్మకం లేదు. పెళ్లప్పుడు మనం ఇస్తామన్న ఉంగరం పది రోజులు ఆలిస్యమయితే అంత రభస చేశాడే! ఆయనేనా మనకి అవసరానికి ఇచ్చేది?" అంది రాజమ్మ.

★ ★ ★

అంజయ్య వేసిన 13 ఎకరాల పత్తిలో 4 ఎకరాలు బేరం ఫెట్టాడు. 4 ఎకరాలు పత్తితోటలు అమ్మి ఆ వచ్చే డబ్బుతో మిగతా 9 ఎకరాలకీ పెట్టుబడి పెట్టవచ్చని అనుకున్నారు. పైగా పొలం తగ్గుతుంది. పెట్టుబడి కూడా తగ్గుతుందని భావించారు.

ఇంతలో శారద వాళ్లవూరునించి వచ్చింది.

"బంగారం తెచ్చాను అన్నాయ్, బేంకిలో పెట్టుకుని డబ్బు తెచ్చుకో"

"ఎందుకమ్మాయి, పత్తి తోటలు బేరంపెట్టాం" మొహమాటంగా అన్నాడు అంజయ్య.

"నోటి దగ్గరకి వచ్చిన పంటని ఎందుకులే అన్నాయ్ అమ్ముకునేది? మూడు నెల్లు ఓపిక పడితే సరిపోయేదానికి'' అని శారద మెడలో గొలుసు, మంగళసూత్రం, చెవికమ్మలు, చేతిగాజులు వూడతీసి ఇచ్చింది.

"మీ ఆయన ఏమన్నా అంటాడేమొకదమ్మాయి?"

"ఈ మూడు రోజులూ ఆయనని అడిగి ఒప్పించా! ఆయన ఇయ్యమంటేనే ఇస్తున్నా! మూడు నాలుగు నెలల్లో మా బంగారం మాకు తీసకొచ్చి ఇయ్యండి'' అంది ఆమె.

"అంత తేలిగ్గా ఒప్పుకునేవాడుకాదే మీ ఆయన. ఎట్ట ఒప్పించావోకానీ'' నవ్వుతూ అంది రాజమ్మ.

"పేటలో బియ్యం కొట్టుపెట్టాలనుకున్నాడు వదినా. బేమ్మడ్ని అడిగితే ఇప్పుడల్లా మంచి దిలేదు, సంక్రాంతి పండగ యెల్తేకానీ మంచి రోజు రాదన్నాడంట. అందుకని ఆగాడు. మీరు మాత్రం మొదటివరస పత్తి అమ్మి ఇయ్యండి మా బంగారం. సంక్రాంతి పండగనాటికి తెచ్చి ఇస్తారంటేనే ఆయన మెత్తబడ్డాడు. లేకపోతే ససేమిరా వప్పుకునేవాడుకాదు'' అంది శారద.

"మొదటి వరస పత్తి అమ్మటమే ఆలిస్యం, ముందు మీ బంగారం తీసకొచ్చి ఇస్తామమ్మాయి'' అన్నాడు అంజయ్య.

శారద రెండు రోజులు ఇక్కడ వుండి వెళ్లిపోయింది. ఆ రెండు రోజులూ రాజమ్మ రెండు మూడు రకాల పిండివంటలు ఆడబిడ్డ కోసం చేసింది.



వర్షాలు జోరుగా కురుస్తున్నాయి.

అంజయ్య ఇరవై బస్తాలు 28-28-0 ఎరువుల మందు కొట్లో తీసుకుపోయి ఎకరానికి బస్తాన్నర లెక్కన ఏదపెట్టాడు.

మందు ఏద అయిపోయిన వెంటనే అంజయ్య కోసమే అన్నట్లు మంచి వర్షం కురిసి మందు అంతా చేనుకి పట్టింది.

ఇద్దరు కూలీల్ని పెట్టుకుని, విరామం లేకుండా పురుగు మందులువేస్తున్నారు.

మళ్లీ రెండోవరస కూడా ఎరువుల మందు ఏదపెట్టారు.

అక్టోబర్ నెల.

పత్తి రైతుల్లో ఒక్కసారిగా హాహాకారాలు, గందరగోళం!

పురుగు, పురుగు, పురుగు!!

పత్తి తోటలనిండా పురుగే పురుగు.

మందులకొట్లు మీద పురుగు మందుకోసం రైతులు ఎగబడుతున్నారు. వాళ్లు ఇచ్చిన మందు, చెప్పిన ధరకు తీసుకుపోతున్నారు.

"నేను పుట్టి బుద్దెరిగిన తరువాత ఇంత పురుగుని చూసి ఎరగను అనుకో! ఇదేం పురుగంట? మందుయేసిన రోజు పురుగు పోతండే, మూడోనాటికల్లా ఎప్పటి మాదిరిగానే వస్తాండే! మా యావిడ నీల్లు తీసకొచ్చి పోయటం, నేను మందు యేయటం! ఓరినా యనో, ఇది మనం తట్టుకునే పురుగుకాదు సామో!" అంటూ వచ్చాడు రామస్వామి.

"తోటలు బాగా యేపు మీదుండయ్‌రా రామసామీ. అందుకే పురుగు అలివి కావ టంలేదు. ఈ వరసకి కానీ పురుగు కంట్రోలు చేసుకున్నామా, ఇంక పత్తి తోటలకి ఢోకా వుండదనుకో!"

"మందు యేసిన రోజు పురుగు చచ్చినట్టే చస్తాండే, మళ్లీ తెల్లారేసరికి చెట్టునిండా, మొగ్గ నిండా, పూతనిండా ఎక్కడ చూసినా పురుగేనా యె! మందులు గూడా సరిగా పనిచేసి చావ టంలేదులే మామా!"

"కొత్తగా వచ్చినాయే సైపర్‌మైత్రీను అనే మందు, అది యేసారా మొన్న నేను. నా కళ్లముందే పురుగు తెగ సచ్చింది. మళ్లీ మూడోనాటికే ఎప్పటిమాదిరిగా వుందిరా పురుగు'' అన్నాడు అంజయ్యా.

అలివికాని పురుగు ధాటికి రైతాంగం అంతా గగ్గోలెత్తిపోతున్నారు.

అక్టోబర్, నవంబర్ ఈ రెండు నెలలలోనే ఎకరా పత్తిపొలానికి 15 వందల రూపాయల మందు వాడారు. అంజయ్యా ఈ రెండు నెలలలోనే ఇరవై వేల రూపాయల మందులు వాడాడు తన 13 ఎకరాలకీ.

కాయేలేదుకానీ, పత్తితోటలు చూడటానికి బాగా వున్నాయి. ఒక్కో చెట్టు మనిషి చేయి ఎత్తు పెరిగింది. పెరిగిన అంత చెట్టునిండా పూతా, మొగ్గతో ఆ బరువుకి చెట్టు విరిగిపడే టంత కాపు వచ్చింది. వచ్చిన ఆ కాపుని కాపాడుకుందామని, అంతకంటే ఎక్కువగా వచ్చిన పురుగుతో రైతాంగం పోరాడుతున్నా రు.

పురుగు దారిన పురుగు యథేచ్ఛగా పత్తితో టల్ని మేస్తుండగా, కంటిలో నలుసంత జీవం ఒకటి ఆకుల అడుగ భాగాన ప్రత్యక్షమ యింది.

మొదటి రోజున ఒకటిగా వున్న ఆ జీవం రెండో రోజుకి పది అయింది. మూడో రోజుకి వంద అయింది. నాలుగో రోజుకి వెయ్యి అయింది. అయిదో రోజు పత్తి తోటలనిండా అదే!

దానినే రైతులు తెల్లదోమ అన్నారు.

ఆ తెల్లదోమ వలన పత్తికి దోమపోటు రాకుండా డిడిటీ కేజీలు కేజీలూ, బస్తాలు బస్తాలూ తీసుకొచ్చి పొలం మీద చల్లుతున్నా రు.

నిజానికి అది దోమకాదు. దానిని ఏమ నాలో, దానికి ఏం పేరు పెట్టాలో తోచక రైతులు దానికి దోమ అని నామకరణం చేశా రు. ఆకారంలోకానీ, రంగులోకానీ దోమకీ, ఈ జీవానికీ ఏం సంబంధంలేదు.

ఆ తెల్లదోమ చావకపోగా, ఊరిమీద కూడా వచ్చిపడింది. పెద్దగాలి దుమారం వచ్చినట్లు దుమ్ము మాదిరిగా గాలిలో ఎగురుతూ తెల్ల దోమ ఊరుకూడా ఆక్రమించింది.

అంతకుముందు ఎప్పుడూ తెల్లదోమ రాలే దు. ఆ దోమవలన పెద్ద నష్టం వస్తుందని కూడా అప్పుడు ఏ రైతూ ఊహించలేదు.

పురుగు మందులు మాత్రం పట్టువదలని విక్రమార్కుల్లా విజృంభించి వేస్తూనే వున్నా రు.

మందుకోసం వెంకట్రామయ్య కొట్టుకి వెళ్లా డు అంజయ్యా.

"ఏరా అంజియ్యా.... నువ్విచ్చిన డబ్బు సత్తవమందుకే సరిపోయిందిరా! పురుగు మందులే ఇరవై వేలు దాటినయ్ నీ పద్దులో. మందుల కంపినోళ్లు పైన మమ్మల్ని దబాయిస్తన్నార్రా! ఎక్కడైనా చూసి, ఇంకా పదివేలు ఇచ్చావంటే ఇయ్యేటికి నిన్నింక అడగం అనుకో! మేము అడిగామని గాకుండా నువ్వు కూడా అర్థం చేసుకోరా, ఎంతమందికనీ, ఎన్ని వేలకనీ, అప్పు ఇస్తాం మేము చెప్పు? డబ్బు మాత్రం పదివేలు చూడాల్రా!" చెప్పాడు వెంకట్రామయ్య.

"సరే, ఎక్కడైనా చూసి ఇస్తాలే అన్నా!"

"ఇస్తానంటే కాదు, నువ్వు రేపు మందుకొచ్చేటప్పుడు డబ్బు తీసకొస్తేనే...."

"సరే, చూస్తాగా!" అంటూ అంజయ్య ఆ రోజు తనకి కావాల్సిన మందులు తీసుకుని బిల్లు రాయించుకుని వెళ్లాడు.

"వెంకట్రామయ్య డబ్బులు అడిగాడే! రేపు డబ్బు తీసకొస్తేనే మందు ఇస్తానన్నాడు'' భార్యతో చెప్పాడు అంజయ్య.

"ఇప్పుడు డబ్బు ఎక్కడ పుట్టిద్దయ్యా మనకి? అప్పు ఇస్తానని వప్పుకున్న తరువాత మజ్జెలో ముంచుతాడేంది?"

"వాడు ముంచినా, ముంచకపోయినా మనకి ఇప్పుడు పని జరగాలిగా! మీ అన్న దగ్గరకి పోయొస్తే..."

"ఆయన ఇచ్చేవాడు కాదయ్యా! ఆయన మీద ఆశపెట్టుకోటం అనవసరం! ఊళ్లోనే ఎక్కడైనా తంటాలు పడటం మంచిది!" అంది రాజమ్మ.

"ఊళ్లో అప్పు ఇచ్చేవాళ్లు ఎవురున్నారే?" అని అంజయ్యచేలోకి వెళ్లిపోయాడు.

అంజయ్యకి ఏం చేయాలో అర్థం గాకుండా వుంది. తెల్సిన ప్రతి చోటా, ఇస్తారనుకున్న వాళ్లందరి దగ్గిరా అప్పు తీసుకొచ్చాడు. ఇక ఎవర్ని అడగాలో తోచడం లేదు.



పత్తి తోటల విషయం కూడా అంతు పట్టడంలేదు. తోటలు నవనవలాడిపోతూ, పూతా, మొగ్గతో చెట్టు నిండిపోయి, విపరీతమైన కాపుతో చూస్తుంటేనే కడుపు నిండిపోయేలా వుంది. అయితే మొగ్గ తొందరగా కాయకావడంలేదు. ఒక వైపు ఆశ, మరో వైపు ఎక్కడో నిరాశ.

అంజయ్య తెచ్చిన మందులు రెండు రోజులకే సరిపోయాయి.

చేలో పురుగు ఎప్పటి మాదిరిగానే వృధ్ధతంగా వుంది.

రైతాంగం దిక్కుతోచని పరిస్థితిలో పడిపోయింది. వేసిన మందు వేసినట్లే నిష్ప్రయోజనమైపోతోంది.

మూడో రోజు అంజయ్య మళ్లీ కొట్టుకి వెళ్లాడు.

"ఏరా అంజియ్యా, నేను చెప్పిన యవారం ఏం చేశావు?" బయట వాకిలి పక్కనే బెంచివేసుకుని కూర్చుని వెంకట్రామయ్య అడిగాడు.

"మా బామ్మర్ది దగ్గరకి వెళ్లాలన్నా! ఎక్కడ... రోజూ చేలో మందు యేసుకోవటంతోనే సరిపోతంది''

"మందు యేసుకోవాలంటే, డబ్బులేంది నీకు మందు ఎక్కడినించి వచ్చిద్దిరా?"

"ఇయ్యాలా, రేపట్లో యెల్తానన్నా! ఈ వరసకి ఎకలక్స్ ఒక గేలనూ, నువాక్రాను ఒక గేలనూ ఇయ్యి అన్నా!"

"కొట్లో అసలు మందులు లేవురా!" అన్నాడు వెంకట్రామయ్య, చెక్కబీరువాలో ఎదురుగా మందులు కళ్లకు కనపడుతూవుంటే.

కొద్దిసేపు కూర్చుని అంజయ్య మళ్లీ బతిమాలాడినట్లు అడిగాడు.

"చేలో పురుగు చితచితలాడిపోతందన్నా! డబ్బులు రెండు రోజుల్లో సర్దుతాగానీ, ఈ వరసకి మందు ఇయ్యి అన్నా!"

"మందుల్లేవురా! ఆ మందులు మా పొలానికి అట్టిపెట్టుకున్నయ్యి. ఇప్పుడు మాకు మందు వేసే కూలోళ్లు వచ్చి తీసకపోతారు''

"అన్ని మందులు యేస్తారంటన్నా, ఎంత ఒకాళ అయినా'' నిష్టూరంగా అన్నాడు అంజయ్య.

"మంచోడివేరా! ఆ మందు అయిపోతే రేపు మేము ఇబ్బంది పడమూ! మేము ఎక్కడ తంటాలు పడతాం?" విసుక్కుంటూ అన్నాడు ఆయన.

ఇంతలో రాంబాబు అనే అబ్బాయి వచ్చి అడిగాడు. వాళ్లు బాగా డబ్బున్నవాళ్లు

"ఒక గేలన్ నువాక్రాను, ఒక గేలన్ ఎకలక్స ఇయ్యి బాబా!"

వెంకట్రామయ్య లేచి ఆ రెండు మందులూ ఇచ్చాడు. అతను అవి తీసుకుని వెళ్లిపోయాడు.

"వాళ్లు నిన్ననే అట్టిపెట్టమని చెప్పార్రా! వాళ్ల కోసం వుంచిన మందులు అవి''

అంజయ్య మాట్లాడకుండా లేచి వచ్చాడు.

మనసంతా దిగులుగా, ఆందోళనగా వుంది.

"ఇవ్వాళ కానీ మందు వేయకపోతే చేలో ఉన్న సన్న, చిన్న పురుగు రేపటికి పెద్దదవుతుంది. ఇక ఆ పెద్ద పురుగు ఎంత మందువేసిన చావదు. ఇప్పటికే ఉన్న పురుగుతో అల్లాడిపోవాల్సి వస్తోంది'' అని అంజయ్య మనసు విలవిల్లాడి పోతోంది.

నీరసంగా అంజయ్య రావడాన్ని చూసి "మందేదయ్యా?" అని రాజమ్మ వాకిట్లోనే అడిగింది.

జరిగిన విషయం చెప్పాడు అంజయ్య.

"డబ్బు ఇస్తే మందు ఇచ్చేవాడేనే! నాకు మందులు లేవన్నాడు. సుబ్బారావు కొడుకు రాంబాబు వస్తే నా ముందే వాడికి మందు ఇచ్చి పంపేడు. ఇప్పటికే చేలో పురుగు చితచితలాడతంది. ఇయ్యాల చేలో మందు దిట్టంగా పోద్దాం పురుగు కంట్రోలు అయిద్ది అనుకున్నా!" అన్నాడు అంజయ్య.

"ఎట్టచేద్దామయ్యా మరి?"

"కోంటి సత్తెం ఏమన్నా ఇస్తాడేమొ అడిగొస్తా! వాడిది మనం తట్టుకునే వడ్డీ కూడా కాదు. అవసరమాయె!" అని అంజయ్య సత్యం గారింటికి వెళ్లాడు.

మొదట సత్యం నెత్తిమీద బట్టల మూట పెట్టుకుని ఆ వూరు వచ్చాడు. అంతే మకాం ఇక్కడికి మార్చేసి ఇక వెనక్కి తిరిగి చూడకుండా అపారంగా డబ్బు సంపాదించాడు.

రైతులు ఎవరికైనా అవసరంపడి డబ్బు కోసం వెళ్తే దాదాపుగా లేదనడు. అయితే వడ్డీ మాత్రం ఐదు రూపాయలనించీ పది రూపాయలవరకూ గుంజుతాడు.

అంజయ్య వెళ్లేసరికి ఆయన బట్టల కొట్లో కూర్చుని వున్నాడు. అంజయ్య ఆయనని డబ్బు అడిగాడు.

"డబ్బు ఇప్పుడు లేదుకదా అంజయ్యా! మాకు రావాల్సిన పద్దులు కూడా ఇప్పుడు రావాయె! రైతుల దగ్గరనించి వసూళ్లయితేనే కదా మళ్లీ వాళ్లకి మేము ఇచ్చేది. ఇప్పుడు రైతులేమొ డబ్బంతా పొలం మీద పెడితిరి''

"అట్టనమాకు సత్తెం. ఇప్పుడు పత్తితోటలు మంచి పట్టుమీద ఉన్నాయి. ఈ వరసకానీ పురుగునించి తప్పించుకుంటే ఇంక బయం లేదు. నీ బాకీ తొందరలోనే తీరుస్తాగా!"

అంజయ్య నమ్మకస్తుడు. మంచి మనిషి. మెతకబుద్ధి. ఎగవేసేవాడు కాదు. పేచీపెట్టి అరకొర ఇచ్చేవాడూ కాదు. అప్పు అంటేబాగా భయపడేవాడే! డబ్బు ఇవ్వవచ్చు అనుకున్నాడు సత్యం.

"సరే, నువ్వు అంతగట్టిగా అడుగుతున్నావు కాబట్టి మజ్జెన్నంరా చూద్దాం! అయితే, వడ్డీ ఎంత ఇస్తావ్ చెప్పు?"

"ఎంత వడ్డీ కావాలేంది?"

"మామూలుగా అందరికీ పది రూపాయల వడ్డీకి ఇస్తన్నా అంజియ్యా! నీకు ఎంత కావాల?"

"ఐదు వేలుచూడు సత్తెం, వడ్డీ ఆర్రూపాయలు కట్టుకుందాం"

"ఆర్రూపాయల వడ్డీనా! ఎర్రిమాలోకమా,

ఎక్కడో ఎనకటి రోజుల్లో వుంటే ఎట్ట? నీ ఒక్కడికే కాదు అంజియ్యా... నిన్నా, ఇయ్యాలా ఐదారుగురు తీసకపోయారు. అందరికీ అదే వడ్డీ! నీ దగ్గర ఎక్కువ తీసుకుంటానా? అసలుమీకు ఇచ్చే డబ్బు నాదనుకునేవు! నా దగ్గర అంత డబ్బు ఎక్కడవుండి సచ్చింది? మా బామ్మర్ది డబ్బు తీసకొచ్చి, నా దగ్గిర పెట్టి వడ్డీలకి తిప్పమని అడిగితే, వాడి సొమ్ము నేను మారుస్తున్నా!"

"ఎనిమిది రూపాయల వడ్డీ కట్టుకోవే సత్తెం!"

"అదేం కుదరదు. పది రూపాయలకి తక్కువ వడ్డీ అయితే నా దగ్గిర దొరకవు, ఎందుకొచ్చిన మాటలు? అందరికీ నెల రోజులకి వడ్డీ తగ్గించుకుని ఇస్తన్నా, నీకు అయితే వడ్డీ తగ్గిచ్చుకోకుండా ఇస్తా, ఎంత ఆదాయమో చూడు, నీకు అంతకంటే ఇంక కావాల్సిందేం వుంది?"

"సరే అట్నే కానీయ్, ఎందుకొచ్చినగోల!"

"మజ్జెన్నంరా అయితే, డబ్బు చూసిపెడతా!" అన్నాడు సత్యం.

"పొలం పోతన్న సత్తెం. సందకాడ వస్తాలే' అని అంజయ్య చేలోకి వెళ్లిపోయాడు.

ఆ రోజు సాయంత్రం సత్యం మూడు వేల రూపాయల డబ్బు అంజయ్యకి ఇచ్చాడు.

ఐదు వేలు చూడమంటినే సత్తెం"

"దొరకలేదు అంజియ్యా'' అని సత్యం మూడు వేలు ఇచ్చి ఆరువేలు ఇచ్చినట్లు ప్రామిసరీనోటు రాయించుకున్నాడు. వడ్డీ రూపాయిన్నర అని ప్రామిసరీ నోట్ మీద రాసారు.

గ్రామాల్లో వడ్డీ వ్యాపాస్తులకి ఇదొక పద్ధతి. అప్పు తీసుకున్న వాళ్ల దగ్గర అసలుకి రెట్టింపు వేసి ప్రామిసరీనోట్లు రాయించుకుంటారు. ఒక వేళ కోర్టుకి వెళ్లినా, ఎక్కువ మొత్తానికి ప్రామిసరీనోట్ వుంటుంది కాబట్టి వడ్డీ వ్యాపారులకి లాభమేకానీ నష్టం వుండదు.

అంజయ్య ఆ డబ్బు మొత్తం తీసుకుపోయి మరుసటిరోజు వుదయం వెంకట్రామయ్య కొట్లో జమ ఇచ్చాడు.

"నీక్కావలసిన మందులు తీసకపోరా అంజియ్యా! రేత్రేరా మందు పెట్టెలు వచ్చింది. నిన్న మందులు లేవు. రాంబాబు వాళ్ల అయ్య రెండు రోజులనాడే చెబితే వాడి కోసం వుంచిన గేలన్లు అవి. మిగతావేమో మా పొలానికి వుంచుకున్నయ్యి'' వెంకట్రామయ్య సంజాయిషీ మాదిరిగా అంజయ్యకి చెప్పాడు.

"సరేలే అన్నా, ఇప్పుడు అవసరం మాది. తప్పేదేముంది?" అని అంజయ్య తనకి అవసరమైన మందులు తీసుకున్నాడు. దాదాపు నాలుగు వేల రూపాయలకి సరిపడా మందులు తీసుకున్నాడు తనే బీరువాలో నించి.

"ఉన్న మందులు మొత్తం నువ్వే తీసకపోతే యట్రా? యెనకవాళ్లకి కావద్దా?"

"కానీయన్నా... పురుగో, మేమో అటో, ఇటో తేలిపోవాల ఈ దెబ్బతో! అడ్డం పెట్టవాకు'' అన్నాడు అంజయ్య.

"సరే, కానీయ్. డబ్బు మాత్రం మళ్లీ ఇంకా ఐదారువేలు చూడాల్రా, లేకపోతే లాభంలేదు. ఇప్పుడు మూడు వేలు జమ ఇస్తివి, నాలుగువేలకి తీసకపోతంటివి!" పద్దు రాసుకుంటూ అన్నాడు వెంకట్రామయ్య.

★ ★ ★

పురుగుమీద అవిశ్రాంత యుద్ధం ప్రకటించిన రైతాంగం, తెల్లారీ తెల్లారక ముందే చేలోకి వెళ్లి, ఆకుల మీద మంచు ఆరిన వెంటనే మందు వేస్తున్నారు.

సహజంగా పది లీటర్ల నీటికి 15, 20 మిల్లీలీటర్ల మందు కలపాలి. అయితే రైతులు డబ్బైనించీ వంద మిల్లీలీటర్ల మందు కలుపుతున్నారు.

కంపెనీల వాళ్లు సిఫారసుచేసిన మోతాదు కంటే అనేక రెట్లు ఎక్కువ మందు వేస్తున్నా పురుగు మాత్రం చావటంలేదు.

మందు ఒక్కదానికే ఉపయోగం లేదని

ఒకవైపు మందువేస్తూ, మరోవైపు కూలీల్ని పెట్టి చేలో పురుగు ఏరిస్తున్నారు. కొంతమంది కూలికి ఏరిస్తుంటే, కొంతమంది కంట్రాక్ట్‌గా ఏరిస్తున్నారు.

కంట్రాక్ట్‌గా అయితే ఒక్క పురుగుకి పైసా.

కంట్రాక్ట్ కూలీలు ఒక్కొక్కరు మూడు వేలనించీ ఐదు వేల వరకూ పురుగు ఏరుతున్నారు.

రాజమ్మా, అన్నపూర్ణా కూడా పురుగు ఏరుతున్నారు.

అన్నపూర్ణకి అయితే మొదట్లో శరీరం గగుర్పొడిచింది. పురుగుని పట్టుకున్న వెంటనే అది ఏరగటమో, కక్కటమో చేస్తుంది. చేతిలో ఒక్కోసారి పురుగు నలిగి చచ్చిపోయి అంతా పసరు అవుతుంది. చండాలపు వాసన.

ఇద్దరు ఎంత పురుగని ఏరతారు? వీళ్లవలన కాదని అంజయ్యా పదిమంది కూలీల్ని తీసుకుపోయాడు.

మొదటిరోజు వాళ్లు ఎనిమిది రూపాయల కూలీకి వచ్చారు. మనిషికి గుప్పెడు పురుగులు ఏరలేదు.

పురుగు ఏరుతున్న కూలీలకు డిమాండ్ పెరగడంతో రెండో రోజు పది రూపాయల కూలి అడిగారు.

"కూలికి అయితే లాభం లేదయ్యా! మనిషికి పిడికెడు పురుగులు ఏరలేదు. అవి వంద వుంటయ్యో రెండు వందలు వుంటయ్యో! కంట్రాక్ట్‌గానే పురుగులు ఏరమను'' అంది రాజమ్మ.

రెండో రోజు కంట్రాక్ట్‌గా పురుగులు ఏరిస్తే మనిషికి సగటున నలభై రూపాయలకు పురుగు ఏరారు.

కంట్రాక్ట్‌గా రెండు రోజులు ఏరించారు. ఆ రెండు రోజులకే ఎనిమిదివందల రూపాయలు కంట్రాక్ట్ కూలి ఇవ్వాల్సి వచ్చారు.

రాజమ్మ బిత్తరపోయింది. పురుగు ఏరినందుకు రెండు రోజులకి ఎనిమిదివందలంటే సామాన్యమా? రాజమ్మ తట్టుకోలేని విషయం అది.

ఎనిమిది వందల రూపాయలకి ఎనభై వేల పురుగు! రాజమ్మా, అన్నపూర్ణా లెక్క లేకుండా ఇరవై వేల పురుగు ఏరి వుంటారు. అంటే ఈ మూడు రోజుల్లో అంజయ్య పొలంలో లక్ష పురుగుని పట్టుకున్నారన్న మాట! ఏరిన ఆ పురుగుని గొయ్యి తీసి పాతిపెట్టారు.

అయినా పొలంలో ఎప్పటి మాదిరిగానే పురుగు! మందు వేస్తూనే వున్నారు.

కూలీలకు మస్తుగా పని! వాళ్లకి సరదాగా కూడా వుంది. ఫలానా వెంకమ్మ డబ్భై రూపాయలకి పురుగు ఏరిందంటే, ఫలానా అంకమ్మ అరవై రూపాయలకి పురుగు ఏరిందని వాళ్లు గొప్పగా చెప్పుకుంటున్నారు.

పురుగు ఏరిన కూలీలు డబ్బు కోసం అంజయ్య ఇంటికి వచ్చారు. వాళ్లని రెండు రోజులు ఆగి రమ్మన్నాడు అంజయ్య. కొట్లో తెచ్చిన మందు కూడా అయిపోయింది. ఇంట్లో రూపాయిలేదు.

"నువ్వు మీ అన్నగారింటికి వెళ్లి రావాల్సిందేనే! కూలోళ్లు డబ్బుకోసం తిరిగి పోతన్నారు. మందు అయిపోయింది. ఈసారి మందు అప్పు కూడా ఇవ్వడు. మొన్న మూడు వేలు రొక్కం ఇచ్చి, నాలుగు వేలకి మందు తెస్తిని'' అంజయ్య భార్యతో అన్నాడు.

"మా అన్న డబ్బులు అంత తేలిగ్గా ఇచ్చేవాడు కాదయ్యా! నేనుగా పోయి అడగలేను. నాకు ఆయన దగ్గర చనువు కూడాలేదు. నువ్వుపోయి అడుగు''

"నేను ఎట్టపోతానే? నేను పోయి ఏమని అడుగుతాను? ఇంక రెండునెల్లు ఓపిక పట్టామంటే ఆయన డబ్బులు ఆయనకి ముద్దరసుద్దిగా ఇద్దాము''

"ఏమో, నా ఒక్కదాని వల్ల కాదయ్యా! సరే, మనకి గట్టి అవసరం కాబట్టి నువ్వు కూడారా, ఇద్దరం పోయొద్దాం" అంది రాజమ్మ.

ఆయన రాజుపాలెం అనేవూళ్లో వుంటున్నాడు. ఆ వూరు ఇక్కడకి మూప్పై మైళ్ల దూరంలో వుంది. అక్కడ ఆయన ఎలిమెంటరీ స్కూల్లో టీచర్‌గా పని చేస్తున్నాడు. ఉపాధ్యాయ వృత్తేగాకుండా ఆయన ఆ పల్లెటూరిలో వైద్యం కూడా చేస్తుంటాడు. ఆయన డబ్బు బాగానే కూడబెట్టాడు. అయితే డబ్బు దగ్గర మాత్రం మహా మొండిఘటం.

మరుసటి రోజు ఎద్దుల దగ్గిర కూలి మనిషిని పెట్టి, రాజమ్మా, అంజయ్యా ప్రయాణమై ఆ వూరు వెళ్లారు.

వీళ్లు అక్కడ రెండు రోజులు తిష్టవేశారు. అంజయ్యా, రాజమ్మా ఇద్దరూ మార్చిమార్చి ఆత్మాభిమానాన్ని చంపుకుని ఆయనని బతిమిలాడారు.

"అంత్యనిష్ఠూరం కంటే ఆది నిష్ఠూరం మేలు! తరువాత బంధుత్వాలు చెడిపోతాయి. మీరు డబ్బులు ఇవ్వొచ్చు, ఇవ్వలేకపోవచ్చు! మీ వూళ్లోనే ఎక్కడో చోట తంటాలు పడండి'' అన్నాడు ఆయన.

"కాదు అన్నా... మావూళ్లో దొరక్కనేగా ఇంతదూరం వచ్చింది. ఇంక రెండు నెలల్లో నీకు అసలూ, వడ్డీ ఇస్తాం అన్నా! నోటి దగ్గిరకి వచ్చిన పంట పాడైపోయిద్ది''

"పెట్టుబడికి డబ్బు లేకుండా ఎందుకు వేసుకున్నారు అంత పత్తి? ఇప్పుడు నన్ను ఎక్కడ చావమంటారు?" అంటూ ఆయన విసుక్కుంటూ, చిరాకుతోనే బాంకు నుంచి ఐదు వేలు తీసుకొచ్చి ఇచ్చాడు.

"పత్తి అమ్ముకున్న వెంటనే 3 నెలల్లో నా డబ్బు తీసకొచ్చి కట్టండి! నా చేత మాత్రం మీరు అడిగించుకోవద్దు. మూడు నెలలు దాటితే నేను మీ వూరు రావాల్సి వుంటుంది. చుట్టంగాకాదు, డబ్బు కోసం! నా చేత మాత్రం అడిగించు కోవద్దు. అడక్కుండానే తెచ్చివ్వండి'' ఆయన నిష్కర్షగా, నిర్మొహమాటంగా డబ్బు ఇచ్చి మాట్లాడాడు.



రాజమ్మా, అంజయ్యా ఆ ఐదువేలు తీసుకుని వచ్చారు.

'ఛఛ... అయినోళ్లని అడగటం కంటే అడక్కతింటం మంచిది. ఆయన చేత ఎన్ని మాటలు అనిపించుకున్నామో చూడు! దరిద్రపు పత్తి! ఇది పండేదేందో, చచ్చేదేందో! దాన్ని గురించేగా ఇన్ని మాటలు పడాల్సి వచ్చింది'' అని రాజమ్మ బాగా బాధపడింది.

"మొదట వచ్చిన వరస పత్తే అమ్మి, ఆయన డబ్బులు ఆయనకి ఇద్దాం. మనకి పరువుగా వుండిద్ది'' అన్నాడు అంజయ్యా.

"ఎవురుకని ఇస్తాం? మీ చెల్లెలికిస్తామా, మా అన్నకిస్తామా, లేకపోతే పది రూపాయల వడ్డీకి తెచ్చిన సత్తానికిస్తామా, పాతబాకీలు తీరుస్తామా, ఎవరికని ఇద్దాం" అంది రాజమ్మ.

★ ★ ★

పురుగు ఏరుతున్నా, విస్తృతంగా మందు



లు వేస్తున్నా అవేమీ పురుగు మీద ప్రభావం చూపెట్టడం లేదు.

పురుగు ఎక్కువగా వుండటం, ఆ పురుగుని అదుపు చేయటం కోసం రైతాంగం విపరీతంగా, భారీ ఎత్తున క్రిమిసంహారక మందులు వినియోగిస్తుండటంతో మంచి మందులకు తోడు-మరో మూడు రకాల మందులతో పురుగు మందుల కొట్లు నిండిపోయాయి.

అవి నాసిరకం మందులూ, నకిలీ మందులూ, కల్తీ మందులూ!

మందులలో ఎక్కువ ఆదాయం వస్తుండటంతో చాలా కొత్త కంపెనీలు వెలిసాయి. ఈ కంపెనీలు చాలా రకాల మందుల్ని దాదాపు అన్ని రకాల మందుల్నీ వుత్పత్తి చేస్తున్నాయి. అయితే వాటి నాణ్యత విషయం మాత్రం అడిగే పనిలేదు. పేరుకి మాత్రమే అవి మందులు. ఆ ఫ్యాక్టరీలకు ప్రభుత్వ లైసెన్సులూ, అండదండలూ అన్నీ వుంటాయి.

ఈ నాసిరకం, చౌకబారు కంపెనీలు వ్యాపారస్తులకి ఎక్కువ కమీషన్ ఇస్తాయి. వ్యాపారులకి కూడా ప్రధానంగా కావాల్సింది లాభాలే కాబట్టి ఈ నాసిరకం మందుల్నే తీసుకొచ్చి విక్రయిస్తున్నారు.

ఉదాహరణకు శాండోజ్ కంపెనీ తయారు చేసే క్వినాల్‌ఫాస్ మందు లీటరు వంద రూపాయలు వుంటే, ఈ నాసిరకం కంపెనీ మందు లీటరు డబ్బై ఐదు రూపాయలే! బ్రాండ్ నేమ్ మార్పు అయినా మందు ఒక్కటే అనీ కొంత తక్కువ ధరకు వస్తుంది అనీ ఇంకా మందుల నాణ్యత విషయం కూడా తెలియక ఎక్కువమంది రైతులు ఈ నాసిరకం మందులు వాడుతున్నారు.

పంచాయితీ ఆఫీసు దగ్గరకి ఒకసారి అంజయ్య కరెంటుబిల్లు కట్టడానికి వెళ్లాడు. అక్కడ సర్పంచ్ తన గదిలో ఎవరితోనో చెపుతుంటే అంజయ్య విన్నాడు.

సర్పంచ్ వాళ్ల బంధువుల అబ్బాయి ఏజీబి ఎస్సీ చదువుకున్నాడట. ఉద్యోగం దొరకలేదు. ఊరికే వుంటే లాభంలేదని ఫ్రెండ్స్ ముగ్గురితో కలిపి పురుగుమందులు తయారుచేసే కంపెనీ పెట్టాడు. పెట్టుబడి 50 లక్షలు. కంపెనీ పెట్టి ఏడాది దాటింది. మొదటి ఏడాది చివరికి ఒక కోటి రూపాయల లాభం సంపాదించారు.

ఎంత నాసిరకంగానూ, ఎంత అధిక ధరలూ గుంజకపోతే అంత ఆదాయం వస్తుంది? ఈ ఏడాది రెండుకోట్లు లాభం సంపాదించాలని టార్గెట్‌గా పెట్టుకున్నారట!

"లాభాల్లో టార్గెట్లు అనడంకన్న రైతుల రక్తమాంసాల్ని పిండటంలో టార్గెట్లు అని పెట్టుకుంటే బాగుండేది'' అన్నాడు సర్పంచ్. ఆయన పాత తరానికి చెందిన మండలస్థాయి కమ్యూనిస్టు లీడరు.

లీటరూ, గ్యాలనూ ప్యాకింగుల్లో సగం మందు కాజేసి, మిగతాసగం కిరోసినో, మరొకటో పోసి కల్తీచేసి చాలా కొట్లు వాళ్లు తేలిగ్గానే విక్రయిస్తున్నారు.

ఇక మూడవరకం నకిలీమందులు! ఈ నకిలీ మందుల్ని తయారుచేసేవాళ్లు ఒంగోలు, గుంటూరు, చిలకలూరిపేటల్లో చాలామంది వున్నారు. ఈ నకిలీ తయారీదారులు ఒక్కచోటే స్థిరనివాసం ఏర్పరుచుకోరు. దేశం అంతా తిరుగుతుంటారు.

మందుల షాపులవాళ్లకి ఏ కంపెనీ మందు నకిలీది కావాలంటే ఆ కంపెనీ మందు నకిలీది ఇస్తారు.

వీళ్ల కూలీలు గ్రామాల్లో తిరిగి, రైతులు ఒకసారి వాడి పారేసిన ఖాళీమందుడబ్బాలు కొనుక్కుపోతారు. జైలెమ్, జైలాన్ అనే పెట్రోలియం పదార్థాలవలన నకిలీమందుని తయారుచేయటం చాలా సులభం అట! ఈ పెట్రోలియం పదార్థాలతో తయారుచేసిన నకిలీ మందు చీడపురుగు మందు మాదిరిగానే నీళ్లలో కలిపినప్పుడు నురగ వస్తుందీ వాసన కూడా వుంటుంది.

ఈ నకిలీమందుని రైతుల దగ్గర కొనుక్కు వచ్చిన డబ్బాల్లో పోసి, వాళ్ల దగ్గర అచ్చు వేయించిన లేబుళ్లు అంటిస్తారు. వీళ్ల దగ్గర దొరకని నకిలీమందే వుండదు.

100 రూపాయలు అమ్మే లీటర్ని వీళ్లు 10 రూపాయలకే ఇస్తారు. లీటరు 900 రూ. అమ్మే సైపర్‌మైత్రీన్ 25 ఇ.సి. అనే మందును వీళ్లు 100 రూపాయలకే అమ్ముతారు. వంద రూపాయలకు కొనుక్కు వచ్చిన ఆ నకిలీ లీటర్లని 9 వందలు చేసి కొన్నివేల లీటర్లు కొన్ని వందలమందికి మందులకొట్లవాళ్లు విక్రయిస్తారు.

ప్రభుత్వం అదుపూ, ఆంక్షలూ ఏమీ లేకపోవడంతో ఈ మందులు కొట్లవాళ్లు గ్రామాల్లో రైతుల్ని యధేచ్ఛగా, స్వేచ్ఛగా దోచుకుతిన్నారు. అయితే నిజానికి వీళ్లు ద్వితీయస్థానంలో వాళ్లే! మందులు తయారుచేసే కంపెనీలు కోట్లు మింగితే వీళ్లు లక్షలు మాత్రమే మింగారు.

రైతాంగంలో వచ్చిన అలజడికి కుంభకర్ణుడి నిద్రలో వున్న ప్రభుత్వం కళ్లు తెరిచింది.

శాసనసభ్యులు 'అయ్యో పురుగు పురుగు' అని ప్రకటనలమీద ప్రకటనలు చేస్తున్నారు, పాపం వాళ్లని పురుగు కుట్టినట్లు!

నాసి, నకిలీ, కల్తీ మందులు విక్రయించే వ్యాపారులమీద కఠినచర్యలు తీసుకుంటామనీ, వాళ్ల లైసెన్సుల్ని రద్దుచేయడమేగాక, వాళ్లని నాసా, టాడాలాంటి చట్టాలకింద అరెస్ట్ చేసి జైళ్లలో తోస్తామని కలెక్టరు హెచ్చరించాడు. విజిలెన్స్ డిపార్ట్‌మెంట్‌ని అప్రమత్తం చేసినట్లు ప్రకటించాడు.

సమర్థుడూ, నిజాయితీపరుడైన విజిలెన్స్ అధికారిని ప్రభుత్వం ప్రత్యేకంగా ఈ జిల్లాకు

పంపించిందని పేపర్లలో వార్తలు వచ్చాయి.

ఆ విజిలెన్స్ అధికారి వచ్చిన తరువాత అనేక షాపులమీద దాడులుచేసి, ఆ షాపులవాళ్లని అరెస్ట్‌చేసి జైళ్లలో వేశారని రైతులు కథలు కథలుగా చెప్పుకుంటున్నారు.

★ ★ ★

నాగేశ్వరరావు మందులకొట్లో 900 రూపాయలు ఇచ్చి యల్లారావు 3 లీటర్లు ఫెన్‌వాల్‌రేట్ మందు కొనుక్కువచ్చాడు.

మధ్యాహ్నం వరకూ చేలో మందు వేశారు. మధ్యాహ్నం అన్నం తినడానికి కూర్చుంటూ, మందు ఎలా పనిచేసిందో చూద్దామని, అప్పటివరకూ మందువేసిన సాళ్లు చూశాడు.

యల్లారావు వేసిన మందుకి చిన్నపురుగు కూడా చావలేదు. పెద్దపురుగు ఎలాగూ చావడంలేదు. గుడ్డునించి పగిలిన మరీ చిన్నపురుగు కూడా చావకపోవడంతో అది కల్తీమందు అని యల్లారావుకి అనుమానం వచ్చింది.

పది పురుగుల్ని పట్టుకుని, చిన్న డబ్బాలో ఆ పురుగుల్ని వేసి, వాటిమీద నీళ్లు కలపని మందు వేశాడు.

ఆ క్రిమిసంహారిణిని పురుగులు బలంటానిక్ తాగినట్లు తాగి, ఆ డబ్బాలో ఉత్సాహంగా విహరించసాగాయి.

ముక్కు దగ్గర మందుపెట్టుకుని వాసన చూశాడు. స్వల్పంగా వాసన వస్తున్నది కానీ, మందుకి వచ్చే ఘాటైనవాసన రాలేదు. ఖచ్చితంగా అది నకిలీమందే అని యల్లారావు నిర్ణయించుకున్నాడు.

చుట్టుపక్కల పొలాల్లో పనిచేసుకుంటున్న ఐదారుగురు రైతుల్ని పిలిచి విషయం చెప్పాడు. వాళ్లూ పరీక్షించి చూసి, అది ఖచ్చితంగా డూప్లికేటుమందే అనీ, అందులో పవరేమీ లేదనీ తేల్చిచెప్పారు.

అంజయ్య కూడా ముక్కు దగ్గర పెట్టుకుని చూశాడు. ఘాటైన వాసనేమీ రాలేదు.

లీటరు 3 వందల రూపాయలమందు అది.

ఫెన్‌వాల్‌రేట్ అనే ఆ మందుని ఏ వంద కంపెనీలు ఉత్పత్తి చేస్తున్నాయో! అంతకు ముందు ఏడాది 4 వందల రూపాయలు అమ్మిన ఆ మందు కంపెనీల పోటీ ఎక్కువై 3 వందల రూపాయలకు అమ్ముతున్నారు. మందు వచ్చిన మొదటి సంవత్సరం అయితే లీటరు 5 వందల రూపాయలు! కొత్తమందు అని కూడా రైతులు దీనిని అంటారు. మొదట్లో ఉత్పత్తి చేసిన కంపెనీలకు ఈ మందు ఎంత ఆదాయం సమకూర్చిపెట్టిందో.

"మందుకి చేతిలో డబ్బు లేకపోయేసరికి నా పెళ్లాం తాళిబొట్టు తీసకపోయి కుదువపెట్టా అన్నా! వాడి కొట్లోకి మందుకిపోతే వాడు ఈ పనిచేశాడు. పది రూపాయలా, పాతిక రూపాయలా, 9 వందలు కొట్టేసి ఈ డూప్లికేటు మందు 3 లీటర్లు ఇచ్చాడు. కడుపుమండిపోతోంది. వాణ్ణి ఏం చేద్దాం?" యల్లారావు కోపంగా తోటి రైతులతో అన్నాడు.

"ఒంగోలుపోయి విజిలెన్స్ వాళ్లనో, కలెక్టర్నో తీసకవచ్చి పట్టిద్దాం. వాడిమీద గట్టిచర్య తీసుకోమని చెబుదాం. అట్టయితేనే వాడి తిక్క అణిగిద్ది''

"వాళ్లు అంత తేలిగ్గా పట్టించుకుంటారో, పట్టించుకోరో! మనమేపోయి బాదిపారేద్దాం నాయాల్ని'' అన్నాడు ఒక రైతు.

ఆ రైతులు అలా వాదోపవాదాలు చేసుకుని, చివరికి గవర్నమెంట్‌కి చెప్పి పట్టించి, వాణ్ణి జైల్లో వేయించటమే మంచిదని నిర్ణయించారు.

ఒకరు వెల్లటంకంటే, నలుగురు రైతులు కలిసికట్టుగా వెళ్లి రిపోర్ట్ చేస్తే బాగుంటుందనుకున్నారు. మరుసటిరోజు ఉదయం ఫస్ట్‌బస్‌కి నలుగురు ఒంగోలు వెళ్లాలనుకున్నారు.

అదేరోజు పేపర్లో కలెక్టరు ప్రకటన కూడా వచ్చింది. నకిలీమందులు, కల్తీమందుల బెడద జిల్లాలో ఎక్కువగా వుందనీ, మందుల విషయమై రైతులకి అనుమానం వస్తే కార్డు ముక్క రాసి పడేసినా, కాకితో కబురు చేసినా

చాలు- దాడిచేసి అవి విక్రయించే షాపులవా ళ్లని కఠినంగా శిక్షిస్తామని ఆ ప్రకటన సారాంశం. దొంగమందుల్ని పట్టించిన రైతుల కి బహుమతులు కూడా ఇస్తామని ప్రకటించా రు.

పమిడిపాడునుంచి ఒంగోలు వెళ్లే ఫస్టు బస్సుకి నలుగురు రైతులు ఒంగోలు వెళ్లారు. యల్లారావు ఒక సంచిలో మందు లీటరు డబ్బా పెట్టుకుని పోయాడు.

జిల్లాలోని అన్ని ఆఫీసులూ వుండే ప్రకాశం భవనం దగ్గరకి వీళ్లు వెళ్లారు. ఇంకా ఆఫీసులు తెరవలేదు.

ఉద్యోగులు తాపీగా ఒక్కొక్కరే వచ్చి, టీలు తాగి, ఆనాటి రాజకీయాలూ, ఆఫీసు విషయాలూ మాట్లాడుకుని నెమ్మదిగా ఫైళ్ళ లోనికి తలదూరుస్తున్నారు.

ఈ రైతులు కలెక్టర్ చాంబర్‌కి వెళ్లారు. కలెక్టర్ క్యాంపుకి వెళ్లాడనీ, రెండురోజుల వరకూ రాడని అక్కడ వున్న బిళ్ళగుమాస్తా చెప్పాడు.

అదే బిల్డింగ్‌లో వున్న విజిలెన్స్ ఆఫీసుకి వెళ్లారు. అక్కడ వున్న అధికారికి ఈ రైతులు విషయం వివరంగా చెప్పారు. ఆయన శ్రద్ధగా విన్నాడు.

పెద్ద అధికారికి లీవ్ అట! రెండో అధికారితో వీళ్లు మాట్లాడారు.

"మేము వాళ్లమీద గట్టిచర్యలు తీసు కుంటాం. మీరు వెళ్లండి. మీరు మాకు రిపోర్ట్ చేసిన విషయం గుట్టుగా వుంచండి. ఎవరితో అనవద్దు! ఎవరికీ చెప్పవద్దు'' అని ఆ అధి కారి వీళ్లకి చెప్పాడు.

వెళ్లిన రైతులు సంతోషంతో తిరిగివచ్చారు. మంచిపని చేశామనీ, ఎరువులషాపు నాగేశ్వర్రా వుకి శిక్ష తప్పదనీ ఆనందించారు.

మరుసటిరోజు మధ్యాహ్నం విజిలెన్స్‌వా ళ్లు జీపు వేసుకుని వచ్చి నాగేశ్వర్రావు షాపు మీద దాడిచేశారు. షాపులో వెదుకులాడి బ్యాచ్ నంబర్లూ, కొనుగోలుచేసిన బిల్లూలేని రెండు లీటర్ల ఫెన్‌వాల్‌రేట్ మందుని పట్టుకు న్నారు.

నాగేశ్వర్రావు తెప్పించిన టిఫిన్ తిని, కూల్ డ్రింకులు త్రాగి ఆయనని కారులో ఎక్కించు కుని వాళ్లతోపాటు తీసుకుపోయారు.

కల్తీమందులు అమ్ముతున్న నేరానికి నాగే శ్వర్రావుని పట్టుకుని పోయారని ఊరంతా పాకింది. జనం వాడికి తగిన శాస్తి జరిగిందని చెప్పుకున్నారు. మిగతాషాపులమీద కూడా దా డిచేసి, వాళ్లని కూడా పట్టుకునిపోతే బాగుండే దని అనుకున్నారు.

అయితే జనం ఆనందం ఎక్కువసేపు నిలవలేదు. ఒకవైపు వీళ్లు ఇలా కబుర్లు చెప్పుకుంటూండగానే సాయంత్రానికి నాగేశ్వ ర్రావు ఠీవిగా ఊళ్లోకి వచ్చాడు.



"ఛీ... ఇది లుచ్చాకోరు గవరమెంటు మామా! మాటలపసే తప్ప చేతల పసలేదు. వీళ్లు రైతులకేం మేలు చేస్తారు?" దడి దగ్గర ఎద్దుల్ని మేపుకుంటున్న అంజయ్యా దగ్గరకి పొద్దు పొడిచేసరికి పొలంపోయి చూసుకుని వచ్చిన యల్లారావు అన్నాడు.

"నిజమేరా. వాడిని పట్టుకున్నట్లే పట్టుకు పోయి వదిలిపెడితిరి. అసలు ఒంగోలు దాకా తీసకపోయారో, మామూళ్లు కాజేసి మజ్జిలోనే

వదిలిపెట్టారో! ఒక్కరోజన్నా జైల్లోపడేస్తే బా గుండేది''

"మూడు లీటర్లకి 9 పందలు వాడి ఎదాన పోస్తివి. వాళ్లకి రిపోర్ట్ చేయకుండా, నాయాల్ని ఇక్కడేతన్ని డబ్బు వసూలు చేసుకుంటే సరిపోయేది. నిన్న వాళ్లకి లంచం అప్పటిక ప్పుడే 10 వేలు ఇచ్చాడంట మామా! రేత్రి వాడు బాగా తాగి వాగుతుంటే విన్నోళ్లు అంటన్నారు''

"ఇచ్చే ఉంటాడ్రా, అనుమానం ఏముంది? ఎంత ఇవ్వకపోతే అప్పటికప్పుడే వదిలిపెడ తారు. రోజులు వాళ్లయ్యేరా! పత్తి యవారం ఏందిరా? చూస్తంటే అసలు ఇయ్యేడు కూడా కాలం బాగాలేదు. ఇప్పటికి ఎంత పెట్టుబడి పెట్టాం? ఎన్నివేల రూపాయల మందులు వాడాం? అయినా అతీగతీ ఏం లేకపోయా?"

"నేను వేసిన 6 ఎకరాలకీ, పాతికవేలు ఖర్చయింది మామా! ఇయ్యేడు ఏం మిగు ల్తయ్? ఒకవేళ మిగిలినా, తగిలినా ఇంక నాపని అయిపోయింది'' అన్నాడు యల్లారావు.

"పత్తి మాత్రం ఇంత వెయ్యకూడదురా! మందులు వేసీ వేసీ మనం చావాల్సిందే తప్ప పురుగు చావకపోతండే! నాలుగురోజుల్నించీ పురుగు కాస్త తగ్గిందంటన్నారు, నిజమే నంట్రా?"

"ఏం తగ్గడం మామా? గాలిమార్పుకి నిన్నా మొన్నా తగ్గినట్టు అనిపించిందిగానీ, ఇయ్యాల చూస్తే ఎప్పటిమాదిరిగానే పురుగు లుకలుకలాడతంది. పడిన దండగేదో పడ్డాను, ఇంక నేను మాత్రం మందులు వేయను మామా! పండితే పండిద్ది, పోతే పోయిద్ది''

"పత్తి మొగ్గ అంతా పిందెలు అవతన్నయ్ గారా, ఇప్పటిదాకా వేసి ఇప్పుడు మానుకుంటే యట్రా?"

"మానుకోక ఏంచేయాలి మామా? కాయల నిండా పురుగే, ఎంతని పోస్తాం మందు?" నిరాశగా అన్నాడు యల్లారావు.

"ఇంకా ఎంతకాలం మందు వేస్తాం యల్లారావు? వారంరోజుల్లో సంక్రాంతి పండగ నెల వచ్చిద్ది. పండగ నెలనాటికి ఏటా మందు లు వేయడం ఆపేసేవాళ్లంకదా. మందులు వేసినన్ని రోజులు వేశాం. ఇంక పదిరోజులు వేస్తే తేలిపోయిద్దిగా'' అంది రాజమ్మ, పాలు పిండుకోవడానికి ఆమె దడి దగ్గరికి వచ్చింది.

"ఏమో అప్పా, నేను మాత్రం ఇంక మందులు వేసే పనిలేదు'' స్థిరంగా, మొండి గా, నిరాశగా అన్నాడు అతను.

యల్లారావు మాదిరిగానే ఇంకా కొంత మంది రైతులు మందులు వేసి వేసీ విసుగుపు ట్టి మానుకున్నారు. పత్తితోటల్ని వదిలిపెట్టేశా రు.

★ ★ ★

రామస్వామి భార్య సరోజిని.

ఆరోజు ఉదయం సరోజిని 4 వందల రూపాయలు ఇచ్చి తిరపతయ్య కొట్లో సైపర్ మైత్రిన్ 10 ఇసి మందు ఒకలీటరు కొనుక్కువ చ్చింది. ఆ మందుని డిసిహెచ్ 32 చేలో వేస్తున్నారు.

సరోజిని కుంట దగ్గరనించి నీళ్లు మోసుకొ చ్చి ట్యాంకుల్లో పోస్తోంది. మందు రామ స్వామి వేస్తున్నాడు.

11 గంటలవరకూ మందు వేసిన తరువాత సరోజిని, అప్పటివరకూ వేసిన మందు ఎలా పనిచేసిందో చూద్దామని, వేసిన సాళ్ళలో చెట్లు చూసింది.

పురుగులో కదలిక లేదు. కదలిక అంటే మందు ప్రభావానికి పెద్ద పురుగులు వంకర్లు తిరిగిపోవటం, పసరు కక్కటం, ఆకుమీద నించి రాలి కింద పడిపోవటం లాంటి విష ప్రభావ లక్షణాలు కనపడతాయి. ఎక్కువ పురు గులు తట్టుకుని బ్రతికినా, కొద్దిపురుగులు అయినా చస్తాయి. చిన్న పురుగులు మాత్రం ఎక్కువ చచ్చిపోతాయి. పెద్దపురుగు అంటే దాదాపు 4 సెంటీమీటర్లు ఉంటుంది. 2, 3 మిల్లీమీటర్ల పురుగుని చిన్నపురుగు అంటారు.

ఈ చిన్నపురుగు దాదాపు 4 సెంటీమీటర్ల వరకూ పెరుగుతుంది.

రామస్వామి వేస్తున్న మందుకి పురుగులు యధాతథంగా వున్నాయి. చిన్న పురుగు కూడా చావలేదు.

"ఈ మందు అసలు పనిచేయడం లేద య్యా! మనం వేసిన మందు మొత్తం దండగే ను'' అంటూ సరోజిని భర్తని పిలిచింది.

కొద్దిదూరంలో వున్న రామస్వామి వచ్చి చూశాడు. "ఇయ్యాల మందు యేస్తే రేపు చచ్చిద్ది పురుగు. ముందు మందు పనిచేయా లిగా! ఇయ్యాల ఏసిన మందు ఇయ్యాల్నే పనిచేయంటే యట్టచేసిద్దే?" అన్నాడు ఆయన.

సరోజినికి విపరీతమైన కోపం వచ్చింది. "అయితే ఆ మందు నువ్వు తాగి చూడు, ఇయ్యాల చస్తావో రేపు చస్తావో తెలిసిద్ది. మందు వేసినరోజు పనిచేసిద్దా, తరవాత ఎప్పు డో పనిచేసిద్దా?" అంది మండిపోతూ.

"నాకెందుకులే మజ్జెలో బోడిపెత్తనం మందు తెచ్చింది నువ్వేగా, నువ్వు యేయ మంటే మందు యేస్తాను, లేకపోతే లేదు'' అన్నాడు రామస్వామి.

సరోజిని చుట్టుపక్కల పొలాల్లో పనిచేసు కుంటున్న ముగ్గురు రైతుల్ని తీసుకొచ్చి మందు చూపెట్టింది.

"అది కాదన్నా... లీటరుకి 4 వందలు కాజేశాడు. ఒక్క పురుగు కూడా చావలేదు. అసలు ఇది మంచి మందేనంటన్నా?" సరో జని అడిగింది.

మందు ముక్కుల దగ్గర పెట్టుకుని చూశా రు. భరించలేని వాసన వస్తోంది.

"మంచి మందో, చెడ్డమందో ఎట్ట చెపతాం? ముక్కులు పగిలిపోయేటంత కంపు వస్తండే! పురుగు ఏం చావకపోతండే!" అన్నాడు ఒక రైతు.

"నకిలీమందులు కూడా వాసన వస్తాయి కానీ పురుగుమీద పనిచేయవు'' అన్నాడు కొద్దిగా చదువుకున్న ఒకరైతు కుర్రవాడు.

"తిరపతయ్య కొట్టో తెచ్చానబ్బాయి. నా లుగు పురుగులు పట్టుకుని మందు యేస్తే ఆ పురుగులు చూడు చావకుండా ఎట్ట తిరుగుతు న్నయ్యో! వాడు ఇచ్చింది నకిలీమందేను'' అంది సరోజిని గట్టిగా.

"మేము వేస్తున్న మందు కూడా అనుమా నంగా వెయ్యడమే! డబ్బులకి డబ్బులూ వదులుతుండే పురుగు చావక పంటా నాశిన మైపోతుండే. ఏం చేసేటట్టు."

"చేసేదేందిరా, పోయి తిరపతయ్యగాడి మీద రిపోర్టు ఇద్దాం!"

"రిపోర్టులకీ, గిపోర్టులకీ ఏం అయిద్దిరా? పోయినసారి నాగేశ్వర్రావుమీద ఇచ్చినప్పుడు ఏం అయిందీ, ఇదీ అంతే!"

"తరవాత ఏదయితే అదయిద్దిగనీ, ముందు ఆ తిరపతాయ్‌గాణ్ణి బాది పడే ద్దాంరా, తేలేదేదో తేలిపోయిద్ది''

"అంతేరా చేయాల్సింది. మాటలకి లా భంలేదు. ముందు నువ్వు అడుగమ్మాయి సరోజినీ, తరవాత మేం చూసుకుంటాం" అన్నారు అందరూ ఒక్కమాటగా.

అందరూ ఊళ్ళోకి వెళ్లారు. వాళ్ళకితోడు ఇంకా పదిమంది కలిశారు. అక్కడ కొందరూ, అక్కడ కొందరూ వుండి ముందు సరోజినిని పంపించారు, అడిగితే ఏమంటాడో చూద్దా మని.

తిరుపతయ్యా, గుమస్తా ఇద్దరూ కూర్చుని బాకీలెక్కలు చూసుకుంటున్నారు.

"నాలుగొందలు ఇచ్చి మందు తీసకపోతే సన్నపురుగు కూడా చావలేదు. నాకు మందూ వద్దూ, పాడూ వద్దూ, నా డబ్బులు నా కియ్యి'' అంది సరోజిని మందు డబ్బాని టేబుల్‌మీద పెట్టి.

"ఒకసారి అమ్మిన తరవాత మళ్ళీ వెనక్కి తీసుకోం. ముందే వుండాల, ఎందుకు కొనక్కి పొయ్యావు? అసలు వాతావరణమే బాగాలే

డు. వాతావరణం బాగుంటేనే పురుగు చచ్చేది. లేకపోతే ఎన్ని మందులు పోసినా ఉపయోగంలేదు'' అన్నాడు తిరుపతయ్య.

"నువ్వు మంచి మందు తీసుకొచ్చావా, నకిలీమందు తీసుకొచ్చావా? మందు యేస్తే ఒక్క పురుగన్నా చావకుండా ఎట్టుండి ద్దాంట?"

"ఏమో, ఎవుర్ని అడుగుతావు? పోయి మందు తయారుచేసే కంపెనీ వాణ్ణి అడుగు''

"కంపెనీ వాణ్ణి అడిగేదేంది తిరపతయ్యా? మందు నేను నీ దగ్గర కొనక్కపోతే నువ్వా జవాబుదారీ, కంపెనీవోడా?"

"ఏంటమ్మా గోల, అరవకుండా పో ఇంక! ఎవడికో చెప్పుకో, చెప్పుకునే దేందో' అంటూ తిరుపతయ్య చీత్కారంగా విదిలించి కొట్టా డు.

ఆయన నోటినుంచి ఆ మాటలు రావడమే ఆలస్యం, సరోజిని ఎడమకాలు చెప్పు వూడ తీసి చటచటా, పటపటా, చడామడా కొట్టింది. "ఇప్పుడు నీ అమ్మ మొగుడికి చెప్పుకో, ఎవడికి చెప్పుకుంటావో... నా బట్టా..." అంటూ ఘోరమైన తిట్లపురాణానికి లేచింది.

అప్పటికే అక్కడికి చేరిన రైతులు అదే అదునుగా భావించి తిరుపతయ్యను చితకకొ ట్టి వదిలిపెట్టారు.

అంతకుముందు ఏడాది నకిలీవిత్తనాల్ని కూడా అమ్మిన నేరానికి కసితీరని కొంతమంది కొట్లో వున్న మందు డబ్బాలూ, పుస్తకాలూ, టేబుల్, కుర్చీలూ అన్నీ శుభ్రంగా వూడ్చినట్లు తీసుకువచ్చి నడిరోడ్డు మీద వేశారు.

ఒకరు అగ్గిపుల్ల గీశారు.

మంచి మందులు కొన్ని లీటర్లూ, కిరసనాయిలూ, పెట్రోలియం పదార్థాలతో కలగలిపిన డూప్లికేటు సరుకూ వుండటంతో వాటి దెబ్బకు మంటలు ఉవ్వెత్తున లేచాయి.

"విజిలెన్సోడో, కలెక్టరో ఇంతకంటే పగల బొడుస్తాడా? తిరపతాయ్‌గాడికి ఇంత మాత్రం శాస్తి జరగాల్సిందే'' అని రైతులు సంతోషంతో ఇళ్ళదారి పట్టారు.

"ఏహై, వీడికొక్కడికే కాదు, మనూళ్లో వున్న మందులకొట్ల వాళ్ళందరికీ ఇంతమాత్రం పాశ్చిత్తం జరగాల్సిందే'' అని కొందరు అన్నారు.

★ ★ ★

పెద్ద ప్రమాదం లేదనుకున్న తెల్లదోమ ఇంతై, అంతై వటుడింతై అన్నట్లు అంతా వ్యాపించిపోయింది. కంట్లో నలక అంత మాత్రమే వుండే తెల్లదోమ చివరికి పత్తి చెట్లరసాన్ని పీల్చి పిప్పిచేసి వదిలిపెట్టింది.

తెల్లదోమ దెబ్బకి మొగ్గలు ఎంతో కాలానికి కాయ అవుతున్నాయి. ఆ కాయ కూడా బలంగా, పెద్దసైజూ రావడంలేదు, చివరికి పగిలిన పత్తి కాయలోని విత్తనంలో కూడా నీరు వుండటంలేదు.

ఒకవైపు పురుగూ, మరోవైపు తెల్లదోమతో మందు వేసీవేసీ అవి ఇక అదుపు కాకపోవడంతో రైతులకు నిరాశ ఏర్పడింది. దాదాపు రైతులు అందరూ మందు వేయడం మానుకున్నారు.

అప్పటికి ఎకరానికి 50 నించి 100 కేజీల పత్తి తీశారు. ఇక ఏం చేయాలో, ఎలా బతకాలో రైతాంగానికి అర్థంకాలేదు.

చివరికి రైతులకి పాలకేంద్రమే శరణ్యామైంది. అప్పటివరకూ కూలీనాలీ చేసుకునే జనమే పాలకేంద్రానికి పాలుపోసుకునేవాళ్లు. చేతిలో చిల్లిగవ్వ కూడా లేకపోవడంతో, కనీసం కూరగాయలు కొనుక్కోవడానికి కూడా అర్థరూపాయి అవసరానికి దొరక్క, రైతులందరూ వాళ్లగేదెల పాడిని పాలకేంద్రానికి అమ్ముకోవడం ప్రారంభించారు. అంతా పత్తి పంట వేయడంతో కనీసం పప్పుధాన్యాలు కానీ, కూరగాయలు కానీ లేని దౌర్భాగ్య పరిస్థితి తోడైంది.

దొంగలు ఇంట్లో పడిన ఆరునెలలకు కాపలా కుక్కలు మొరిగినట్లు రైతులు మందులు వేయడమే మానుకున్న తరువాత ప్రభుత్వం

జిల్లాకు భారీస్థాయిలో శాస్త్రవేత్తల్ని దించింది. పురుగుని అరికట్టే చర్యలు తీసుకోవడంలో రైతులకు సూచనలూ, సలహాలూ ఇవ్వడానికి వ్యవసాయ విశ్వవిద్యాలాయానికి చెందిన శాస్త్రజ్ఞులు దిగారు. వ్యవసాయశాఖ ఉన్నతాధికారులూ చాలామంది వచ్చారు.

వీళ్లు గ్రామాల్లో తిరిగి పత్తితోటల్నీ పురుగునీ పరిశోధించారు. రైతులు అధిక దిగుబడుల కోసం పోటీలు పడి వాడిన రసాయన ఎరువులవలనే పురుగు వచ్చిందని నిర్ధారించారు. క్రిమిసంహారకమందులు విచక్షణారహితంగా, కంపెనీలు సిఫారసు చేసిన మోతాదు కంటే కూడా ఎక్కువగా వాడుతున్నందు వలన పురుగుల్లో మందుని తట్టుకుని నిలబడగలిగే శక్తి వచ్చిందనీ, వాటి నిరోధక శక్తి పెరిగిందనీ తెలిపారు. ప్రస్తుతం వినియోగిస్తున్న మందులు ఎంత వాడినా పురుగుని అదుపు చేయడం అసాధ్యమన్నారు.

ఇతర ప్రాంతాల్లో ఒక లీటరు నీటికి 2 మిల్లీలీటర్ల ఎండోసల్ఫాన్ మందు కలిపి స్ప్రే చేస్తే చచ్చిపోతున్న పురుగులు ఈ ప్రాంతంలో లీటరు నీటిలో 10 మిల్లీలీటర్లు కలిపి స్ప్రే చేసినా చావడం లేదంటే పురుగులో ఊహాతీతమైనంత 'రెసిస్టెన్స్ పవర్' పెరిగిందని శాస్త్రవేత్తల బృందం అభిప్రాయపడింది.

ఈ పురుగుని అదుపు చేయడానికి ప్రస్తుతం మనదేశంలో వాడుతున్న సాధారణమందులు లాభంలేదనీ, అమెరికా, జపాన్, జర్మనీ నుంచి ఇంకా ఆధునికమైన, శక్తివంతమైన మందులు తెప్పించాల్సిందే అనీ శాస్త్రవేత్తలు ప్రభుత్వానికి సూచించారు.

అప్పటికప్పుడే వ్యవసాయశాఖ అధికారులూ, వ్యవసాయ మంత్రి విదేశాలకు ప్రయాణమైపోయారు. ఈ మూడు దేశాలనించీ నాలుగు రకాల మందుల్ని దిగుమతి చేయించారు.

దిగుమతి అయిన 'లానెట్' లాంటి ప్రమాదకరమైన మందులు వాడితే దారుణమైన దుష్ఫలితాలు ఏర్పడతాయనీ, పంటలకు మేలు చేసే జీవజాలం కూడా పూర్తిగా నశించిపోతుందనీ, వాతావరణ సమతుల్యం దెబ్బతింటుందనీ పర్యావరణ శాస్త్రవేత్తలు హెచ్చరించారు.

ప్రజల ప్రయోజనాలకంటే వ్యక్తిగత ప్రయోజనాలే మిన్నగా భావించే మంత్రులూ, అధికారులూ పర్యావరణవేత్తల అభిప్రాయాలకేం విలువ ఇవ్వలేదు.

అయితే మందులు వాడివాడి విసుగెత్తిన రైతులు దిగుమతి అయిన మందుల జోలికే వెళ్ళలేదు. అప్పటికే తలకుమించిన పెట్టుబడి పెట్టిన రైతులు ఇంకా చేతులు కాల్చుకోవడానికి సిద్ధంగా లేరు.

రైతులు మందులు వేయడం ఆపేసి, పత్తి తోటల ఊసే ఎత్తడం మానేశారు.

★ ★ ★

ప్రతి ఏటా ఉత్సాహంగా చేసుకునే సంక్రాంతి పండుగ కళాకాంతులూ లేకుండా వెలవెలాబోయింది.

సంక్రాంతి పండుగ నాటికి ఎకరానికి ఏటా ఏడెనిమిది క్వింటాళ్ళు ప్రత్తి తీసి వుండేవాళ్ళు. ఈ ఏడాది ఒక క్వింటాల్ ప్రత్తి తీసారు.

అంజయ్య వేసిన 13 ఎకరాలకీ 15, 16 క్వింటాళ్ళ ప్రత్తి వచ్చి వుంటుంది. ఇక పొలాల్లోనుంచి ఎంత వస్తుందో, ఏమో అనుమానమే!

పండుగ వెళ్ళిన నాలుగు రోజులకి అంజయ్య చెల్లెలు శారద వాళ్ళ వూరునుంచి వచ్చింది.

"ఆయన బంగారం అడిగి రమ్మన్నాడన్నా! పేటలో కొట్టు పెడతన్నాడు. బంగారం బ్యాంకిలో పెట్టుకుని లోను తెచ్చుకోవాలంట!" అంది శారద.

"అదుగో అమ్మాయ్ ఊళ్ళో ఎవురూ ఇప్పుడు పత్తి కొనటం లేదు. పత్తి కొనుగోళ్ళు మొదలుపెడితే ఈ పత్తి మొత్తం అమ్మి, నీ బంగారం తీసకొచ్చి ఇస్తాను''

# ఏరిన ముత్యాలు

☆ ప్రవర్తన అనేది తెల్లకాగితం వంటిది. ఒక్కసారి దానిమీద మరకపడితే దానిని మళ్ళీ తెలుపు చెయ్యడం కష్టం.

-బెంజిమన్ ఫ్రాంక్లిన్

☆ వ్యక్తి చిరునవ్వును బట్టి అతని వ్యక్తిత్వాన్ని కొంతవరకు అంచనా వేయవచ్చు.

-బోలే

☆ తను మనసారా ప్రేమించే స్త్రీని ఏ పురుషుడు ఇతరుల ముందు పొగడడు.

-ఓకెర్మన్

☆ పురుషుల బలహీనత ఎక్కడ ఉందో స్త్రీ బాగా గ్రహిస్తుంది. కాని అతని ఔన్నత్యం ఎక్కడ ఉందో అంత త్వరగా గ్రహించలేదు.

-ఠాగూర్

☆ వర్షానంతరం మెరిసే సూర్యకాంతి వంటిది ప్రేమ. రాత్రి విజృంభించే తుఫాను వంటిది మోహం.

-షేక్స్పియర్

☆ మనస్సు చేతిలో శరీరం చురకత్తిలా పనిచేసేవిధంగా ఉండాలి.

-గోపీచంద్

☆ ఉపన్యాసకుడైనా, రచయిత అయినా తన భావాలను సంక్షిప్తీకరించడం నేర్చుకోగలిగేవరకు విజయం సాధించలేడు.

-ఎమర్సన్

☆ సాహసకృత్యాలు వెదజల్లే పరిమళమే కీర్తి.

-సోక్రటీస్

☆ కార్మికుని ఒంటిమీద చెమట ఆరకముందే వాని వేతనం వానికి చెల్లించు.

-మహ్మద్ ప్రవక్త

☆ విందులు జరిగే ఇంటికి వెళ్లడంకన్నా విలాపాలు వినిపించే ఇంటికి వెళ్లడం మేలు.

-బైబిల్

☆ ఆలోచనలే మనిషిని సరైన దిశలోకి మళ్ళించి కార్యోన్ముఖునిగా చేస్తాయి. అందుకే ప్రతివారికి ఆలోచన అంత ముఖ్యం.

-భగవద్గీత

☆ ఆత్మవిశ్వాసం, ధైర్యం, పట్టుదల వీటితోనే అనేకమంది సామాన్యులు నాయకుల య్యారు.

-గాంధీజీ

సేకరణ: తడ్క యాదగిరి

"తొందరచేసి అమ్మ అన్నా! ఆయనేమొ బంగారం తీసుకుని రమ్మని ఒకటే గోల! పండక్కి ముందే వెళ్ళి రమ్మన్నాడు. నేనే ఏవో వంకలు చెప్పి ఆగా! పండక్కి మా అత్త కూడా కూతురు దగ్గరనుంచి వచ్చింది. ఇంకా ఆమెకి తెలియలా, తెలిస్తే సాపిచ్చి వదిలిపెట్టి ద్ది"

"నేను తొందరలోనే తెచ్చిస్తానమ్మా" అన్నాడు అంజయ్య.

మాట అయితే అన్నాడు కానీ, ఎలా తెచ్చివ్వాలో అర్థంకావడంలేదు. అంజయ్య మనసులో బాగా బాధపడిపోతున్నాడు. చెల్లెలు అడగకముందే బంగారం వాళ్ళది వాళ్ళకి విలువగా ఇద్దామనుకున్నాడు. భర్త వద్దంటున్నా తను అంటే ఎంత అభిమానం లేకపోతే ఇంటికి తెచ్చి ఇస్తుంది బంగారం? తను కూడా అంతటి అభిమానం చూపెడదామనుకున్నాడు. బంగారం ఇంటికి తీసుకుపోయి ఇచ్చి, చీర కొనుక్కోమని 400 రూపాయలు డబ్బులు కూడా ఇద్దామనుకున్నాడు.

తన కోరిక కోరికగానే మిగిలిపోయింది. వాళ్ళ బంగారం వాళ్ళు అడగక ముందు కాదు, అడిగినా ఇవ్వలేకపోతున్నాడు.

శారద బంగారం అడిగి వీళ్ళు ఉండమంటున్నా, ఒక పూట కూడా వుండకుండానే వాళ్ళ వూరు వెళ్ళిపోయింది.

"ఎవురన్నా కొంటంటే ఉన్నమట్టుకి పత్తి అమ్మి, కొరవ ఎక్కడన్నా చూసి, ఆ అమ్మాయి బంగారం ఇద్దామయ్యా! ఆ అబ్బాయి శారదని ఎన్ని మాటలంటన్నాడో!" అంది రాజమ్మ.

"నాకూ గట్టిగా ఇద్దామనేవుంది. పత్తి ఎవురన్నా అడిగితే అమ్మేసి అట్నే చేద్దాం. ఇయ్యేడు ముందుముందు మన చావు కుక్కలు కూడా పడవు" అన్నాడు అంజయ్య.

తరువాత 4 రోజులకు వెంకట్రామయ్య వచ్చాడు ఇంటికి.

"పత్తి కొంటం మొదలుపెట్టాంరా అంజియ్యా! ఇయ్యేడు మేమే కొని పత్తి జిన్నింగ్ చేయిస్తన్నాంరా! బాకీలేమొ పది లక్షలకి పెట్టాం. పత్తి వేసుకోకపోతే ఎవురూ డబ్బు ఇచ్చేటట్టులేదు. చిన్నగా ఎట్టోకట్ట బాకీలు వసూలు చేసుకోవాలిగా!"

"నిజమే అన్నా, ఇయ్యేడూ అందరికీ దండగలేనాయె! బాకీలు అన్నీ వసూలు కావటం గడ్డే!" పరధ్యానంగా అన్నాడు అంజయ్య.

"సరే, మరి నీ పత్తి ఎప్పుడు తొక్కుతా?"

"రేటు ఎంత చేసి కొంటన్నారన్నా?"

"5 వందలు చేసి కొంటన్నాంరా! నిజానికి అంత ధర లేదు. ముందు మాకు బాకీలు వసూలు కావాలి. డబ్బు పెట్టి కొనేవాడు అయితే 450కి కూడా కొనడంలేదురా ఇయ్యాల!"

"నాల్రోజులు చూస్తా అన్నా, రేటొచ్చిద్దేమో!"

"ఇంకేం రేటొచ్చిద్దిరా! అమ్మిపారేయక! కొట్లో నీ బాకీకి వడ్డీ పెరగడమేగానీ వుపయోగంలేదు. కాటాలు వేయడమే ఆలిస్యెం, నీ కాతాలో జమరాసుకుంటాం కదా?"

"కాదులే అన్నా, దేశంమీద అంతా దోమా, పురుగూపడి ఎక్కడా పత్తి పండక పోయె! పెద్దగా పత్తిలేదుగా, ధర ఎందుకు రాదు? నాలుగు రోజులు చూడాల్సిందే!"

"నీ ఇష్టం అయితే! నీ కాతాకి రోజురోజుకీ వడ్డీ మాత్రం పెరిగిద్ది" అంటూ ఆయన వెళ్ళిపోయాడు.

వెంకట్రామయ్యకి పత్తి అమ్మితే బాకీకి జమ వేసుకుంటాడు. ఇక చేతికి రూపాయి కూడా ఇవ్వడనే వుద్దేశ్యంతో అంజయ్య రేటు పెరుగుతుందనే సాకుతో ఆయనకి పత్తి ఇవ్వలేదు.

వేరే ఎవరైనా వచ్చి అడిగితే పత్తి వాళ్ళకి అమ్మి వుండేవాడు.

★ ★ ★

కొన్ని వేల కొంగలూ, రామచిలకలూ, పాల పిట్టలూ, గోరింకలూ పత్తి తోటలమీద ఆనందంగా ఎగురుతున్నాయి. పత్తి తోటలకు రైతులు మందులు వేయడం ఆపేసిన నెలా పదిహేను రోజులకు జరిగిన శుభపరిణామం ఇది.

ఈ పక్షులు పత్తి చెట్ల అణువణువునా శోధించి పురుగుని పట్టుకుని తింటున్నాయి.

అంతకు ముందు ఐదారు సంవత్సరాలుగా ఒక్క కాకి తప్ప ఇతర పక్షి అనేదే ఈ ప్రాంతంలో కనపడలేదు. ధాన్యపు పంటలు పండించకపోవటంతో పక్షులు కనుమరుగ య్యాయి. పక్షి జాతే అంతరించిపోయిందను కున్న ప్రాంతంలో రకరకాల పిట్టలు ఎగురు తూ కనులవిందుగా వున్నాయి.

పక్షుల పుణ్యమా అని పత్తితోటలు మళ్ళీ కొంచెం పండాయి.

ఎండలు బాగా ఎక్కువ అయ్యాయి.

ఆ ఎండల్లోనే రాజమ్మా, అన్నపూర్ణా నలు గురు కూలీల్ని పెట్టుకుని ప్రతీరోజూ ప్రత్తి తీసుకుంటున్నారు.

నెలరోజుల్లోనే ప్రత్తి తీయడం అయిపో యింది. అంజయ్య పొలం మొత్తంమీద అంతా కలిపి దాదాపు 45 క్వింటాళ్ళ పత్తి వచ్చింది.

ఎకరానికి 5 వేల రూపాయలు ఖర్చు అయితే సగటున 4 క్వింటాళ్ళు పత్తి వచ్చింది.

1 క్వింటాల్ పత్తి 390 నించీ 420 రూపా యల మధ్య కొంటున్నారు. ఎకరాకి మూడు న్నర వేలు నష్టం! అంజయ్య పత్తి అమ్మలేదు. ఇంట్లోనే వుంది.

★ ★ ★

"ఏంది అంజియ్యా, పత్తి ఇంకా అమ్మలా? డబ్బుల యవారం మరచిపోయావేంది? నేను ఊరికిపోయినా పత్తి అమ్మి వుంటావని నాలుగై దుసార్లు గుర్తొచ్చావు! మా బామ్మర్ది డబ్బు ఆయన్ది ఆయన వసూలు చేసుకుంటున్నాడు?" అంటూ వచ్చాడు సత్యం.

"నువ్వు వూరికి పోయొచ్చేసరికే పత్తి అమ్మేసి, ఆ డబ్బులు వాడుకుని వుంటాం అనుకున్నావా?" అన్నాడు అంజయ్య.

"మరి తొందర చేసి అమ్ము పత్తి లేకపోతే డబ్బు ఎక్కడన్నాచూడు''

చూద్దాం సత్తెం. మా పనిముందు చూస్తే నుయ్యా, యెనకచూస్తే గొయ్యి మాదిరిగా వుంది. ఈ సన్నాసి పత్తి గుండా తలకు మించిన అప్పులు అయినయ్యి! ఏ అప్పు తీర్చాలో, ఎవురికియ్యాలో, ఏందో అంతా అయోమయంగా వుంది. ఏం చేయాలో పాలు బోవడంలేదు''

"ఉన్న పత్తి అమ్మేసి మా బాకీ తీర్చు అంజియ్యా! నువ్వు తిన్నా, తినకపోయినా, నువ్వు ఎట్ట ఉన్నా రోజుకి 10 రూపాయల వడ్డీ నీ నెత్తిమీద పడిద్ది. నెలకి 300 అయిద్ది వడ్డీ, ఆలోచించుకుని తొందరగా బాకీ రద్దు చేసు కో!" అంటూ సత్యం వెళ్ళిపోయాడు.

ప్రతీరోజూ ఉదయం 8 గంటల ప్రాంతంలో సత్యం ఊళ్ళోకి వసూళ్ళకి వస్తాడు. అది ఆయన నిత్యకార్యక్రమం.

ముసురుపట్టిన రోజు సూర్యుడు అయినా కనబడడుకానీ, సత్యం మాత్రం ప్రతీరోజూ ఉదయం బాకీలవాళ్ళకి కనపడతాడు. ఎండ అయినా, వాన అయినా, వరద అయినా, తుఫాను అయినా సత్యం వసూళ్ళకి బజారుకి రావాల్సిందే. ఆ రోజు ఎవరైనా పంటలు అమ్ముతున్నట్లుకానీ, వాళ్ళకి వేరే ఏ విధంగా నైనా డబ్బులు వస్తున్నట్లు కానీ తెలిస్తే సాయంత్రం వచ్చి మళ్ళీ వసూలుచేసుకుని పోతాడు.

పత్తి అమ్మడానికి అంజయ్య భయపడిపో తున్నాడు. పత్తి అమ్మితే బాకీల వాళ్ళందరూ శవాన్ని పీక్కుతినే రాబందుల్లా పైన పడతా రు. అందరికీ తను సమాధానం చెప్పుకోలేడు.

ఇప్పుడు అయితే "ఇంకా పత్తి అమ్మలేదు'' అని వచ్చిన వాళ్ళందరికీ అది అడ్డంపెట్టి ఒక

మాట చెబితే సరిపోతోంది.

★ ★ ★

అంజయ్య పేరుతో పోస్టులో రెండు వుత్తరాలు వచ్చాయి. ఒకటి రాజమ్మ అన్న దగ్గర్నించీ, రెండోది అంజయ్య తమ్ముడి దగ్గర నించీ, ఆ సమయంలో అందరూ ఇంటోనే వున్నారు.

రాజమ్మ అన్న అయితే కోపంగా వుత్తరం రాశాడు. "డబ్బు తీసుకుపోయేటప్పుడు రెండుమూడు నెలల్లో ఇస్తాం అని చెప్పారు. ఐదునెలలు గడచిపోయాయి. మీరు వెంటనే తెచ్చి ఇవ్వకపోతే నేను రావాల్సి వుంటుంది. నేను వచ్చి అడగడం ఇద్దరికీ గౌరవప్రదమైన విషయంకాదు. వెంటనే తెచ్చిఇస్తే బాగుంటుంది'' సారాంశం అది. రాసిన మాటనే మళ్ళీ, మళ్ళీ తిరగేసి, బోర్లేసి నిర్మొహమాటంగా రాసాడు ఆయన.

"ఇయ్యేడు బళ్ళారిలో పురుగుపడి పంటలు బాగా పండలేదు. పండినవాటికీ ధరలు లేవు. ఈ ఏడు మాకు పొలంలో బాగా దండగవచ్చింది. వచ్చే ఏడాదికి మగతా కట్టడానికి మాదగ్గర డబ్బులేదు. మాకు ఇవ్వవలసిన మగతా డబ్బు అంతా చూసిపెట్టవలసినది. ఎలాంటి పరిస్థితిలో కూడా మగతా డబ్బు అంతా ఇవ్వాలి. 10 రోజుల్లో నేను వచ్చి డబ్బు తీసుకుపోతాను. గట్టిగా అడుగుతున్నందుకు ఏమీ అనుకోవద్దు'' అని రాసాడు అంజయ్య తమ్ముడు రామయ్య.

"ఎట్ట చేద్దామయ్యా?" అన్నపూర్ణ వుత్తరాలు పెద్దగా చదివిన తరువాత ముందుగా తేరుకున్న రాజమ్మ అడిగింది.

"నాకేం పాలు బోవడంలేదు! ఈ గండాలు ఎట్ట తప్పించుకోవాలో ఏమో..."

సాయంత్రం దడి దగ్గరనించి అంజయ్య అప్పుడే వచ్చాడు.

"ఏంది అంజియ్యా, ముందటేడు తీసుకున్న బాకీ తీర్చకపోతివి. నిరుడు అడిగితే ఇయ్యేడు గట్టిగా తీరుస్తానంటివి''

"నిజమేనబ్బాయి .నారాయణా... కాలం ఎట్టుందీ?"

"కాలం ఎట్టున్నా అది నీకూ, నాకూ తెలిసిద్ది కానీ, అప్పు ఇచ్చిన బేంకివాళ్ళకి ఏం తెలిసిద్ది? వాళ్ళేమొ బాకీలు వసూలుచేయమని రోజూ మమ్మల్ని సతాయిస్తంట్రి! మేం పనీ, పాటా చేయకుండా తిని తిరుగుతున్నట్టుంది వాళ్ళకళ్ళకి!"

"గవరమెంటోడికి రైతు బాధలు ఏం తెలుస్తయ్? తెలిస్తే రైతులు ఇట్ట ఎందుకు ఉండబోతారు? 20 ఎకరాల పొలం వున్న రైతు కూడా ఇయ్యాల రెండేల రూపాయల ఉజ్జోగస్తుడితోటి సమానంగాకుండాపోయె!"

"సరే... నువ్వూ, మీ ఆడోళ్ళు ఇద్దరి పేర్ల మీదా లోన్లు తీసుకున్నారాయె! కనీసం ఇయ్యేటికి ఒక్క పేరుమీద బాకీ అయినా కట్టు. మళ్ళీ ఎంత నెలరోజుల్లోనే తిరిగి లోన్లు ఇస్తాం కదా! ఈసారి ఇసీల కర్చూ, తిరుగుడు కర్చూ ఏం వుండవాయె!"

"చేతిలో ఒక్క రూపాయి లేదు నారాయణా... ఎక్కడ తెచ్చి కట్టేది?"

"కడితే నీకే మంచిది అంజియ్యా. నువ్వు ఇయ్యేడు కట్టకపోతే కోర్టులో యేస్తారు. చాలా కర్చయ్యిద్ది. చివరికి అదంతా నీ నెత్తిమీద పడేదే!"

"సరే పడనియ్యి. చేసేదేముంది?"

"నీపేరు మీద వున్న బాకీ రద్దుచేసుకో అంజియ్యా! ఇయ్యేడు ఇంకా మూడు, నాలుగువేలు లోను ఎక్కువ చేస్తానుగా! నేను ఎట్టోకట్ట తంటాలుపడి నువ్వు వడ్డీతో కలిపి కట్టిన దానికంటే కూడా 2 వేలు ఎక్కువ వచ్చేటట్టు చేస్తా! వచ్చేసాలుకి నీకు పెట్టుబడికి దిగులూ, విచారమూ వుండదు. నా మాట విను!"

"సరే, చూద్దాం నారాయణా'' అన్నాడు అంజయ్య.

"మరచిపోవాకు. నీ మంచి కోరే చెపత

న్నా!" అంటూ అతను వెళ్ళిపోయాడు.

★ ★ ★

"ఏం రాజమ్మా బాగుండావా?" అంటూ పలకరించాడు లింగయ్య.

తలంటు స్నానం చేసి, బయట అరుగు మీద కూర్చుని జుట్టు చిక్కుతీసుకుంటున్న రాజమ్మ "ఏం బాగుంటంలే బాబా, ఏందీ పనిమీద వచ్చావు, ఎప్పుడూ ఇటు రానోడివి'' అంది.

"చిన్న మాట వుందమ్మాయి, లోపలికి పద" అంటూ ఇంట్లోకి వచ్చాడు లింగయ్య. అనుసరించింది రాజమ్మ.

"మా అమ్మాయ్ లక్ష్మి దగ్గరకి చందలూరు పోయి వచ్చానమ్మా! మీ శారదగారి ఇంటికి దగ్గరేగా, మా అమ్మాయి లక్ష్మివాళ్ళ ఇల్లుకూడా! శారద కూడా కనపడింది''

"అయితే అందరూ బాగున్నారంట బాబా?"

"బాగానే వున్నారమ్మా. శారద బంగారం ఏదో తీసుకుని మీరు బేంకిలో పెట్టుకున్నారంటగా! అమ్మాయ్ కనుక్కోమంది దాని యవారం"

"పత్తి ఇంకా అమ్మలేదు మామా'' అన్నాడు అప్పుడే వచ్చిన అంజయ్య.

"పత్తి అమ్మి ఆ అమ్మాయి బంగారం ఏదో ఆ అమ్మాయికి ఇయ్యండి అబ్బాయి. వాళ్ల ఇంటో రోజూ జాతరేనంట, శారద వెళ్లిన తరువాత లక్ష్మి చెప్పింది. రెండు మూడుసార్లు బంగారం తీసకరమ్మని బాగా కొట్టాడంట కూడా! మొన్నటి రేత్రి శారదని బైటికి నెట్టేసి తలుపుగెడియేసుకుంటే శారద బైట అరుగు మీదనే ఆ రేతిర అంతా పడుకుందంట అబ్బాయి. వాళ్లకాపరంలో చిచ్చు ఎందుకు రేపాలి? తొందరచేసి ఇయ్యి అబ్బాయి బంగారం" అని చెప్పి ఆయన వెళ్లిపోయాడు.

అంజయ్యకు ఆ మాటలు విన్న తరువాత కడుపులో దేవినట్టయింది. ఏడుపు వచ్చింది.

తన అవసరంకోసం, ఇబ్బందిలో వున్నానని తనకోసం బంగారం ఇచ్చి ఎన్ని కష్టాలు పడుతున్నది అనుకున్నాడు అంజయ్య. తను చాలా తెలివితక్కువ పనిచేసాడు. పత్తి అమ్మి, బంగారం ఆ అమ్మాయికి ఇచ్చి, తరువాత తమ తంటాలుఏవో తాము పడితే సరిపోయేది అనుకున్నాడు.

ఇక ఆలస్యం చేయకుండా వెంటనే పత్తి అమ్ముదామని నిశ్చయించుకున్నాడు అంజయ్య.

"ఏరా అంజియ్యా, ఈ యవారం విన్నావా?" అడిగాడు పక్కకొష్టం భీమయ్య. రోజూ సాయంకాలం పదినిముషాలు మాట్లాడుకుని కానీ వాళ్లు పడుకోరు
ఇద్దరూ మంచాలు పక్కపక్కనే వేసుకున్నారు.

"ఏందన్నా అది?"

"మనూరి ఎరువుల కొట్టోళ్లు అందరూ ఒక మటాకట్టేరంట్రా! అందరూ ఒక మాటమీద వుండి, ఒకరికాతావాళ్ల దగ్గర ఇంకొకరు పత్తి కొనకూడదని కట్టడి చేసుకున్నారంట!"

"అదేందన్నా, ఒకరంటే ఒకరు కారాలూ మిరియాలూ నూరుకునే నాయాళ్లు ఒక మాట మీద ఉండటం ఏందీ?"

"కాతావాళ్లు ఎవురూ పత్తి ఇయ్యడం లేదంట్రా! ఇంకో కొట్టువాడికి పత్తి అమ్ముకుని డబ్బులు తీసుకుంటున్నారు. మందులు తెచ్చుకున్న కొట్టోడికి ఎగనామం పెడతన్నారు. అందుకని అందరూ ఒక కట్టు మీద ఉన్నారంట్రా!"

"వాళ్లకి గొంతుదాకా పగలూ సెగలూ వున్నా అందరూ ఒక జాతివాళ్లు కదంటన్నా! ఒకరిని మించి ఒకరు కొంపలు ముంచేవాళ్లేనాయె అందరూ!"

"మరేందనుకున్నా? ఒక్కొక్కరు లక్షల్లక్షలు సంపాయించారంటే ఎంతమందిని నాశినం చేయకపోతే సంపాయించారు? ఈ మీద రేయింబవళ్లు చాకిరీ చేసుకుంటన్న మనం సంపాయించటం సంగతి దేవుడెరుగు, అప్పు

లూ వడ్డీలూ తీర్చేసరికే నడుములు యిరిగిపో తండే!"

అంజయ్య చెల్లెలు దిగులుతోనే పరధ్యా నంగా వున్నాడు.

ఇంటికి వెళ్లేసరికి శారద వచ్చి వుంది. ఆమెని చూడటంతోనే అంజయ్య గుండెల్లో రాయిపడింది.

"ఎంతసేపవుతుందమ్మా వచ్చి?"

"ఇప్పుడే అన్నా'' అంది. ముఖంలో కళా కాంతులూ లేవు. తలదువ్వుకుని ఎన్ని రోజులు అవుతున్నదో! మనిషి పీక్కుపోయింది. రోజూ అన్నం తింటున్నదో, లేదో!

"అందరూ బాగున్నారంటమ్మా?"

"ఆ" అంది పొడిగా. కొద్దిసేపాగి మళ్లీ తనే అంది, "పత్తి అమ్మకపొయ్యావంటన్నా?"

"అమ్ముదామని చూస్తున్నానమ్మాయి, ఊళ్లో కొట్టోళ్లు అందరూ ముటాకట్టారు'' వాళ్లు ముటాకట్టిన సంగతి అంతా చెప్పాడు అంజయ్య.

"ఎట్టోకట్ట అమ్మి బంగారం తీసకరా అన్నా! ఆయన బంగారం తీసకుని వస్తేనే ఇంటికి రమ్మన్నాడు!" అంటూ శారద వస్తు న్న ఏడుపుని బలవంతంగా దిగమింగుకుని కళ్లు తుడుచుకుంది.

శారదని బాగా కొట్టి పంపించాడని ఆమెని చూస్తేనే అర్థమైపోతున్నది.

"తొందరగా తీసి ఇస్తానమ్మా!" బాధతో అన్నాడు.

మరుసటి రోజు వుదయం సుబ్బారావు ఇంటికి మళ్లీ వెళ్లాడు అంజయ్య.

అప్పుడే ఆయన నిద్రలేచి మంచం మీద కూర్చుని సిగరెట్ తాగుతున్నాడు.

"సుబ్బరావు, మీరు పత్తి ఏమన్నా కొంట న్నారూ?"

"కొట్లో బాకీల వాళ్ల పత్తే కొంటన్నాం అంజియ్యా! వేరే కొట్లలో కాతాలవాళ్ల పత్తి కొంటంలేదు''

"సరే సుబ్బరావు... ఇప్పుడు నాకు గట్టిగా డబ్బు అవసరం వచ్చిందోయ్! నువ్వు కొనేరే టుకంటే పది రూపాయలు తక్కువ చేసి ఇస్తాకానీ నా పత్తి కొంటావా?"

"పది రూపాయలు తక్కువకి కాదు అంజి య్యా, నువ్వు కింటాళు వంద రూపాయలకి ఇచ్చినా కొనం. అట్టకొంటే, మేం నీ పత్తికి ఎంత డబ్బు ఇచ్చామో, అంత నువ్వు ఎవురి కొట్లో కాతాపెట్టావో వాళ్లకి జరిమానకట్టాలి!"

"చాలా ఇబ్బంది వచ్చి అడుగుతున్నా సుబ్బరావు''

"కుదరదు. ఎందుకొచ్చిన మాటలు!"

అంజయ్య ఇక మాట్లాడకుండా నిరాశగా ఇంటికి వచ్చాడు. అంజయ్య ఇంటికి వచ్చిన గంటలోపే వెంకట్రామయ్య కోపంగా వచ్చా డు.

అప్పటికప్పుడే సుబ్బారావు కబురు చేసాడ న్న మాట!

"ఏరా అంజియ్యా, పత్తి అమ్ముతానని సుబ్బరావు దగ్గరకి పొయ్యావంటగా! నువ్వు కొట్టోవడ్డీతో 22 వేలు ఇయ్యాల్సి వచ్చావు. మా దగ్గర మందులు తీసుకుని వాడికి పత్తి ఎట్ట అమ్ముదామని పొయ్యావురా?"

"గొంతుమీదకు వచ్చి కూర్చుందన్నా ఇబ్బంది. డబ్బు గట్టిగా అవసరమైపొయ్యా ను''

"పత్తి ఇయ్యాల బూరేలు తొక్కు. నీకు కొద్దో, గొప్పో డబ్బు అవసరమైతే నేను ఇస్తా. కింటాళు 4 వందలు చేసి కొంటున్నాం"

"పత్తి మొత్తం యేస్తానుకానీ, ఎంత ఇస్తా డబ్బులు''

"నీకు ఎంత కావాలేంది?"

"పదివేలు కావాలన్నా!"

"ఎన్ని కింటాల్లు అయిద్దిరా నీ పత్తి?"

"50 కింటాల్లు అయిద్దన్నా!" కాస్త ఎక్కువే చెప్పాడు అంజయ్య.

"ఏభై కింటాల్ల పత్తి అయితే ఇరవయ్యేలు వస్తయి. నువ్వుకొట్టో 22 యేలు బాకీపడ్డావు. సరే, రెండేలు రొక్కం ఇస్తా. కొరవ బాకీకీ, ఈ రొక్కానికీ కలిపి రెండు రూపాయల వడ్డీతో నోటు రాసియ్యి'' అన్నాడు వెంకట్రామయ్య.

"పదివేలు కావాలన్నా! నేను మా చెల్లెలు దగ్గర బంగారం తీసుకుంటే, వాళ్లాయన బంగారం తీసుకుని వస్తేనే గడపతొక్కమన్నా డంట! అమ్మాయి కాపరంతో కూడుకున్న యవారమన్నా!" బతిమలాడుతున్న ధోరణిలో చెప్పాడు అంజయ్య.

"నిజమేరా, అందరి సొమ్మూ అసుంటిదే! నేను నా కూతురికి పెళ్లి చెయ్యాలి. ఐదారు లక్షలు కట్నం అడుగుతున్నారు. ఎవురి కష్టాలు ఎవురు తీరుస్తారు?"

"పదివేలు ఇయ్యన్నా! పండిన పత్తిమొత్తం మీకే వేస్తన్నాం కదా?"

"రెండేలు కంటే దమ్మిడీ ఎక్కువియ్య నురా! అప్పటికీ నాలుగేలు బాకీ వుంటావు. ఈ బాకీ ఇంక నువ్వు ఎట్టతీరుస్తా? పొలం మీద వచ్చే అవాజు కూడా ఏం లేదుకదరా!"

"అది కాదన్నా..."

"ఏది కాదురా? నీ అవసరాలకి అంటే పోనీలే అని కొద్దో గొప్పో డబ్బు సర్దుతాకానీ నీ బాకీలు తీర్చుకోవటానికి కూడ డబ్బు ఇస్తానా ఏంది?"

అంజయ్య మౌనంగా వున్నాడు.

"ఇంతకీ సందకాడ తొక్కుతావా లేదా బూరేలు?"

"రేటు పెరిగిద్దేమొ రెండు రోజులు చూస్తా అన్నా!"

"నీ ఇష్టం పోయినసారి ఐదు వందలకి అడిగినప్పుడు ఇట్నే చూస్తానన్నావు. ఇప్పుడు నాలుగు వందలకి వచ్చింది. నువ్వు ఎప్పుడైనా సరే పత్తి నాకు అమ్మాల్సిందే. నీ ఇష్టం వచ్చినన్ని రోజులు చూడు'' అంటూ వెంకట్రామయ్య విసురుగా వెళ్లిపోయాడు.

★ ★ ★

"మనూరి యెంకటప్ప మనవడు 460 చేసి పత్తి కొంటన్నాడే, ఏద్దామూ?" రెండు రోజుల తరువాత అంజయ్య అడిగాడు భార్యని.

"ఎంకటప్ప ఏ ఎంకటప్ప?"

"బుఱ్ఱ కతల ఎంకటప్ప మనవడే! ఆయన కొడుకు నరసరావుపేటలో వైజ్యం చేస్తన్నాడ్లే! వాళ్లు ఆ పేటకి పోయి 30 ఏళ్లయ్యింది. వాడి కొడుకు చిలకలూరిపేటలో పత్తిమిల్లు కట్టించా డంట. వాడుకొంటన్నాడే 460 చేసి''

"నిన్న కూడా ఎవురో కొన్నారయ్యా పత్తి తూరుపు బజారున లారీ ఎత్తుతుంటే చూశా ను''

"ఎంకటప్ప మనవడేనే ఆ లారీ కొన్నది. ఒకటికాదు, మనూళ్లోనే ఇప్పటికి రెండు లారీ లు కొన్నాడంట!"

"బోకరు ఎవురూ?"

"తూరుపు బజారు ప్రకాశం అంట! ఇప్పు డు వాళ్ల బజార్నే రెండు లారీలు పత్తియేసా రు''

"ప్రకాశంగాడు దొంగముకమోడు కద య్యా, వాడిని నమ్మి ఎట్టఇస్తాం పత్తి''

"ఎంకటప్ప మనవడు అసలు డబ్బు కూడా ఇచ్చేవాడు కాదంట కదబాబా! అదేదో వూళ్లో ఇట్నే ఆరేడు లారీలు పత్తికొని అందరికీ ఎగేసాడంటగా!" అంది అన్నపూర్ణ.

"ఎవురన్నారమ్మాయి, అన్నీ వుత్తకూతలే! పత్తికొని డబ్బులియ్యకుండా ఎగేస్తే వూరు కుంటారూ?"

"మనకి ఆ యవారాలన్నీ ఎందుకుకానీ... పది రూపాయలుకాదు, ఇరవై రూపాయల చవక్కే డబ్బు కట్టి తీసుకు పొమ్మనయ్యా మన పత్తిని. ధర ఎక్కువని అప్పు ఇస్తే వాడు ఎప్పుడు ఇస్తాడో? అప్పటిదాకా శారద వుండి ద్దా? పక్కన ఆ అమ్మాయి ఎంత బాధపడ తంది!" అంది రాజమ్మ.

అంజయ్య బజారుకి వెళ్లాడు. బజారులో

యల్లారావు కనిపించాడు.

"పత్తి ఇంక అమ్మలేదుగారా యల్లారావు? ఏ కొట్టోనూ నీకు బాకీ లేదాయె! ఏదో ఒక కొట్టోడికి రొక్కానికే అమ్మకపొయ్యావు!"

"ఎక్కడ మామా! మనూరి కొట్టోళ్లంతా నీలకుక్కలికి కొనాలని చూస్తంట్రి! ఎంకటప్ప మనవడు ఎక్కువ ధరపెట్టి కొంటన్నాడు. వాడికి అమ్ముదామనుకుంటన్నా''

"రొక్కానికి నేనూ వాడికే అమ్ముదామను కుంటన్నారా! ప్రకాశం గాడంటగా బోకరు. కనుక్కుందాం పద"

పది రోజులక్రితం యల్లారావు చేలో కనపడి మాటల సందర్భంలో ఏడ్చిన విషయంగుర్తొచ్చింది అంజయ్యకు. బేంకిలో వున్న డబ్బులు 25 వేలు తీసుకవచ్చి, ఈ ఏడాది పత్తిలో పెట్టి పోగొట్టుకున్నానని అంత మనిషి నోటికి కండవ అడ్డం పెట్టుకుని వెక్కివెక్కి ఏడ్చాడు.

అతన్ని సముదాయించలేక అంజయ్య పని సతమతమైపోయింది. యల్లారావు బాంకులో వున్న డబ్బు పోగొట్టుకున్నాడే కానీ అతనికి అప్పులు కూడాలేవు.

"యార్డోళ్లు ఇయ్యేడు ఎందుకనిరా పత్తికొనంది?"

"ఏమో మామా, మనకేం తెలుసు? మొదట్లో రెండు రోజులు కొన్నారు. వాళ్లు కొంటున్నారని చెప్పి ఎంకటేశుల్లు, సుబ్బన్న వాళ్లు యార్డుకి పత్తి తోలకపొయ్యారు. వాళ్లు యార్డులో పత్తిపెట్టి కూడా నెల రోజులు అయింది. అసలు అక్కడ పత్తి యవారం పట్టిచ్చుకునేవాడే లేడంట. ఇక్కడ ఎవరూ కొనకపోతంట్రి!"

"పంటాలేకపోయె, పండిన ఆ కాస్త పత్తిని కూడా అమ్ముకోవటం కుదరక పోతండే!"

వీళ్లు మాట్లాడుకుంటూ ప్రకాశం ఇంటికి వెళ్లారు. ఇంట్లో అడిగితే అతను లేడని చెప్పారు. చిలకలూరిపేట వెళ్లాడనీ, మరుసటి రోజు వుదయం వస్తాడనీ చెప్పారు.



వెళ్లినవాళ్లు వెనక్కి వచ్చారు.

★ ★ ★

మరుసటిరోజు వుదయం ప్రకాశం, మరొకతను అంజయ్య ఇంటికి వచ్చారు. రెండో అతని పేరు రామయ్య.

"ఏంది అంజియ్యా, నిన్న నాకోసం వచ్చావంట ఏందీ?" అడిగాడు ప్రకాశం.

అంజయ్యవాళ్ల ఇంటికి ఎందుకు వెళ్లాడో అతనికి తెలుసు. అయినా అడిగాడు.

"ఎంకటప్ప మనవడు పత్తి కొంటన్నాడంటగా! బోకరు నువ్వు అని చెబితే కనుక్కుందామని వచ్చాను''

"బోకరు ఏం బోకర్లే అంజియ్యా! రైతుల పత్తిమీద ఎరువుల కొట్లవాళ్ల పెత్తనం ఏందీ? వాళ్లకి బాకీ ఇయ్యాల్సుంటే ఇస్తాం. మీరు పత్తి ఇంకొకడికి అమ్మకూడదు, మాకే అమ్మాలని వాళ్ల రూలేందీ? మిల్లువాళ్లు ఎవరైనా పత్తి కొంటారేమొ అని వీళ్ల మీద పందెంతోటి పేటపోయా! అక్కడ బాబు తటస్తపడ్డాడు.



పత్తి కొంటాం అన్నాడు. మనూరి ఎంకటప్ప మనవడేనాయె! మనిషి నమ్మకస్తుడు. తీసుకొచ్చా'' ఏకధాటీగా చెప్పాడు ప్రకాశం.

"ఎంతరేటు చేసి కొంటన్నారు?"

"460 చేసి కొంటన్నాం అంజియ్యా! మనూరి కొట్టోళ్లు నాలుగు వందలేగా! చూడు, ధరలోనే ఎంత కాజేస్తన్నారో! వీళ్లదంతా నిలువుదోపిడియే! బాబు డబ్బు మాత్రం 15 రోజులకి ఇస్తాడు''

"సరే ప్రకాశం, నాకు డబ్బు అవసరం. నాది 50 కింటాళ్ల పత్తివుండే! ఏ క్లాసు పత్తి 450 చేసి ఇస్తా, 50 కింటాళ్ల మీద మీకే 5 వందలు లాభం. కాటాల మీదనే డబ్బు కడతాడూ?"

'కష్టం అంజియ్యా! నిన్న మా ముందే బొంబాయి సేట్లకి పత్తిలాట్లు అమ్మేడు. వాళ్లు పది లక్షలకి చెక్కులు ఇచ్చారు. ఆ చెక్కులు మారడానికి 10, 15 రోజులు పట్టిద్దంట! డబ్బు మాత్రం ఎక్కడికీ పోదు అంజియ్యా!"

"మాకు డబ్బు అవసరం ప్రకాశం. పది కాదు ఇంకో పది తగ్గిచ్చి అయినా రొక్కానికే అమ్ముతాం. అప్పు ఇవ్వం. అప్పు ఇచ్చి వాళ్ల చుట్టూ తిరిగి ఎక్కడ తంటాలు పడేది?" అంది వాకిట్లో కూర్చుని వున్న రాజమ్మ.

"వాళ్ల చుట్టూ తిరగాల్సిన పనిలేదు రాజమ్మా! 15 రోజులు అంటే అనుకున్నటయానికి కరెక్టుగా ఇయ్యడమే!" అన్నాడు ప్రకాశం.

"అసలు ఇయ్యాల రొక్కానికి ఎవురు కొంటున్నారు రాజమ్మా! బాబు నయం, 15 రోజులే సైటు. ఒక్కో వూళ్లో అయితే నెలా, రెండు నెలలు సైటు'' అన్నాడు రామయ్య, ప్రకాశంతో వచ్చినతను.

"ఇయ్యాల కాకపోతే రేపైనా ఎవరో ఒకరు వచ్చి రొక్కానికి కొనసరంటవే!" రాజమ్మ అంది.

"రోజు రోజుకీ ధరలు తగ్గిపోతండే! రెండు

నెల్లనాడు 550 వున్న పత్తి ఇయ్యాల 460కి వచ్చే! అదీ ఎవురూ గట్టిగా కొనకపోతండే! రేపు అని చూడకుండా అమ్మి పారేయడమే మంచిది రాజమ్మా!"

"బాబు ఎప్పుడు వస్తాడు?" అడిగాడు అంజయ్యా.

"రేపు వస్తాడు. నేను కూడా బాబుకి కొంత డబ్బు మీకు ముందు కట్టమని చెపతాను అంజియ్యా! మరి నువ్వు ఏస్తావుగా పత్తి. ఏవైనమూ ఫోను చేస్తే లారీ వచ్చిద్ది''

"తొందరేముందిలే, బాబుని రానియ్యి మాట్టాడదాం"

"సరే, మేమొస్తాం. ఇంకా పత్తి అమ్మలేదూ, ఇంటోనే వుందనుకుని కాటావెయ్యి అంజియ్యా! 15 రోజులంటే ఎంతలో తిరిగొస్తాయ్? రేటూ మంచిరేటూ, కొనే పార్టీ మంచి పార్టీ!" అని రామయ్యా, ప్రకాశం వెళ్లిపోయారు.

"బాబుతోటి ఏంది నువ్వు మాట్టాడేది? ఈ రోజుల్లో ఎవుర్నీ నమ్మడానికి వీల్లేదు. అప్పుగా పత్తి ఇచ్చే పనేలేదు'' అంది రాజమ్మ.

"అప్పుగా ఎవురు ఇస్తామన్నారు. డబ్బు ఇచ్చి కొంటాడేమో!"

"ప్రకాశంగాడూ, ఈ రామయ్యగాడూ నాబోకర్లు! దొంగసచ్చినోళ్లు. బస్టాండులో జేబులు కొట్టేవాళ్లు. ఇంకెవరూ దొరకలేదుగామాలి వాడికి'' అంది రాజమ్మ.

★ ★ ★

అంజయ్యా పశువులకు మేత అయిపోయింది. అంతకుముందు ఏడాది వేసుకున్న మేత వామినే జాగ్రత్తగా మేపాడు. ఉన్న మేత వారం రోజుల్లో అయిపోతుంది.

పమిడిపాడు నించి 6-10 మైళ్లలో ఈదుమూడి, చింతగుంపల; తిమ్మసముద్రం అనే వూళ్లు వున్నాయి. ఆ వూళ్ల భూములు మాగాణియే. ఎండాకాలం వచ్చిందంటే రైతులు అక్కడనించి వరిగడ్డి కొనుక్కొచ్చి వాములు వేసుకుంటారు.

వానలు పడి మళ్ళీ పొలాల్లో మేత ఎదపెట్టుకునేవరకూ పశువులకు అదే మేత.

డబ్బు వెసులుబాటు ఉన్నవాళ్ళందరూ ట్రాక్టర్ల మీదా, బండ్లమీదా వరిగడ్డి తోలుకువచ్చి వాములు కూడా వేసుకున్నారు. అంజయ్యా లాంటి రైతులు కొంతమంది మిగిలారు.

డబ్బులేకే అంజయ్యా వూరుకున్నాడు. డబ్బువుంటే అంజయ్యా ఎప్పుడో వామి వేసుకుని వుండేవాడు. ఏ అదునులో పని ఆ అదునులో అంజయ్యా చక్కగా చేసుకుంటాడు.

హనుమంతరావు గుంటూరు నుంచి డబ్బు పంపించమని వుత్తరం రాసాడు. రెండు నెలల మెస్ బిల్లులు కట్టాలనీ, మెస్ వోనర్ అడుగుతున్నాడనీ రాసాడు.



అంజయ్యా ఉదయం అన్నం తింటూ వుంటే ఐదారుగురు సన్నకారు రైతులూ, బాబూ, ప్రకాశం వచ్చారు.

"పేటనించి కారు యేసుకుని బాబు వచ్చేడు అంజియ్యా! నీ పత్తి యవారమేందో చెప్పు?" అన్నాడు ప్రకాశం.

"కూర్చోండి కూర్చోండి'' అంజయ్యా మర్యాద చేశాడు.

వాల్చి ఉన్న మంచాలమీద అందరూ కూర్చున్నారు. బాబుకి 25 ఏళ్ళ వయస్సు

వుంటుంది. మల్లెపూవులాంటి తెల్లషర్టూ, ప్యాంటూ వేసుకుని నల్లకళ్ళజోడు పెట్టుకున్నాడు.

అంజయ్య అన్నం తిని వచ్చాడు. "ఏంద బ్బాయి, ఎంతచేసి కొంటన్నారు?"

"460 చేసి కొంటున్నామండీ. కేశ్ 15 రోజులకి ఇత్తాం"

"రొక్కం అయితే ఎంత చేసి కొంటన్నారు?"

"రొక్కానికి కొంటం లేదండీ! ఇయ్యాల ఐదో తారీకు కదూ! ఈ నెల ఇరవయ్యో తేదీన నేనే కేశ్ తీసుకొచ్చి పంచేత్తాను. మీరు పేట కూడా రావాల్సిన పనిలేదు'' అన్నాడు బాబు. మనిషి బట్టల అందమే కానీ, మాటల అందంలేదు.

"మాకు అవసరమండీ డబ్బులు. రొక్కానికి పాతిక రూపాయలు తగ్గిచ్చే తీసుకొండి''

"అసలు రొక్కానికి కొంటం లేదుగా మేము. అప్పు బేరమే!" అన్నాడు అతను.

"మేం గూడా అప్పుకే ఇస్తన్నాం అంజియ్యా! మందుల కొట్టోళ్ళు 4 వందలు చేసేగా కొనడం! వీళ్ళు 460. ఇంటికి వచ్చిన అదృష్టాన్ని ఎందుకు కాలదన్నుకోవాలి?" అన్నాడు ఒక రైతు.

"ఇయ్యాల 3 లారీలు పత్తి యేస్తన్నాం. 15 రోజులంటే ఎంతలో వస్తయ్యి? బయపడకుండా వెయ్యి అంజియ్యా!" అన్నాడు ప్రకాశం.

"ధర రోజురోజుకీ తగ్గిపోతండే. పత్తికి తూకం కూడా తగ్గిపోయిద్దాయె! తెచ్చిన అప్పులమీద వడ్డీలూ పడతండే! ఎందుకు వచ్చిన బాధ, అమ్మి పారేస్తే పోయె!" అన్నాడు మరో రైతు.

"శీనయ్య కూడా తొక్కుతున్నాడు పత్తి. అంత ఆసామి ధైర్యం చేసి తొక్కుతుంటే మనం బయపడేది ఎందుకు అంజియ్యా!" అన్నాడు మూడో రైతు.

అంజయ్యకు ఆలోచించే అవకాశం కూడా కలగనివ్వకుండా ఆ రైతులు మాట్లాడారు.

"అయితే 15 రోజుల్లో ఇస్తావంట అబ్బాయి డబ్బులు?" అంజయ్య అడిగాడు మరోసారి.

"20వ తారీక్కి తెచ్చిస్తానండీ! హరిహరాదులు అడ్డం వచ్చినా అనుకున్నటయానికి ఒక రోజు ముందే ఇత్తాకానీ, యెనక ఇయ్యను. చెప్పేదేదో ఒకరోజు ఆలిస్యంగానే చెపతా!" అన్నాడు బాబు.

అంతమంది మగవాళ్లముందు మాట్లాడటం బాగుండదని రాజమ్మ ఇంట్లో వుండి అంజయ్యని లోపలికి రమ్మని కళ్ళతో సైగచేస్తోంది. అంజయ్య చూసి కూడా వెళ్ళకుండా మాట్లాడుతున్నాడు.

"కాళీ బూరేలు కావాలంటే మా ఇంటో వున్నయ్యి తీసకపో అంజియ్యా లంబాడోళ్ళు మా ఇంటో వేశారు వచ్చినోళ్ళకి అమ్మమని'' అన్నాడు ఒక రైతు.

"ఇయ్యాలే తొక్కు అంజియ్యా బూరేలు'' చెప్పాడు ప్రకాశం.

"సరే" తలవూపాడు అంజయ్య.

అందరూ వెళ్ళిపోయారు.

"అది కాదయ్యా, అప్పు ఇయ్యొద్దనుకున్నాంగా! తొక్కుతానని ఎందుకు చెప్పా బూరేలు!" వాళ్ళు అటు వెళ్ళిన వెంటనే రాజమ్మ అడిగింది.

"డబ్బు ఇచ్చేవాళ్ళేనే వీళ్ళు. ఎగేసే వాడయితే వాడు వస్తాడా, బోకర్లని పంపిస్తాడు కానీ..."

"వాడు ఇచ్చినా, ఎగేసినా ఎందుకొచ్చిన బాధ? పక్కన శారద వచ్చి ఎన్ని రోజులవతంది? ఆ అమ్మాయి జీవితంతో కూడుకున్న యవారం!"

"రొక్కానికి ఎవుడన్నా కొంటంటే ఎప్పుడో అమ్మేసేవాడ్ని. రొక్కానికి ఎవురూ అడగకపోతండే! మనమే కాదు, ఊళ్ళో చాలామంది వాడికి పత్తి అమ్ముతున్నారుగా?"

"ఒకరితోటి మనకేం పని? మనం మాత్రం

వాడికియ్యొద్దు పత్తి''

"ఊళ్ళో అందరూ అమ్ముతున్నారే వాడికి, వాడు ఇచ్చేవోడేనే తల్లీ! ఆడోళ్ళకి అనుమానం జాస్తి అంటారు ఇదే!" విసుక్కుంటూ అన్నాడు అంజయ్య.

ఇంతలో వెంకట్రామయ్య వచ్చాడు.

"ఏరా అంజియ్యా, ఏందీ యవారం? బాబుగాడు మీ ఇంటికొచ్చి పోతన్నాడేంది? వాడిగ్గానీ పత్తి అమ్ముతున్నావెట్టా?"

"తొక్కుతున్నా అన్నా బూరేలు. 460 అంట రేటు!"

"460 చేసి కొంటాడు, 560 చేసి కొంటాడూ! వాడిదేంపోయింది? వాడు అసలు ఇచ్చేవోడే నంట్రా? ఇయ్యాల పత్తిరేటు 380 కంటే ఎక్కువలేదు. వాడికి మీసాలూ, గడ్డాలూ రాకపోయినా నిలువునా ముంచుతున్నాడు. మంగమూరులో నిరుడు కొని పైసా ఇయ్యలా!"

"నీకు తెల్సంటన్నా ఇచ్చిందీ, లేందీ! మంగమూరు వాళ్ళ అత్తగారివూరు! ఆ వూరి రైతులు ఎసుమంటోళ్ళు? ఈడు పైసా ఎగేసినా నిలువునా నరికి ఉప్పుపాతర పెడతారు. అంత పొగురుబోతోళ్ళు ఆ వూరి రైతులు! నీకు పత్తి ఇయ్యటంలేదని మాట్టాడితే ఎట్టన్నా?" రాజమ్మమీద కోపాన్ని కూడా వెంకట్రామయ్య మీద చూపెట్టాడు అంజయ్య

"నాకు నువ్వు పత్తి ఇస్తే ఎంతా, ఇయ్యకపోతే ఎంతరా? నాకొట్టో కట్టాల్సిన బాకీ కట్టు. నువ్వు ఎవుడికి పత్తి ఇచ్చుకుంటే నాకెందుకు''

"డబ్బులు రానియ్యి ఇస్తా!"

"డబ్బులు వచ్చేది ఎప్పుడూ, నువ్విచ్చేది ఎప్పుడ్రా? పలానా రోజున ఇస్తానని చెప్పు, ఆ రోజున వస్తా!"

"15 రోజులు ఆగన్నా ఇస్తాను''

"నాకేం బాధలేదు ఆగుతా! 15 రోజుల తరువాత నువ్వు ఇయ్యకపొయ్యావంటే బాగుండదు. నీ ఇష్టం ఏమనుకుంటున్నావో!"

"ఇస్తా అన్నా!" వినయంగా అన్నాడు అంజయ్య.

"బాబు నిజంగా డబ్బులు ఇయ్యడంట మావయ్యా?" తన అనుమానాన్ని ధృఢంచేసుకోవడానికి రాజమ్మ అడిగింది.

"వాడు ఇయ్యడమ్మాయి. మేము నిజం చెబితే మా మాట వినరుగా మీరు! దిగితేకానీ లోతు తెలియదు. ఇట్ట మార్కెట్టులో ఎంత మందిని చూట్టంలేదు మేము పత్తి కొని డబ్బి ఇయ్యకుండా ఎగేసేవాళ్ళని. వాళ్ళని ఎవరేంచేస్తారు?"

"ఊళ్ళో అందరూ తెలివితక్కువవాళ్ళయి ఇస్తన్నారంటన్నా?"

"ఎవురు ఎట్ట చస్తే మాకెందుకురా! మాకు మాత్రం నువ్వు 15 రోజుల్లో డబ్బులు ఇయ్యి'' అంటూ వెళ్ళిపోయాడు వెంకట్రామయ్య.

"వీడికి పత్తి ఇయ్యలేదని ఏడుపంతా!" అని అంజయ్య బయటకు పోయాడు. రాజమ్మ పిలుస్తున్నా ఆగకుండా వెళ్ళిపోయాడు.

రాజమ్మ మాట తీసివేయవలసిన మాట కాదనుకున్నాడు అంజయ్య. ఇంకా ఇద్దరు ముగ్గురు సలహా తీసుకోవడం మంచిదనుకున్నాడు. అతనితో స్నేహంగా ఉండే యల్లారావు ఇంటికి వెళ్ళాడు.

యల్లారావు బూరేలు తొక్కుతూన్నాడు.

"ఏందిరా యల్లారావు, బాబు డబ్బు ఇచ్చేవోడు కాదని అంటన్నారేందిరా?"

"వాడంటే గిట్టని పుకారు మామా. మనూరి మందులకొట్టోళ్ళకి ఎవురూ పత్తి ఇయ్యడంలేదు. నాయాళ్ళకి బాకీలు వసూలుగాక ఈ పుకారు పుట్టిచ్చారు. శీనయ్యది లక్షరూపాల పత్తి. బాబుకి అమ్ముతున్నాడు. శీనయ్య అంత తేలికగా చిక్కుతాడంట మామా?"

"ఎట్ట చచ్చేటట్టురా, ఇంటో ఆడోళ్ళేమొ వాడికి పత్తి ఇయ్యొద్దని గోల! అయినా శీనయ్యాగారింటికి పోయొస్తా, ఏమంటాడో!"

అంటూ శీనయ్యగారింటికి వెళ్ళాడు.

శీనయ్య బయట అరుగుమీద చుట్ట తాగుతూ కూర్చుని ఉన్నాడు. ఇంట్లో మాదిగవాళ్ళు బూరేలు తొక్కుతూ, తొక్కిన బూరేల్ని బయటకు దొర్లిస్తున్నారు. అంజయ్య ఆయనతో తన సందేహం వెలిబుచ్చాడు.

"డబ్బులు ఎగేస్తే ఊరుకుంటారంట్రా? పదిహేను రోజులు అన్నది ఇంకొక పది రోజులు ఆలిస్సెం అయిద్దేమొకానీ, అసలు ఎగేస్తాడా?" అన్నాడు శీనయ్య.

"ఎగేస్తాడని వూళ్ళో కొందరు అంటన్నారు శీనయ్యా!"

"కొంతమంది అంటన్నారు, కొంతమంది వాడికి పత్తి తొక్కుతున్నారు. ఎట్ట జరగాల్సి ఉంటే అట్ట జరిగిద్ది. పైన బగమంతుడున్నాడు!" అని ఆయన వేదాంతం చెప్పాడు.

"నేను బూరేలు తొక్కాలో, మానుకోవాలో అర్థంకావడంలేదు''

"అది నీ ఇష్టంరా, ఒకరు చెప్పే యవారం కాదు''

ఆయన కర్రా విరక్కుండా, పామూ చావకుండా చెప్పటంతో అంజయ్య ఇంటిదారి పట్టాడు. దార్లో ప్రకాశం ఎదురువచ్చాడు.

"నేను మీ ఇంటికే పోయి వస్తన్నా, ఏందీ బూరేలు తొక్కడంలేదు? ఊళ్ళో అందరూ తొక్కుతున్నారు''

"ఇంటో ఆడాళ్ళు పడనియ్యడంలేదు ప్రకాశం"

"ఆడవాళ్ళ మాటలకేంలే, వాళ్ళకేం తెలుసు? మంచి ధరా, మంచి చాన్సయితే! పత్తికి ఇయ్యాల మార్కెట్ ఎంత ఉందీ? 4 వందల కంటే ఎక్కువ లేదు. బాబు మాట అన్నాడు కాబట్టి కొనడమే!"

"డబ్బులు అనుమానం అంటున్నారూ..."

"పుకార్లని నువ్వు నమ్మవాకు. నీకెందుకు, నీకు డబ్బు తెచ్చి ఇచ్చే పూచీ నాది. 2వ తారీక్కి నీ ఇంటికి డబ్బు తెచ్చిస్తాపో!" అన్నాడు ప్రకాశం.

అంజయ్యకి నమ్మకం కుదిరింది. నేరుగా పల్లెలోనికి పోయాడు.

"ఒరేయ్ పోలుగా... పత్తి బూరేలు తొక్కాలిరా. నువ్వూ, నీ పెళ్ళాం, ఇంకో మడిసి రండి. మొత్తం ముగ్గురు చాలు!"

"ఎప్పుడు తొక్కాలి బాబా బూరేలు?" అడిగాడు పోలయ్య.

"ఇయ్యాలే తొక్కాలిరా, కానిచ్చిరండి'' అని అంజయ్య వచ్చాడు.

★ ★ ★

"బూరేలు తొక్కే వూపులో వున్నాడమ్మాయి మీ అన్న. నా మాట ఇనిపిచ్చుకునేటట్టు లేదు. నువ్వు వప్పుకోవద్దు శారదా! నాలుగు రోజులు ఆలస్యమయినా డబ్బులు చేతిలో కట్టేవాడికే పత్తి అమ్ముకుని, నీ బంగారం తీసకపోవచ్చు!" శారదతో చెప్పింది రాజమ్మ.

"నా మాట వింటాడంట వదినా! రేపు ధర తగ్గినా, ఒకాళ కొనేవాళ్ళు ఎవురూ రాకపోయి నా నింద నామీదకు వచ్చిద్ది. మీరే ఎట్టోకట్ట తంటాలు పడండి. తొందరగా నా బంగారం తీసుకవచ్చి ఇస్తే మా వూరు పోతా!"

"పత్తి మన ఇంటిలోనించి పోతే డబ్బు రావటం గడ్డు అమ్మాయి! తరువాత నువ్వు కూడా ఇబ్బంది పడతావు. మీ అన్నకి నువ్వు కూడా చెప్పి చూడు''

"సరే' అని తలకాయ ఊపింది శారద.

"పత్తి అమ్ముతున్నావంట?" అంజయ్య వచ్చిన తరువాత శారద అడిగింది.

"అమ్మిపారేస్తన్నానమ్మాయి. ఎందుకు ఇంటో అడ్డంగా! ఇసుగుపుట్టిపోయింది, కొనేవాడు ఎవుడూ రాకపోతండే!"

"ఏమో అన్నా, వాడు ఇచ్చినా, ఇయ్యకపోయినా నాకుమాత్రం డబ్బులు తొందరగా చూడాలి. నీ అవసరంకోసం ఇచ్చి చూడు, ఇయ్యాల నాపని ఏమయ్యిందో! ఎందుకు నాకీ తిప్పలు?" అంది శారద. అంతకుమించి

ఆ అమ్మాయికి ఏం మాట్లాడాలో అర్థంకాలేదు.

"నీకోసమేనమ్మాయి పత్తి అమ్మడం. ముందు నీ బంగారం తెచ్చి ఇచ్చామంటే మాకు సగంబరువు పోయిద్ది. మా అవస రంకోసం బంగారం తీసుకుని నీకాపరంలో నిప్పులు కుమ్మరించామనే నింద మాకెందుకు రావాల! ఉన్నన్నిరోజులు ఉన్నావు, ఇంకా 15 రోజులు ఓపికపట్టు, నీ బంగారం తెచ్చి ఇస్తా!"

శారద ఇక ఏమీ మాట్లాడలేదు. కొద్దిసేపు కూర్చొని మనసంతా చిరాకుగా ఉండటంతో పొరుగింటికి వెళ్ళింది.

పోలయ్య వచ్చాడు.

"మిగతావోళ్ళేర్రా?" అడిగాడు అంజయ్య.

"యెనక వస్తన్నారు బాబా''

"సరే పా, రామయ్యగారింటికి పోయి ఖాళీ బూరేలు వున్నయ్యంటగనా తీసకవద్దాం" అని అంజయ్య పోలయ్యాని తీసుకుని వెళ్ళాడు.

అంజయ్య ఎవరి మాటా ఆలకించే స్థితిలో లేడు. రాజమ్మకి ఏం చేయాలో తోచలేదు.

"మామ బూరేలు తొక్కడానికి రమ్మన్నా డు అప్పా!" అంటూ పోలయ్య భార్యా, మరో ఆడమనిషీ వచ్చారు.

ఈ ప్రాంతంలో మాదిగలు రైతుల్ని పేరుతో పిలవరు. ఏదో ఒక వరసతోనే సహజంగా పిలుస్తుంటారు.

పోలయ్యా, అంజయ్యా నెత్తిమీద చెరి 20 ఖాళీ బూరేల్ని పెట్టుకుని తీసుకువచ్చారు.

బూరేలు తొక్కడానికి ముందు వాటిని తాడుతో కట్టేపని ప్రారంభించాడు అంజయ్య.

"అది గాదయ్యా... ఎందుకు నీకీ పెద ద్దరం! ఇంటోవాళ్ళ మాట యినవా?" రాజమ్మ భర్తని నిలదీసింది.

"ఏందే యినేది? ఊళ్ళోవాళ్ళంతా యెర్రోళ ళ్ళయి వాడికి పత్తి అమ్ముతున్నారా? శీనయ్యాది 170 కింటాళ్ళ పత్తి మండె! తొక్కుతున్నాడు పోయి చూడు''

"ఒకరితోటి మనకెందుకు? మనం అమ్మొ ద్దనసామో అంటే అమ్ముతానంటే యట్ట? నేను చావనైనా చస్తానుకానీ, పత్తిమాత్రం తొక్కడాని కి వొప్పుకోను'' అని అంజయ్య చేస్తున్న పనికి అడ్డంపోయింది.

"అగోరించావుగానీ ముందు అడ్డంలే!" తా డుతో బూరెం కడుతున్న అంజయ్య భార్యని విసుక్కుంటూ పక్కకు నెట్టాడు.

రాజమ్మ కదల్లేదు. మౌనంగా ఆయన్ని పనిచెయ్యనియ్యకుండా అడ్డంగా నిలబడింది.

"ఏందే, చెపతంటే నీక్కాదూ? పిచ్చె క్కిందేంది! లే, ముందు అడ్డంలేవే... ఏందే నీ పెడద్దరం..." అంటూ రాజమ్మని చాచిపెట్టి చెంపమీద కొట్టాడు.

రాజమ్మ ఒక్క వూపుతో ఏడుస్తూ ఇంట్లోకి వచ్చింది. పనివాళ్ళముందూ, అదీ మాదిగవా ళ్ళముందు భర్త కొట్టి అవమానించడాన్ని ఆమె భరించలేకపోయింది.

ఇంట్లో ఒక మూల నులకమంచం వాల్చు కుని, చీరె చెంగు ముసుగు కప్పుకుని, శబ్దం రాకుండా తనలోతనే ఏడుస్తూ పడుకుంది రాజమ్మ.

అంజయ్యకు బూరేలు తొక్కడంలో ఇంట్లో ఎవరూ సాయపడలేదు. కూలీలూ, అంజయ్యే బూరేలు మొత్తం తొక్కారు.

38 బూరేలు అయ్యాయి. ఊళ్ళో ఆరోజు బాబు మిల్లుకే రెండు లారీలు ఎత్తారు.

"రేపొద్దున్న ఇంకో లారీ వచ్చిద్ది అంజ య్యా! ఆ లారీకి మీ పత్తి లోడుచేద్దాం!" ప్రకాశం ఇంటికి వచ్చి చెప్పిపోయాడు.

ఆరోజు రాత్రి రాజమ్మ అన్నం వండ కుండా, తినకుండా పడుకుంది.

శారదే వంటచేసి, రాజమ్మని అన్నం తిన మని అడిగింది చాలాసార్లు.

"నాకు ఆకలి లేదమ్మాయి'' అని రాజమ్మ చెప్పింది.

శారద చాలాసేపు బతిమాలింది.

"లేచి కూడు తిని పడుకోవే!" అన్నపూర్ణ కూడా తల్లిని అడిగింది.

అంజయ్య మామూలుగానే ఏం జరగనట్లు, నీళ్ళు పోసుకుని, అన్నం తిని దడిదగ్గరికి వెళ్ళిపోయాడు.

మరుసటిరోజు ఉదయం ప్రకాశం ముటావా ళ్ళని తీసుకుని కాటాలకు వచ్చాడు.

"ఇంతకీ బోకరు ఎవరు ప్రకాశం?" అంజ య్య అడిగాడు.

"బోకరు ఎవరు లేరు. నేనే కాటాలు యేసి లారీకి పత్తి ఎత్తిస్తున్నా! కమీషన్, గిమీషన్ ఏంలేదు!"

"కమీషన్ ఏం లేకుండా ఎందుకు చే స్తుండా?"

"రేపు తుణమో, పణమో ఇయ్యకపోతా డా? బాబు చేసే చాకిరీ వుంచుకునేవాడు కాదు అంజియ్యా!"

"డబ్బులు గట్టిగా ఇస్తాడా అని 15 రోజు ల్లో"

"నీకెందుకు, డబ్బు ఇప్పించే పూచీ నాది. మనూరి మందులకొట్టోళ్ళు డబ్బు ఇయ్యడని పుకారు పుట్టిచ్చేసరికి అందరికీ మనసులో ఈ గిలి పట్టుకుంది''

పత్తి కాటాలు వేశారు. 46 కింటాళ్ళా 50 కేజీలు అయింది పత్తి. పత్తి బూరేల్ని లారీలకు ఎత్తుతుంటే రాజమ్మ కళ్ళంట నీళ్ళు తిరి గాయి.

★ ★ ★

ఒకరోజు మధ్యాహ్నం రాజమ్మ అన్న పిడుగుపడ్డినట్లు ఊడిపడ్డాడు.

ఆయన్ని చూడటంతోనే అంజయ్యకూ, రా జమ్మకూ పైప్రాణాలు పైనే పోయాయి.

రాజమ్మ కుశలప్రశ్నలూ వేసి, సకల మర్యాదలూ చేసింది.

సాయంత్రం ఆయన అడిగాడు "అదిగాద మ్మాయి, డబ్బులు పెద్దపండక్కి తెచ్చిస్తా మంటివి. పండగ పోయి ఎన్నినెల్లు అయింది? నేను ఎన్ని ఉత్తరాలు రాశానూ? నాకేం డబ్బు లు ఎక్కువై మీకిచ్చినా?"

"పత్తి అమ్మేం అన్నా, ఇంక వారంరోజుల్లో వస్తయ్యి డబ్బులు''

"ఏదైనా విలువుండాలమ్మాయి. నాదగ్గిర లేవు అంటే మొగుడూ పెళ్ళాం ఇద్దరూ కాళ్ళావేళ్ళా పడితిరి! ఎంత విలువగా తీసుకు న్నారో, అంత విలువగా తెచ్చి ఇయ్యొద్దా?"

"ఇస్తాం బావా!" అన్నాడు అంజయ్య గొంతు పెగల్చుకుని, నంగినంగిగా.

"అయితే వారంరోజుల్లో నువ్వు గట్టిగా తెచ్చి ఇస్తావుగా?" అన్నాడు ఆయన.

"తెచ్చి ఇస్తా బావా!"

ఆయన అదేరోజు సాయంత్రం బస్‌కి వెళ్ళి పోయాడు.

అబద్ధం చెప్పి అప్పటికప్పుడు తప్పించు కున్నందుకు అంజయ్య నిట్టూర్చినా, మనసు అశాంతిగానే ఉంది.

బాబు డబ్బు ఇచ్చే గడువు వచ్చింది.

అంజయ్యా, యల్లారావూ ఇద్దరూ ప్రకాశం ఇంటికి వెళ్ళారు.

ప్రకాశం లేడు: పేట వెళ్ళాడని భార్య చెప్పింది. ఎప్పుడు వస్తాడో తెలియదన్నది.

రెండోరోజు కూడా వెళ్ళారు. అతను రాలే దు అని చెప్పింది.

మూడోరోజూ వెళ్ళారు. ఆమె లేదు. పుట్టింటికి వెళ్ళిందని ఇరుగుపొరుగు ఇళ్ళవా ళ్ళు చెప్పారు.

అంజయ్యకి భయం పట్టుకుంది. గడువు దాటి 3 రోజులు అయినా అతీగతీ లేదు.

బాబుకి పత్తి అమ్మినవాళ్ళ ఇళ్ళకి వెళ్ళా డు. "15 రోజులు అంటే 4 రోజులు ఎనకా ముందుగా ఇస్తాడ్లే అంజయ్యా'' అనే ధోర ణిలో కొందరు మాట్లాడారు. కొందరు "పోయి పోయి గోతిలో పడ్డాం. మొత్తానికి డబ్బు రావడం కష్టం" అనే ధోరణిలో మాట్లాడారు.

శీనయ్యగారింటికి వెళ్ళాడు. ఆయన నిమ్మకు నీరెత్తినట్లు ఉన్నాడు.

అంజయ్యా, యల్లారావూ లాభంలేదని ప్ర యాణమై చిలకలూరిపేట వెళ్ళారు. అక్కడ

అడిగితే బాబు లేడనీ, గుంటూరు వెళ్ళాడనీ చెప్పారు. డబ్బులు అడిగితే తమకు తెలియదన్నారు.

బాబు వస్తాడేమో అని సాయంత్రంవరకూ ఎదురుచూసి, అతను రాకపోవడంతో ఇద్దరూ నిరాశగా వెనక్కి తిరిగి వచ్చారు.

ఇంటికి వచ్చేసరికి బాగా పొద్దుపోయింది.

అప్పటివరకూ అన్న రాకకోసం శారద మేల్కొనే ఉంది.

"పోయిన పని ఏమైందన్నా?" ఆశగా అడిగింది.

"నాలుగు రోజుల్లో ఇస్తాడంటమ్మాయి డబ్బులు'' అంజయ్య అబద్ధం చెప్పాడు.

"రోజురోజుకీ ఆలిస్యమయిపోతండే..." అంది శారద.

ఆమే అన్నకి నీళ్ళు తోడి, అన్నం పెట్టింది.

రాజమ్మా, అంజయ్యా పత్తి అమ్మిన దగ్గర్నుంచీ మాట్లాడుకోవడంలేదు. అంజయ్య రెండుమూడుసార్లు మాట్లాడాలని ప్రయత్నించినా రాజమ్మ మాట్లాడలేదు. వాళ్ళ అన్న వచ్చినప్పుడుమాత్రం భర్తతో రెండు మాటలు మాట్లాడింది.

అంజయ్య పేట వెళ్ళి వచ్చాడని తెలుసుకుని సత్యం వచ్చాడు.

"ఏంది అంజయ్యా, డబ్బు యవారం ఏంచేశా?"

"నాలుగు రోజుల్లో ఇస్తా సత్తెం!"

"ఇట్ట ఎన్ని నాల్రోజులు పోయినయ్? తొందరగా చూడు. రోజురోజుకీ నీకే ఎక్కువ బారం అయిద్ది. రేపు డబ్బు కట్టేటప్పుడు అమ్మో ఇంత వడ్డీనా అంటావు''

"తొందరలోనే ఇస్తా సత్తెం" అన్నాడు అంజయ్య.

సత్యం వెళ్ళిపోయాడు. మధ్యాహ్నం వెంకట్రామయ్య వచ్చాడు.

"ఏమండీ అంజయ్యగారూ... బాగు



న్నారా? ఇవ్వాళ తారీకు ఎంతండీ?" వ్యంగ్యంగా అడిగాడు ఆయన.

అంజయ్య మౌనంగా నేలచూపులు చూస్తూ నిలబడ్డాడు.

"15 రోజులకే ఇస్తానని కోతలు కోశావుగదరా? నువ్వా మాట చెప్పి ఎన్ని రోజులు అయింది''

"మాట్లాడవేరా, ఎప్పుడు ఇస్తా డబ్బులు?"

"4, 5 రోజుల్లో ఇస్తా అన్నా!"

"నీకు 4, 5 రోజుల్లో ఎక్కణ్ణించి వస్తయ్యి?"

"పత్తి అమ్మలేదంటన్నా! డబ్బు నాల్రోజుల్లో ఇయ్యడా ఏంది?"

"వాటితో నాకు సంబంధం లేదురా! అసలు వాడు నీకు ఇచ్చేదీ, లేనిదీ నాకు తెలియదూ? మంచి చెబితే మా మాట వింటా! ఎక్కడైనా తంటాలు పడు, నాకుమాత్రం వారంరోజుల్లో డబ్బు చూసి ఇయ్యి. ఎందుకొచ్చిన ముఖమాటం?" అంటూ వెంకట్రామయ్య వెళ్ళిపోయాడు.



అంజయ్య మనసంతా దిగులుతోనూ, భారంతోనూ నిండిపోయింది. అంజయ్య ఎప్పుడూ ఒకరితో మాటపడని మనిషి.

★ ★ ★

మేత మొత్తం అయిపోయింది. వానాకాలంలో అయితే గొడ్లు విప్పి బీళ్ళలోనో, వాగుల్లోనో, వంకల్లోనో తిప్పవచ్చు. రాత్రిపూటకి గడ్డో, గాదమో కోసుకొచ్చి మేపవచ్చు.

రోళ్ళు కూడా బద్దలయ్యే రోహిణీ కార్తె ఎండలు. పచ్చిమేత గరికపూస కూడా దొరకదు. ఎండుమేత ఏమీ లేకుండా అయిపోయింది.

కనీసం 2 వేల రూపాయలైనా ఉంటే నాలుగు బళ్ళు వరిగడ్డి కొనుక్కోవచ్చు. 2 వేల సంగతి దేవుడెరుగు, 2 రూపాయలు కూడాలేవు.

గ్రామాల్లో పచ్చటి ప్రకృతి ఉంది. ఫాక్టరీలు వెలువరించే కలుషితంకాని, స్వచ్ఛమైన గాలి వుంది. పాడి ఉంది. పంట వుంది. శ్రమచేసే చేతులు ఉన్నాయి. వృధా అవుతున్న అపారమైన మానవ వనరులున్నాయి. అయితే లేనిది ఒక్కటే!

అది... డబ్బు!

అంజయ్య ఎంత ప్రయత్నించినా డబ్బు దొరకలేదు.

అంజయ్య పడుతున్న బాధని చూసి పక్క కొష్టం భీమయ్య 10 మోపుల వరిగడ్డి బదులు ఇచ్చాడు. ఆయనకు కూడా అంతంతమాత్రంగానే వరిగడ్డి ఉంది.

"ఈ 10 మోపులతోటి దినం గడిచిద్దికానీ, తనం గడిచిద్దంటన్నా? ఎందుకొచ్చిన బాధ, ఎద్దులు అమ్మిపారేద్దామనుకుంటన్నా!" అన్నాడు అంజయ్య బాధతో.

"రెండురోజులు ఆలస్యమయినా బాబు డబ్బులు ఇస్తాడులేరా అంజియ్యా! ఇవి మేలు రకం ఎద్దులు. ఈ ఎద్దులు అమ్మితే నీకు మళ్ళీ జన్మలో దొరుకతయ్యా ఇసుంటి ఎద్దులు.

అమ్మొద్దు ఉంచుకోరా!"

"పత్తి డబ్బులు వచ్చినా తీర్చాల్సిన బాకీలు చాలా ఉన్నయ్యిలే అన్నా! మేతలేదు, డబ్బులేదు. ఎద్దులు అమ్మి రేపు అదునులో వక్కియ్యో, బిక్కియ్యో, దున్నపోతులు కొనుక్కుంటాను"

"ఎద్దులు అలవాటైన తరువాత దున్నలతో ఏం తంటాలు పడతావురా? నా మాట విని ఇవిమాత్రం అమ్మొద్దు!"

అంజయ్య ఎద్దులు అమ్మదామనే నిర్ణయించుకున్నాడు.

ఇంట్లో తిండిగింజలు లేవు. ఏరోజుకారోజు పాలు అమ్ముకుని బియ్యం తెచ్చుకుంటున్నారు.

పాడిమీద 25, 30 రూపాయలు వస్తాయి. ఇంట్లో కనీసం మజ్జిగకి కూడా ఒక్క బొట్టు పాలు ఉంచుకోవడంలేదు.

ఇంట్లో పిల్లలు మజ్జిగ తాగడంకోసం కొంచెం పాలు ఉంచుకున్నా, అమ్మే పాలు తగ్గిపోతాయి. పాలు తగ్గితే డబ్బులు తక్కువ వస్తాయి. ఆ తక్కువ డబ్బులతో సరిపడే బియ్యం రావు.

అంజయ్యా, రాజమ్మా వాళ్ళ ఇద్దరి జీవితాల్లో కూడా ఎప్పుడూ భయంకరమైన దరిద్రం అనుభవించి ఎరుగరు. ఏరోజుకారోజు రోజు గడవడం కష్టమైపోతోంది.

సాయంత్రం అంజయ్య ఇంటికి వచ్చేసరికి రాజమ్మ బయట మంచంమీద పడుకొని ఉంది.

అంజయ్య నీళ్ళు పోసుకుని అన్నం తిన్నాడు. దడి దగ్గరికి వెళ్ళడానికి లాంతరు ముట్టించుకున్నాడు. చుట్ట చుట్టుకోవడానికి పక్కనే వున్న మంచంమీద కూర్చుని అన్నాడు "ఎద్దులు అమ్మదామనుకుంటున్నానే!"

రాజమ్మ ఏం మాట్లాడలేదు.

"బదులు చెప్పవేమే?"

"ఎద్దులు అమ్ముకో, బర్రెలు అమ్ముకో, ఇల్లు అమ్ముకో, వాకిలి అమ్ముకో! మజ్జలో నేనెవితిని, నాకు చెప్పడం ఎందుకు?"

"ఎడ్డేం అంటే తెడ్డేం అంటం తప్ప సరిగ్గా మాట్లాట్టం ఉందీ?"

"సరిగా మాట్లాట్టం అంటే ఎట్ట మాట్లాడతారు? మాట్లాడినా నా మాటకి ఏం యిలువుండి ఏడిసింది గనక?"

"ఇలువ ఎందుకులేదు?"

"ఏం యిలువుంది? పత్తి అమ్మొద్దు అని నెత్తీనోరూ కొట్టుకుని మొత్తుకుంటే నా మాటని ఏం లెక్కచేసా? ఇయ్యాల ఆ బాబు డబ్బులు ఇస్తాడూ?"

"ఇయ్యక వాడికి బాకా, వాడి అమ్మ మొగుడికి బాకా, ఎవురికి బాకీ?"

"వాడు ఇస్తాడూ, నువ్వు తెస్తావూ, నేను చూస్తాగా!"

"చూస్తావుగా!" అన్నాడు అంజయ్య ఏం మాట్లాడాలో తోచక, కొద్దిసేపాగి మళ్ళీ తనే అన్నాడు.

"ఎద్దులకి పూస మేతలేకపోయా! ఎందుకు అవి మేకుల దగ్గిర వుసూరుమంటా! వాటి వుసురు మనకి తగిలిద్ది! ఎద్దులు అమ్మి రెండు బళ్ళు మేత బరిగొడ్ల వరకన్నా వేసుకుందామనుకుంటన్నా! అంతగా అయితే తరువాత దున్నపోతులు కొనుక్కోవచ్చు!" ఏమంటావు అనే అర్థంతో అంజయ్య అడిగాడు.

"అమ్ముకో, నాకు చెప్పేది ఎందుకు?"

"చెప్పకపోతే యట్ట?"

"ఎందుకు? నేను అమ్మొద్దు... అంటే పట్టుకుని తన్నడానికా? నాకు తెలియదు, నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో' నిర్లక్ష్యంగానూ, అంతులేని వేదనతోనూ అంది రాజమ్మ.

"నీతో మాట్టాడమే దండగ, ఎందుకూ?" అంటూ అంజయ్య లాంతరు తీసుకుని దడి దగ్గరికి బయలుదేరాడు.

దారిలో యల్లారావు, ఇంకా ఇద్దరు ముగ్గురు ఒక అరుగుమీద కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"మామా, రేపు పేటకి పోయొద్దాం. ప్రకాశంగాడు అసలు ఊరే వదిలిపెట్టి పోయాడంట! చూడబోతే, మొత్తానికి కొంపలు మునిగేటట్టుగా ఉంది. పోయి, అసలు ఏందో కనుక్కని వద్దాం" అన్నాడు యల్లారావు

ఇద్దరూ చిలకలూరిపేట వెళ్ళారు.

వీళ్ళు వెళ్ళేసరికి ప్రకాశం ప్రత్యక్షమయ్యాడు.

"ఏంది ఇక్కడున్నావు?"

"మిల్లులో చేరా. మన వూళ్ళో ఉంటే పనీపాటా ఏం లేకుండా ఊరక తిరగడమేగా?"

"సరేగానీ, మేం పత్తి అమ్మి ఎన్నిరోజులూ? చెప్పిన గడువు దాటిపోయి ఎన్నిరోజులైంది? నీవు తెచ్చి ఇస్తానని వప్పుకుంటివి?"

"బాబు ఇస్తే నేను ఇచ్చేవాడినేకానీ నేను ఎక్కడ తెచ్చిస్తాను అంజియ్యా?"

"ఆరోజు నమ్మకంగా చెబితివి. నీ మాటలు నమ్మి మేం ఇస్తిమి?"

"కోప్పడతావెందుకు? బాబుని రానీయ్, మీ డబ్బులు ఇస్తాడు. తొందరపడితే యట్ట?" అన్నాడు ప్రకాశం

వీళ్ళు మాట్లాడుతూ ఉండగనే కారు వేసుకుని బాబు వచ్చాడు.

అసలు మనిషి వుంటాడో, వుండడో, దొరుకుతాడో, దొరకడో అనే ఆందోళనతో వచ్చిన వీళ్ళకు బాబుని చూసి ఒక గండం గడచి గట్టెక్కినట్టు ఊపిరి పీల్చుకున్నారు.

"ఎప్పుడొచ్చారూ?" బాబు వీళ్ళని అడిగాడు.

"పొద్దున వచ్చామయ్యా? మాకేమొ ఇంటి దగ్గర బాధలుండె! ఇరవయ్యో తారీక్కి తెచ్చిస్తానంటివి. మాకు ఏమైనం తెలియకపాయె! మొన్న వస్తే గుంటూరు పొయ్యావని చెప్పారు!"

"చెక్కు కేశ్కాలా! బేంకి మేనేజరు కొత్తోడు వచ్చాడు. ఈడు ఏవో పేచీలు పెడతన్నాడు. పెద్ద ఆపీసర్లతో మాట్లాడదామని గుంటూరు పొయ్యా! పనయిందిలే... ఎల్లుండి వస్తయి డబ్బులు"

"మా ఇద్దరికీ కలిపి ఎంతబ్బాయి, 30 వేలకంటే ఎక్కువ లేదుగా! మూవరకు ఇయ్యాల చూడు" అన్నాడు యల్లారావు.

"నాకు గొడ్లు దగ్గిర మేతలేదు. ఇంట్లో గింజలు లేవు. అప్పులోళ్లు వూపిరి తీస్తన్నారు. నా బాధలు చెబితే తీరేవిగావు ఎట్టయినా తంటాలుపడు, ఎక్కడైనా చేబదులు అయినా తీసుకుని మాకు ఇయ్యి" అన్నాడు అంజయ్య.

"ఇదేం పల్లెటూరారా? చేబదులు ఇయ్యమంటే ఎవుడు ఇస్తాడు? మీరు బెస్తవారం రండి. నాకు బుధవారమే వస్తయ్యి డబ్బులు. అయినా ఒకరోజు ఆగిరండి. ఆరోజు మీకు డబ్బు ఇచ్చే పూచీనాది" అన్నాడు బాబు.

వీళ్లు మళ్లీ మళ్లీ మొండిగా అడిగినా అతను అంతకంటే మొండిగా అదే సమాధానం చెప్పాడు. కనీసం ఇప్పటికి సగం అయినా ఇవ్వమని అడిగారు. లాభం లేదన్నాడు. బేస్త వారం రమ్మన్నమాటే!

ఇక చేసేదిలేక ఇద్దరూ తిరుగుముఖం పట్టారు. ఇస్తాడా, ఇవ్వడా అనే ఆందోళనతో, భయంతో వెళ్లినవాళ్లు ఇస్తాడనే నమ్మకంతో తిరిగివచ్చారు.

అంజయ్య పెందలాడే ఇంటికి వచ్చాడు.

అంజయ్య అమ్మా, తమ్ముడూ, తమ్ముడి కుటుంబమూ బళ్లారినించి వచ్చారు.

శారద వాళ్ల అమ్మని చూసి సంతోషించింది. ఆమె అంతకుముందు ఏడాది రాలేదు. ఆమెని చూసి దాదాపు రెండు సంవత్సరాలైంది.

శారద బాగా చిక్కిపోయిందని ఆమె తల్లి కలత చెందింది. తల్లీ కూతుళ్ళిద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. మాటల్లో కూతురు ఎందుకు వచ్చిందో తెలిసింది. విషయం తెలిసిన ఆ కన్నతల్లి మనసు తల్లడిల్లిపోయింది.

పొలం పెట్టుబడికి బంగారం తెచ్చుకున్నా డని కొడుకుమీదా, బంగారం కోసం కూతుర్ని పుట్టింటికి పంపించాడని అల్లుడిమీదా ఆమెకు అంతులేని కోపం వచ్చింది.

కొడుకుమీద తగాదా పెట్టుకుందామని ఆమె అనుకుంది. అయితే రెండేళ్ల తర్వాత వచ్చింది తను. వచ్చినరోజే తగాదా పెట్టుకుని బజారుకి ఎక్కితే బాగుండదు. నలుగురూ నవ్వుతారని ఆమె బలవంతంగా నిగ్రహించుకుంది.

బళ్ళారిలో పంటలూ, ఇక్కడి పంటలూ, అక్కడ పత్తి ధరలూ; ఇక్కడ ధరలూ, పురుగూ, తెల్లదోమలాంటి విషయాలు చాలా సేపు మాట్లాడుకున్నారు ఆ అన్నదమ్ములు.

బళ్ళారిలో కూడా బాగా పురుగూ, తెల్లదోమ పడింది. రామయ్యకి ఇయ్యేడు కూడా దండగే! అక్కడ కూడా పత్తికి ధరలేదు. అక్కడా చురుకుగా పత్తి కొనుగోలు చేయడంలేదు.

అంతకుముందు మూడు సంవత్సరాల్లో సంపాయించిన డబ్బు మొత్తం నిరుడూ, ఇయ్యేడూ పొలంలో పెట్టి దండగపడ్డానని రామయ్య బాధపడ్డాడు.

"క్రిష్ణాజిల్లావోడు పొలం అమ్ముతానన్నాడా? డబ్బు చూసుకుని తీసకపొయ్యేసరికి అమ్మనని ఎగ్గొట్టాడు. చేతిలో డబ్బుందిగదాని ఇంకా 10 ఎకరాలు కౌలుపట్టి 30 య్యేలు దండగపడ్డా! వాడు పొలం అమ్మినట్టయితే వేరే పొలం కౌలు పెట్టేవాణ్ణి కాదు. కనీసం కొన్న పొలం అయినా నిలబడిపొయ్యేది'' రామయ్య అన్నాడు.

తమ్ముడితో ఒకవైపు అంజయ్య మాట్లాడుతూనే వున్నా, అమ్మ ఏమైనా అంటుందేమోనని మనసు మధనపడుతూనే వుంది. చెల్లెలి బంగారం తీసుకున్నందుకు అమ్మ వప్పుకోదని అంజయ్యకు తెలుసు.

మరుసటిరోజు ఉదయం రామయ్య భార్య తన పిల్లల్ని తీసుకుని పుట్టింటికి వెళ్లిపోయింది.

అంజయ్య అమ్మ అడిగింది కొడుకుని. "అమ్మాయి బంగారం తీసుకున్నావంటగా, తీసకరాకపొయ్యావా?"

"తెచ్చిస్తాలేవే''

"ఎప్పుడూ?"

"రెండు రోజుల్లో తెస్తా!"

"అమ్మాయిని వాళ్ళాయన పంపించి నెలా పదిరోజులు దాటిపోయిందంటనే! నీకేమైనా చీమ కుట్టినట్టు వుందీ? అది పిల్లలమీద దిగులు పెట్టుకుని చూడు, ఎట్టయిందో! అక్కడ పిల్లలు ఎట్టున్నారో, వాళ్లు పసిబిడ్డలాయె!" అంది ఆమె.

"తెచ్చిస్తాలేవే రెండు రోజుల్లో'

"నువ్వు తొందరగా తీసకొచ్చి ఇయ్యి అబ్బాయి. ఇది అసలు నోట్లో నాలికలేనిదాయె! అదికాదే మొద్దుముకందానా, బుద్ధి తక్కువై ఇచ్చినదానివి గట్టిగా అడిగి తీసకపొయ్యే పనిలేదంటే? ఎన్నిరోజులు వుండాలని ఇక్కడ నువ్వు?" చివరకు ఆమె కూతురిమీదకు తగాదాకు లేచింది.

శారద ఏడవటం తప్ప ఏమీ మాట్లాడలేకపోయింది.



గురువారం అంజయ్యా, యల్లారావూ ఇద్దరూ పేట బస్సు ఎక్కారు.

వీళ్లు మిల్లు దగ్గరకు 10 గంటలకు చేరుకు

న్నారు. బాబు ఇంకా రాలేదు. ప్రకాశం కనపడ లేదు. బాబు మిల్లు దగ్గరకు ఎప్పుడు వచ్చేదీ, అసలు ఆరోజు వచ్చేదీ, రానిదీ తాము చెప్పలే మన్నారు ఆఫీసులో అడిగితే.

మధ్యాహ్నానికి వాళ్ల వూరునించి పది మంది రైతులు వచ్చారు. "మీరు ఎప్పుడొచ్చా రు?" అంటే "మీరు ఎప్పుడొచ్చారు?" అని ఒకర్ని ఒకరు పలకరించుకున్నారు. ఒకగంట సేపు సమిష్టిగానూ, కోరస్‌గానూ బాబుని బండబూతులు తిట్టారు.

"శీనయ్య రాలేదేందిరా?" అడిగాడు ఒక రైతు.

"నేను వస్తా ఆయన్ని కూడా రమ్మని అడిగా(నా! తనకి ఏదోపని వుందని రానన్నా డు''

"మొత్తానికి ఏదో కతేరా! చూస్తా చూస్తా పైసా పోనియ్యడు శీనయ్య. మన అందరి కంటే ఎక్కువ పత్తి అమ్మింది ఆయన"

"అంత పెద్ద ఆసామి ఇయ్యంగా, మనం ఎందుకు ఇయ్యకూడదని ఆయన్ని చూసేరా నేను బాబుకి పత్తి అమ్మింది''

మధ్య మధ్యలో బాబుకి సుప్రభాతాలతో మాట్లాడుకుంటూ సాయంత్రం 5 గంటలవ రకూ చూసి ఇక రాడని వచ్చిన రైతులు తిరుగుముఖం పట్టారు.

అంజయ్యా యల్లారావూ మాత్రం బయలు దేరలేదు. బాబు వచ్చేవరకూ ఆగి, డబ్బు తీసుకుని వెళ్లాలని గట్టి పట్టుదలతో వున్నారు. గురువారం ఇస్తాను రమ్మని చెప్పిన మనిషి అయిపు లేకపోవడంతో జరిగిన మోసానికి ఇద్దరికీ కడుపు మండిపోతోంది.

డబ్బు లేకుండా ఇంటికి వెళ్లే విషయాన్ని అంజయ్య వూహించలేకపోతున్నాడు. ఒకవైపు తల్లి కోపంగానూ, మరోవైపు శారద దీనంగా చూస్తున్న చూపులే అంజయ్య మస్తిష్కంలో తిరుగుతున్నాయి.

చీకటి పడేవరకూ ఆశగా ఎదురుచూసిన వాళ్లకి ఆశాభంగమే జరిగింది. మరుసటిరోజు కాదు, ఎన్నిరోజులైనా వుండి బాబు విషయం తేల్చుకునే వెళ్లాలనుకున్నారు.

ఊరికి దూరంగా ఏరువుంటే, అక్కడికి వెళ్లి కాలకృత్యాలు తీర్చుకున్నారు.

వాళ్లు వేసుకున్న తెల్లటి బట్టలు మురికి మురికి అయిపోయాయి.

"ఇయ్యాలన్నా వాడు వస్తాడంటావా మా మా?"

"ఏం చస్తాడో దొంగ నాకొ... మా ఆడది వీడికి పత్తి ఇయ్యొద్దు, ఇయ్యొద్దు అని అంట న్నా, దాని మాటలు యినకుండా వీడిని నమ్మి ఇచ్చినందుకు చూడు ఎన్ని తిప్పలో?" అన్నా డు అంజయ్య.

మిల్లు దగ్గరకు వెళ్లారు. వచ్చేవాళ్లు వస్తు న్నారు, పోయేవాళ్లు పోతున్నారు. బాబు మా త్రం అడ్రస్ లేదు.

వేపచెట్టు వుంటే దానికింద వుదయంనించీ ఒకావిడ మాటామంతీ లేకుండా కూర్చుని వుంది.

యల్లారావుకి ఆమెతో మాట్లాడి, విషయం ఏమిటో తెలుసుకోవాలనిపించింది.

"ఏందీ, ఒక్కదానివే పొద్దుట్నించీ కూచు న్నావు?" దగ్గరకి వెళ్లి అడిగాడు.

"బాబు కోసం కూర్చున్నానయ్యా''

"ఏందీ ఆయనతో పని?"

"పనేముందయ్యా? సచ్చినోడు మా కాపరా న్ని నిలువునా సర్వనాశినం చేసి వదిలిపెట్టా డు. దేశం మొత్తంమీద వుండరయ్యా ఇంత కంతిరిగాళ్లూ, తడిగుడ్డలతో గొంతులు కోసే రకం! నిరుడు 80 కింటాళ్ల పత్తి అమ్మేం వీడికి, డబ్బులు రేపిస్తాం, మాపిస్తాం అని తిప్పాడు. వీడు చెప్పిన వాయిదాకి డబ్బులకోసం వచ్చి, తిరిగి మా వూరు లారీలో వస్తా మా ఆయన యాక్సిడెంటులో చచ్చిపోయాడు. మా ఆయ నని నిలువునా చంపి మా కుటుంబాన్ని బజారుపాలు చేశాడు'' అని చెప్పి ఆమె వెక్కివెక్కి ఏడ్చింది.

అంజయ్యా, యల్లారావూ ఆ మాటతో షాక్ తిన్నట్లు అయిపోయారు.

"ఏవూరు మీది?" తేరుకున్న అంజయ్యా అడిగాడు.

"మంగమూరు. ఈ లం... కొడుకు మా వూరి అల్లుడే! వీడి మామ చండాలపోడు. డబ్బులకోసం కూనీలు చేయమన్నా వీడి మామ చేసేవోడు. మామకి తగ్గ అల్లుడయ్యా వీడు. నమ్మకంగా డబ్బు ఇస్తానని పత్తి కొనక్కపోయి మమ్మల్ని నాశనం చేసిపెట్టాడు. డబ్బు ఇయ్యడూ, చావడూ! వాయిదాలతో తిప్పి చంపుతాడు. వీడు చెప్పిన వాయిదాకి వచ్చే మా ఆయన చచ్చిపోయాడూ, మేము ఇయ్యాల దిక్కులేని వాళ్ళం అయ్యాం" అని చెప్పి ఆమె బావురుమంది.

"మీ వూళ్లో ఎవురికీ డబ్బు ఇయ్యలేదా?"

"ఒక్కరికి నయాపైసా ఇస్తే ఒట్టు! 6 లారీల పత్తి తోలకపొయ్యాడు. ఒక్కరికి గాక పోతే ఒక్కరికి కూడా ఒక్క రూపాయి ఇచ్చిన పాపానపోలా! మా ఆయన చచ్చిపోయాడని నాకు మాత్రం దానధర్మం ఇచ్చినట్లు 4 వేలు ఇచ్చాడు. ఇంకా 4 వేలు ఇయ్యాల ఇచ్చి, కొరవడబ్బు తరవాత ఎప్పుడో ఇస్తానని చెప్పాడు. కనీసం ఇస్తానన్న 4 వేలన్నా ఇచ్చి చస్తాడేమోనని వచ్చానయ్యా!"

బాబు డబ్బు తమకి కూడా ఇవ్వడని ఆమె మాటలతో వీళ్ళకి స్పష్టమైపోయింది.

"పోలీసు కేసు పెట్టకపొయ్యారా?"

"కేసు పెడితే ఏమయిద్ది? అప్పటికీ మా వూరోల్లు పోలీసోళ్ల చుట్టూ తిరిగారు. లంచాలు లేనిదే ఈ రోజుల్లో పనులు జరుగుతయ్యా? మనం 4 రూపాయలు వాళ్ళకి లంచం ఇస్తే వాడు 400 ఇస్తాడు. వాడి సొమ్మేంపోయింది. పోలీసులు వాడికల్లే వుంటారు కానీ, మనకల్లి ఎందుకు వుంటారు?"

"మీ వూరి వాళ్లకి వీడు డబ్బు ఎగేసాడని మా వూళ్లో కూడా కొంతమంది అన్నారు. అయినామేం నమ్మలేదు. చూడు, ఎంతపనో ఇవ్వాళ"

"ఈ ముదనష్టపోడి గుండానే మావోడు చదువు మానుకున్నాడు. పాలిటెక్నిక్ కాకినాడలో రెండేళ్లు చదివాడు. ఇంక ఒక్క ఏడు చదివితే అయిపొయ్యేది. వాళ్ళ నాన్న చచ్చిపోయీ, చేతిలో డబ్బులేకా, ఇంటి దగ్గర పొలంచేసే వాళ్లు లేకా చదువు మజ్జెలోనే మానుకుని వచ్చాడు. సంసారం అన్నివిధాలా దెబ్బతింది వీడి గుండా!"

"నిరుడు మీ వూరూ, ఇయ్యేడు మా వూరూ, వచ్చేఏడు ఇంకో వూరూ! ఎన్ని వూళ్ళలో ఎంతమంది కాపరాల్ని నాశనం చెయ్యాలో వీడు! వీడి జీవానికి పడి ఎంత మంది ఏడవాలో! అడిగేవోడు ఎవుడున్నాడూ, పట్టిచ్చుకునేవోడు ఎవుడున్నాడూ?" అన్నాడు అంజయ్య.

మధ్యాహ్నం అయింది. బాబు రాలేదు. కడుపులో పేగులు నకనకలాడిపోతున్నాయి.

"ఏం చేద్దాం మామా?"

"నిన్న మజ్జాన్నం తినకుండా, రేత్రి తిన కుండా, ఈ పూట కూడా తినకుండా ఏం వుంటాంరా? ఇంటి దగ్గరవుంటే ముప్పూటలా సంకటో, సడకో మూడు కంచాలు తినేవాళ్లమి. చార్జీలకు వుంచుకున్న డబ్బులు పెట్టి పూట కూలి తినివద్దాం. చార్జీల యవారం తరవాత చూడొచ్చు''

యల్లారావు కూడా అదే అనుకున్నాడు. ఇద్దరూ వూళ్లోకి వెళ్లి హొటల్‌లో కడుపునిండా భోంచేసి వచ్చారు. ఇక ఇద్దరి దగ్గరా పైసా డబ్బులేదు. టీనీళ్లు తాగాలన్నా అసాధ్యమే.

ఆరోజు కూడా బాబు రాలేదు. ఇద్దరూ రాత్రి బస్టాండుకి వెళ్లి బల్లల్ని ఆశ్రయించారు.

ఎండాకాలం చెమటలు పట్టి వళ్లంతా జిడ్డు జిడ్డుగా తయారైంది. స్నానంచేసి మూడురోజులు. బట్టలు మురికెత్తిపోయాయి.

ఇద్దరికీ ఆకలి దహించుకుపోతోంది. అంజయ్య పుట్టి బుద్ధెరిగిన తరువాత ఎప్పుడూ ఇలా పస్తుపడుకోలేదు.

ఏడాది పొడుగునా చాకిరీ చేసుకుని, కష్టమో, నష్టమో కొద్దోగొప్పో పంట పండించు కుని, చివరికి దిక్కుమాలినవాడికి ఇచ్చి వాడి చుట్టూ తిరగాల్సి వచ్చినందుకు ఇద్దరూ బాధ పడిపోతున్నారు. బాబువస్తే వాడిని చంపె య్యాలన్నంత కసి పుడుతోంది ఇద్దరికీ!

మరుసటిరోజు వేకువజామునే లేచి, ఏటి దగ్గరకి వెళ్లి కాలకృత్యాలు తీర్చుకుని, ముఖ మూ, కాళ్లూ, వళ్లూ శుభ్రంగా కడుక్కుని, కడుపులో పేగులు కరకరలాడుతుండగా మిల్లు దగ్గరకి వెళ్లారు.

"ఇయ్యాల కూడా రాకపోతే ఏం చేద్దాం మామా?"

"తాడో, పేడో తేల్చుకుని వెళ్లాల్సిందే! ఉత్త చేతుల్తో వెళ్తేమా అమ్మ వూరుకోదు. బంగారం బేంకినించి తెచ్చి మా అమ్మాయికి ఇచ్చి పంపాల! వచ్చి 3 రోజుల అయింది. ఇంటి దగ్గర పరిస్థితితో మనసు మధనపడుతున్నా" గట్టి నిర్ణయంతో తెగింపుగా అన్నాడు అంజ య్య.

వీళ్ళ వూరునించి శీనయ్యా, ఆయన కొ డుకూ వచ్చారు.

వాళ్ళని చూసి వీళ్లూ, వీళ్లని చూసి వాళ్లూ ఆశ్చర్యపోయారు.

"ఏందిరా ఈ అవతారం? ఇట్ట అయిపో యారేందిరా మీరు?" శీనయ్య వీళ్లని చూసి ఆశ్చర్యపోతూ అడిగాడు.

"ఏంచేస్తాం శీనయ్యా, ఈ నా కొడుక్కి పత్తి ఇచ్చి ఈ గతిపట్టాం"

"బలేవోళ్లురా మీరు! ఇక్కడ ఎన్నిరోజులు జపం చేస్తారు?"

"వాడు డబ్బు ఇచ్చేవరకూ తప్పదు. నువ్వు కూడా మాతో జపం చేయాల్సిందే, నీ పత్తి డబ్బు రావాలంటే. లోపలకిపోయి ఏం చేస్తాం, వాడు రాలా, కూర్చుందాం ఇక్కడ" అన్నాడు అంజయ్య.

శీనయ్య ఆ మాటలు విననట్లే ఆఫీసు రూంలోనికి దారితీశాడు.

వెంట వీళ్లు కూడా వెళ్లారు.

"ఇక్కడ మేనేజర్ రాఘవ అంటే ఎవు రండీ?" అడిగాడు శీనయ్య.

"నేనే, ఏం కావాలి?"

"మాది పమిడిపాడు. నా పేరు శీనయ్య.

"మీరా, కూర్చోండి కూర్చోండి" అని ఎదు రుగా వున్న కుర్చీ చూపెట్టాడు.

ఊళ్లో పొరుగింటివాడు కూడా సరిగా పల కని శీనయ్యకి, ఇక్కడ వున్న పలుకుబడిని చూసి అంజయ్యా, యల్లారావు ఆశ్చర్యపడిపో తున్నారు.

పది నిముషాలు మామూలు మాటలు మాట్లాడిన తరువాత రాఘవ "మీరు కొద్దిసేపు బయట కూర్చుంటారా?" అని అంజయ్యా, యల్లారావులతో అన్నాడు.

వీళ్లు వరండాలోనికి వచ్చారు.

శీనయ్య పత్తికి ఎంత డబ్బు వస్తుందో, మొత్తం లెక్కచూసి రాఘవ ఇచ్చాడు. శీన య్యా, కొడుకూ డబ్బు మొత్తం లెక్కవేసి ఒక సంచిలో పెట్టుకున్నారు.

అదంతా వీళ్లు చూస్తూనే వున్నారు.

శీనయ్య బయటకు వచ్చిన తరువాత వీళ్లు ఆశ్చర్యంగా, అసూయగా అడిగారు. "వాడు నీకు ఎట్ట ఇచ్చాడు శీనయ్యా డబ్బులు? మేము నాలుగుసార్లు తిరిగీ, మూడు రోజు ల్నించి ఇక్కడ పడివుంటన్నా మాకు అతీగతీ లేదు"

"కిటుకు ఏందో మాక్కూడా చెబితే మేం కూడా వసూలు చేసుకుంటాంకదా?"

"కిటుకు ఏం వుండిద్దిరా, మాకు ఇయ్యా ల్సిన పత్తి డబ్బులు ఇచ్చాడు"

"మా అందరికీ ఇయ్యనిది నీ ఒక్కడికే యట్ట ఇచ్చాడు?"

"సరే, ఒక్కొక్కరిది ఒక్కో జాతకం" అన్నాడు ఆయన గర్వంగానూ, వేదాంత ధోర ణిలోనూ.

ఆయన మాటలకీ, కుట్ర బుద్ధికీ వీళ్లకి

కడుపు మండిపోతున్నది.

"జాతకమా, గీతకమా? మొత్తానికి ఏదో కిర్రుకిర్రు చేశావు?" అన్నాడు యల్లారావు.

"సరే, అనుకోండ్రా'' అని శీనయ్య బయలు దేరాడు,

"ఇంటికి వచ్చిన తరవాత ఇస్తాంకానీ, మాకు వందరూపాయలు చేబదులు ఇయ్యి శీనయ్యా''

"ఈ సంచిలో కట్టలు తీయాలంటే ఇబ్బందిగదరా!" అని జేబులో చేయిపెట్టి ఒక కాగితం తీశాడు.

"ఇదుగో, ఈ 50 రూపాయలూ తీసుకొండి. ఊళ్లోకి వచ్చిన తరవాత మా ఇంటికి తెచ్చియ్యండి. మళ్లీ మీ ఇంటి చుట్టూ తిప్పించుకోకండి రేయ్!"

"ఇంటికి వచ్చిన తరవాత ఇస్తాంలే, నీ డబ్బు మా కెందుకు?" అన్నాడు యల్లారావు.

శీనయ్యకు పత్తి డబ్బులు ఎలా ఇచ్చాడో, అందులోని మర్మం ఏమిటో అంజయ్యకూ, యల్లారావుకూ అర్థం కాలేదు. వాళ్లు ఇద్దరూ అదే విషయం ఎంతోసేపు చర్చించుకున్నారు.

శీనయ్య భార్య, అక్క అల్లుడు తెనాలిలో డిఎస్పీగా పనిచేస్తున్నాడు.

ఆ డిఎస్పీ భార్య, పిన్నిగారింట్లో అంటే శీనయ్యగారింట్లోనే చాలాకాలం పెరిగింది.

గడువు వచ్చినరోజు శీనయ్య డబ్బుకోసం బాబు దగ్గరకి వెళ్లాడు. అతను వారంరోజులకి వాయిదా వేశాడు.

బాబు డబ్బులు ఇవ్వడని వూళ్లో అందరూ అనుకునే విషయం నిజమే అనిపించింది శీనయ్యకు. నమ్మకంగా 15 రోజులకి ఇస్తాను అని చెప్పిన మనిషి వారంరోజులు వాయిదా వేయడంతో ఆయన అనుమానం గట్టిపడింది.

ఇంటికి వచ్చిన వెంటనే భార్యని తీసుకుని తెనాలి వెళ్లాడు. పిన్నిని చూసి ఆ డిఎస్పీ



భార్య ఎంతో సంతోషించింది.

శీనయ్య డిఎస్పీకి విషయం వివరించాడు.

గడువు వచ్చినరోజు కారు వేసుకుని తెనాలి నుంచి శీనయ్యా, డిఎస్పీ, ఇద్దరు కానిస్టేబుళ్లూ నరసరావుపేట బాబు ఇంటికి వెళ్లారు.

ఇంటిముందుకి కారూ, పోలీసులూ రావడంతో బాబు ఖంగుతిన్నాడు.

కార్లోని వాళ్లకి ఎదురువెళ్లి, ఇంట్లోకి తీసుకు వచ్చాడు.

"నేను తెనాలి డిఎస్పీని, ఈయన మా మామయ్య, పమిడిపాడు''

"నమస్కారం నమస్కారం" అన్నాడు బాబు.

"నమస్కారం పెడుతూ మాకు మస్కా కొట్టొద్దు. ఈయన మీకు పత్తి అమ్మేడా?"

"ఏమో, గుర్తులేదండీ''

"గుర్తులేదూ? మా ఇంటికి వచ్చి 170 కింటాళ్ల పత్తి తీసకపొయ్యావే నేను గుర్తులేదూ?"



"సరే, గుర్తు లేకపోతేపోనీయండి. పమిడి పాడులో నువ్వు పత్తి కొన్నావుగదా? మా మామయ్య కాతా చూసి, ఆ కాతా ప్రకారం మామయ్యకి ఎంత డబ్బు రావాలో అంత ఇవ్వు''

"డబ్బులు ఇప్పుడు లేవండీ''

"ఎప్పుడు ఇస్తావు మరి?"

"వారంరోజుల్లో ఇస్తానండీ''

"నమ్మకంగా ఇస్తావా?"

"ఇస్తానండీ''

"సరే, నీ ఇష్టం. వారం రోజులకి మామయ్య వస్తాడు. రూపాయి కూడా కొరవపెట్టకుండా, ఒకపూట కూడా వాయిదా వేయకుండా ఇవ్వాలి డబ్బు''

"అలాగేనండీ''

"అలాగే ఇలాగే అంటే కాదు. నువ్వు ఇలాగే చాలామందిని ముంచావని విన్నా! నీ ఇష్టం. వారంరోజులకి మామయ్యకి డబ్బు ఇవ్వకపోయ్యావంటే, ఆ మరుసటిరోజు ఈ టయానికి నువ్వు లాకప్పులో నా చేత్తో తన్నులు తింటూవుంటావు. ఇప్పటికే లాకప్పుల్లో నా చేతుల్లో ముగ్గురు చచ్చేరు. నువ్వు నాలుగోవాడివవుతావు'' పెళ్లాం పిన్ని మొగుడిముందు గర్వంగా తన హెూదాని ప్రదర్శిస్తూ, అలవాటుగా మీసం తిప్పుతూ అన్నాడు డిఎస్పీ.

"ఇస్తాను అన్నాను కదండీ''

"అందరికీ ఇస్తానంటావు. ఎవురికీ ఇయ్యను అనవుగా''

"వారంరోజుల్లో మీరు రండి. ఈ వూరు కూడా వద్దు. చిలకలూరిపేట మిల్లు దగ్గరకి రండి. నేను వుండకపోయినా, ఆఫీసులో మేనేజరు రాఘవ వుంటాడు. నేను వారంరోజుల్లో డబ్బు ఎరేంజ్‌చేసి ఆయనకి ఇస్తాను. ఆయనని అడగండి. మీ చేతికి ఇస్తాడు'' శీనయ్యకు చెప్పాడు బాబు.

టిఫిన్లూ, కూల్‌డ్రింకులూ వచ్చాయి. అంద

రూ టిఫిన్లు తిని, డ్రింకులు సేవించారు.

"చిన్న రిక్వెస్ట్ అండీ?" బాబు అన్నాడు.

"ఏందీ?" డిఎస్పీ పోలీస్ దర్పం ప్రదర్శిస్తూ హుంకరించాడు.

"బిజినెస్‌లో నేను బాగా నష్టపోయానండీ. మిగిలిన వాళ్ళకి నేను తరువాత ఎప్పుడో ఇస్తాను. మీరు మిగతా వాళ్ళ విషయంలో కొంచెం చూసీచూడనట్లు వుండండి!"

"వాళ్ళ విషయం నాకెందుకయ్యా? మా మామయ్యకు ఇవ్వు చాలు. మిగతావాళ్లూ, మీరూ ఎలాగో కిందా, మీదాపడి చావండి. నేనెందుకు ఇంకొకరి విషయంలో జోక్యం చేసుకుంటాను?"

"నువ్వు కూడా మీ వూళ్లో ఎవరితో గుట్టు బైటపెట్టవాకు. అందరికీ తెలిస్తే నేను చాలా ఇరుకునపడతా!" శీనయ్యతో అన్నాడు బాబు.

"ఎవరికీ చెప్పనులే' శీనయ్య హామీ ఇచ్చాడు.

ఆ డిఎస్పీకి చాలా ఆనందంగా వుంది. భార్య బాబాయికి తాను దాదాపు లక్షరూపాయలు వచ్చేటట్లు చేశాడు. భార్య తనని మెచ్చుకుంటుంది. బంధువులు అందరూ తనని గూర్చి చాలా గొప్పగా, ఘనంగా చెప్పుకుంటారు. నరసరావుపేట ఆ డిఎస్పీ పరిధిలోని వూరు కూడా కాదు. అయినా సరే, వాళ్ల మామయ్యకి సహాయం చేయడం కోసం ఆయన ఎంతో శ్రమపడి వచ్చాడు.

బాబు దగ్గర మరోసారి హామీ తీసుకుని, అందరూ కారు ఎక్కి వెళ్లిపోయారు.

"శీనయ్య డబ్బు వసూలు చేసుకున్నాడంటే మొత్తానికి ఏదో కిటుకు మాత్రం వుందిరా!" అన్నాడు అంజయ్య. వాళ్ళ ఇద్దరికీ గుట్టు తెలియక ఎంతో విభ్రాంతికి లోనయ్యారు.

★ ★ ★

కారు వేసుకుని, సిగిరెట్ పొగ విలాసంగా వదులుతూ, నల్లకళ్లజోడు పెట్టుకుని సాయంవేళ బాబు వచ్చాడు.

ఆంబోతుల్లా బలిసి వున్నవాళ్లు అతని వెంట ఇద్దరు వున్నారు.

"ఏందబ్బాయి, గురువారం రమ్మంటివి. ఆరోజు వస్తిమి. ఈ మూడురోజుల్నించీ కూడూ నీళ్లూ లేకుండా నీ కోసం ఎదురుచూస్తంటే నువ్వు ఇయ్యాల వస్తివి''

"ఆరోజు పనికాలేదండీ. బేంకోడు సోమవారానికి వాయిదా వేశాడు. మీరు మంగళవారం రండి'' అన్నాడు అతను అతితేలికగా.

"మంచోడివే! మాకు ఇంకేం పనిలేదనుకున్నావేంది? నీకు పత్తి ఇచ్చి నీ చుట్టూ మేం తిరగాలా? నువ్వు ఎక్కడైనా తంటాలుపడు, మాకు మాత్రం ఇయ్యాల డబ్బులు ఇయ్యాల్సిందే'' అన్నాడు యల్లారావు.

"ఏంది ఇది? నువ్వు ఇంటికొచ్చి పత్తి కొంటూ డబ్బు ఎన్నిరోజులకి ఇస్తానని చెప్పావు? గడువు దాటిపోయి ఎన్నిరోజులైందీ? నువ్వు డబ్బు కట్టిందాకా కదిలేపనిలేదు'' అన్నాడు అంజయ్య.

"నిజమే, నాకూ తొందరగా ఇద్దామనే వుంది. బేంకులో పనిగాకపోతే ఏం చేయమంటారో చెప్పండి''

"పొద్దున మావూరి శీనయ్యకి మీ మేనేజరు డబ్బు మొత్తం ఇచ్చి పంపలా? అట్నే మాకు ఇయ్యి''

"మాకు ఏం వంకలూ, వాయిదాలూ చెప్పవాకయ్యా! మేం ఎంత ఇబ్బందుల్లో వున్నామో చెప్పటానికి వల్లకాదు. మా చెల్లెలి బంగారం తీసుకుని బేంకిలో పెట్టుకుంటే బంగారం తీసకరమ్మని మొగుడు యెల్లగొట్టాడు. పిల్లోడి చదువు ఆగిపోయిద్ది. గొడ్డుకి మేతా, తింటానికి గింజా లేక నానాబాధలు పడతున్నాం. మావరకూ డబ్బు సర్దు. నీకు పుణ్ణెం వుండిద్ది'' బతిమిలాడుతూ ఏడుపు ముఖం పెట్టి అడిగాడు అంజయ్య.

"ఇబ్బందుల్లేకుండా ఎవురు వున్నార్లే?"

"మా ఇబ్బందుల్ని తీర్చమని నిన్న మేం

అడగడంలా? మాకు ఇయ్యాల్సిన డబ్బులు ఇయ్యమని అడుగుతున్నాం, వాళ్ళూ, వీళ్ళూ అనుకున్నావేమొ, మా సంగతి ఎరగవు. తరువాత అనుకుంటే లాభం లేదు!" బెదిరిస్తూ మాట్లాడాడు యల్లారావు.

"ఏం చేస్కుంటారో చేస్కోండి. నాదగ్గర మాత్రం ఇప్పుడు డబ్బులు లేవు. మీరు చేసేదేదో చేసినప్పుడు చూద్దాంలే' అన్నాడు బాబు నిర్లక్ష్యంగా.

"ఊరుకోరా యల్లారావు. వాడికి మాట్లాడ్డం చేతకాదయ్యా! మా వరకూ ఇచ్చి పంపావంటే నీ మేలు మరిచిపోము, నీకు చేతులు ఎత్తి దణ్ణం పెడతా!" అంజయ్య అతని కాళ్ళు పట్టుకున్నంత పనిచేస్తూ అడుగుతున్నాడు.

నెమలికంటి నీటికి వేటగాడు జాలిపడతాడా?

మొండివాడు రాజుకంటే బలవంతుడట! అతను అంత మొండిగా మాట్లాడుతున్నాడు.

పెద్దగా అరవొచ్చు! కోప్పడవచ్చు! తిట్టొచ్చు! ధైర్యం వుంటే అతన్ని తన్నవచ్చు! అయితే ఏం లాభం? ముళ్ళకంపమీద తువ్వాలు పడింది. దాన్ని నెమ్మదిగా తియ్యాలి. అంతేకానీ, కోపంతో లాగితే ఏమవుతుంది? చిరిగిపోతుంది! ఈ అభిప్రాయంతో అంజయ్య బతిమలాడుతూ అడుగుతున్నాడు.

బాబు వీళ్ళకి టీ తెప్పించి ఇచ్చాడు.

"నిన్న పొద్దుట్నించీ మేం అన్నం కూడా తినలేదు. చార్జీలకు పైసా డబ్బులేదు'' టీ తాగుతూ అంజయ్య చెప్పాడు.

మేనేజరుకీ, సూపర్‌వైజర్‌కీ మిల్లుకి సంబంధించిన పనులు చెప్పి బాబు కారు ఎక్కాడు. ఇద్దరూ వదలకుండా, బతిమలాడుతూ కారు దగ్గరకి వెళ్ళారు.

కారులో కూర్చుని, జేబులో నించి 100 రూపాయల కాగితాలు 4 తీసి, చెరి 2 ఇచ్చి "నేను కబురు చేసేవరకూ మీరు రావద్దు. నాకు చాలా పన్లు వున్నాయి'' అని చెప్పి "పోనివ్వు''మని డ్రైవర్‌కి చెప్పాడు.

ఇంకా కొంత డబ్బు ఇవ్వమని మాట అడగడానికి కూడా వీళ్ళకి అవకాశం ఇవ్వకుండా కారు వేగంగా కదిలిపోయింది.

★ ★ ★

"పోయి ఎన్ని రోజులు అవతందిరా? రేపో మాపో ఇస్తానంటే సందకాడికి వచ్చి తెల్లారి పోవచ్చు కదా? ఏవైనం తెలియక ఇక్కడ అందరం దిగులు పడతంటిమి!" అంజయ్య అమ్మ అన్నది.

"దిగులు పడేది ఎందుకే, ఏమైందని?"

అంజయ్య ఇంటికి వచ్చేసరికి రాత్రి 10 గంటలైంది. ఇంట్లో అందరూ మేలుకునేవున్నారు. అంజయ్య స్నానంచేసి తిన్న తరువాత వాళ్ళ అమ్మ విషయం ప్రస్తావించింది.

"ఉన్నన్ని రోజులు వున్నావు, ఇవ్వాల్సిన డబ్బు మొత్తం ఇచ్చాడా, మళ్ళీ రమ్మని ఏమన్నా కొరవపెట్టాడా?"

"అసలు ఆ మనిషి లేడమ్మా, దొరకలా! ఏదో వూరు పోయాడంట, ఇయ్యాల రేత్రికో, రేపో వస్తాడంట!" అబద్ధం చెప్పాడు.

"ఇయ్యాలో, రేపో వస్తాడని చెబితే ఇన్ని రోజులు ఎందుకు వున్నావురా, పోయిన రోజే రావచ్చుగా?" అంది ఆమె.

"వస్తాడని చూశాం. మళ్ళీ పోవాల"

"మరేం పనిలేదు. ఆ వూరికీ, ఈ వూరికీ తిరగడమే! గొడ్డూ గోదా, చేలూ, చెట్టూ ఇయ్యేం అక్కరలేదు'' రాజమ్మ అంది.

"సరేలే, ఇంక నోర్మూసుకుని కూచో!"

"నేను నోర్మూసుకుని కూచోక ఏం చేస్తాలే? ఇంటో బియ్యపు యిత్తు లేదు. మొన్నటి దాకా అప్పు ఇచ్చిన శెట్టి అప్పు ఇయ్యనంటే ఇయ్యనన్నాడు. ఏం చేస్తావో చెయ్యి, రేపట్నించీ నువ్వు యెసుట్లోకి తెచ్చిస్తేనే కూడు వండుతా, లేకపోతే లేదు''

అంజయ్యకు ఆ మాటలు వినడానికీ, ఆలోచించడానికీ, మనస్కరించక "ఇన్నిరోజులూ గొడ్లు దగ్గిర ఎవురు వున్నారమ్మా?" అని తల్లిని

అడిగాడు.

"మీ తమ్ముడు వున్నాడు. ఎవురున్నా ఏం లాభంరా? వాటికి మేత లేదంటగా! మొన్నట్నించీ బర్రె పాలు ఇయ్యకుండా తన్నింది. కనీసం పాడివున్నా యెచ్చాలకో, ఉప్పుకో, పప్పుకో వచ్చేయ్యి!" అంది ఆమె.

మాట మాట్లాడితే సమస్య వస్తుండటంతో మళ్ళీ టాపిక్ మార్చాడు అంజయ్య.

"అబ్బాయికి నిన్నటితో పరీక్షలు అయిపోతాయి గదమ్మా పూర్ణా! రాలా వాడు?"

"ఇంక రాలేదు బాబా!"

అంజయ్య మరేం మాట్లాడకుండా దుప్పటి తీసుకుని దడి దగ్గరకి వెళ్ళిపోయాడు.

"నువ్వెప్పుడు వచ్చావన్నా?" నిద్ర లేచి రామయ్య అడిగాడు.

"రాత్రి వచ్చారా. నేను వచ్చేసరికి నువ్వు నిద్రపోతన్నావు"

"గొడ్లు దగ్గిర మేతలేకపోయే! ఊళ్ళో అందరూ వాములు కూడా వేసుకున్నారు కద న్నా"

"ఎద్దులు అమ్మిపారేసి, బరిగొడ్లు మటుకి రెండు బళ్ళు మేత వేసుకుంటారా!"

ఎద్దుల మేతకి రాగి చెట్టు ఆకు అయినా కొట్టుకి వద్దామని బండికట్టుకుని చేలోకి వెళ్ళిపోయాడు అంజయ్య.

రాగి చెట్టు ఆకు కొట్టుకుని బాగా ఎండబడి ఇంటికి వచ్చేసరికి వెంకట్రామయ్య కూర్చుని వున్నాడు.

"ఏరా అంజియ్యా, నా డబ్బుల యవారం ఏం చేశా?"

"ఇస్తా అన్నా, నువ్వు తొందరపడితే యట్టా?"

"తొందరపడేది ఏందిరా? పత్తి అమ్ముకుని కూడా డబ్బులు ఇయ్యకపోతే ఎట్టా?"

"పత్తి అమ్మిన డబ్బులు రావద్దంటన్నా!"

"నువ్వు డబ్బు ఇస్తానని చెప్పిన గడువుదాటిపోయి కూడా వారంరోజులైంది"

"నిజమే అన్నా... పక్కన నాకు డబ్బు రావాలి గదా?"

"ఒరేయ్, ఆ డబ్బుతో నా బాకీకి ముడి పెట్టవాకు. నీకు ఆ డబ్బు వచ్చేది, రానిదీ నాకు తెలియదూ? డబ్బు రూపేణా గాకపోయినా నా బాకీకి ఏదో జవాబు చెప్పు!"

ఈ ఏడాది నష్టాలు! దానికి తోడు పండిన ఆ కాస్త పత్తి కూడా చేయిజారిపోయింది. అంజయ్య అన్నివిధాలా ఈ ఏడాది దెబ్బతినడం ఖాయం! రైతు ఒక ఏడాది దెబ్బతింటే, వరుసగా ప్రతి ఏడూ పంటలు పండినా, ఆ దెబ్బనుంచి తట్టుకునేది ఏ అయిదారేళ్ళకో! మధ్యలో ఇలాంటి దెబ్బ మరొకటి తగిల్తే ఇక లేచేపని వుండదు. పొలం మొత్తం బాకీల వాళ్ళకి ఇచ్చి కూలీనాలీ చేసుకుని బతకాల్సిందే!

తరువాత ఎప్పుడో బాకీల వాళ్ళకి ఇచ్చే రూపాయికి 25 పైసలు తీసుకునేకంటే ముందే వీలైనంత వసూలు చేసుకోవాలనేది వెంకట్రామయ్య ఆలోచన.

"డబ్బు రూపేణా గాకుండా ఎట్ట ఇయ్యమంటావన్నా?" అంజయ్య అడిగాడు.

"నీ బాకీ 22 వేలు వుంది. ఇంత బాకీ నువ్వు నీ జన్మలో తీర్చడం అనేది జరిగే పనికాదు. రైతు ఒకసారి అప్పుల వూబిలో పడిన తరువాత ఇక లేచే పని వుండదు. నీకు నెలకి 4, 5 వందలు వడ్డీ పెరగడం తప్ప వుపయోగంలేదు. నా బాకీ కింద 2 ఎకరాలు పొలం కండింపు చెయ్యి!"

అంజయ్య పొలం కండింపు అనే వూహని భరించలేక మౌనంగా వుండిపోయాడు.

"మాట్టాడవేరా, ఏదైనమూ చెప్పు?"

"మాట్టాడేది ఏందన్నా? ఇప్పుడుకిప్పుడు చెప్పమంటే ఏం చెపతాను?"

"సరే, ఆలోచించుకునే రెండురోజులు ఆగి చెప్పు" అని వెంకట్రామయ్య వెళ్ళిపోయాడు.

★ ★ ★

హనుమంతరావు గుంటూరునించి వచ్చా

డు.

"పరీక్షలు బాగా రాశాను బాబా. మార్కులు బాగా వస్తయ్యి. రెండు రోజుల్లో నెల్లూరికి పోయి ఎంసెట్‌కి కోచింగ్ తీసుకుంటాను''

"మళ్ళీ నెల్లూరికి ఎందుకయ్యా ఇప్పుడు? రేపు పాసయిన తరువాత ఒంగోల్లో చదువు కుందువులే! పెద్ద చదువులు చదివించలేను ఇయ్యేడు!" అన్నాడు అంజయ్య.

"ఈ రెండేళ్ళనించీ కష్టపడి చదివిన చదువు అంతా వ్యర్థమైపోయిద్ది. నేను ఎంసెట్ రాస్తా. కోచింగ్ తీసుకుంటే నాకు సీటు గేరంటీగా వచ్చిద్ది''

"కాలం బాగలేదయ్యా ఇయ్యేడు. పత్తిలో బాగా దండగపడ్డాం. తిండికి జరగడం కూడా అంతంతమాత్రంగా వుంది!"

"నాకు అయ్యేం తెలియదు బాబా. కాలం బాగలేదని నా చదువునీ, భవిష్యత్‌నీ పాడుచేసుకొమ్మంటావేంది? నాకు రెండు రోజుల్లో మూడు వేలు చూసి ఇయ్యి. నెల్లూరికి పోయి కోచింగ్ తీసుకుంటాను'' ఖండితంగా అన్నాడు హనుమంతరావు.

తండ్రీ కొడుకులకి వాదన జరిగేటప్పుడు అంజయ్య అమ్మా, రాజమ్మా, శారదా, అన్నపూర్ణ అందరూ వున్నారు. ఎవరూ ఏం మాట్లాడలేదు.

కొడుకు చదువుకుంటానంటే చదివించలేకపోతున్నానే అని అంజయ్య మనసుకి కూడా కష్టంగానే వుంది. అయినా తను నిస్సహాయుడు! చేతిలో పైసాలేదు. కనీసం అప్పు అయినా ఇచ్చేవాడు లేడు.

"అబ్బాయి చదువుకి డబ్బు కావాల్సివచ్చే! అప్పులవాళ్ళు ఇళ్ళ చుట్టూ తిరిగిపోతండ్రి. మరి అమ్మాయి యవారం ఎట్టచేసేటట్టు? అది పసి బిడ్డల్ని వదిలిపెట్టి వచ్చి రెండ్నెల్లు అయింది. నీ ఇబ్బందుల్ని చూసి అడగడానికి నోరు రాకపోతండే! అయినా అమ్మాయి ఎంతకాలం వుండిద్ది ఇక్కడ, చెప్పు?" అంది అంజయ్య అమ్మ.

"నన్ను ఏం చేయమంటావే ఇప్పుడు? అన్నీ ఒక్కసారే చుట్టుముట్టే!"

"నా ఎకరం అయినా అమ్మి పారేసి అమ్మాయి బంగారం తెచ్చి ఇయ్యి, తరవాత నా తంటాలు నేను పడతా. కూలీనాలీ చేసుకునో, ఇల్లిల్లూ అడక్కతినో ఎట్టోకట్ట బతుకుతా!"

"నీ పొలం ఎందుకే, నా పొలం అయినా అమ్మిపారేసి అమ్మాయిని పంపిస్తాకానీ ఇక్కడ అట్టిపెడతానూ? ఒకవేళ చేసుకుంటానంటే పొలం ఆయనకే ఇద్దాం. అమ్మేది ఎందుకు? రెండు రోజుల్లో పెద్ద మడుసుల్ని తీసకపోయి మాట్టాడివస్తానే!" అన్నాడు అంజయ్య.

★ ★ ★

"మీ మేనత్త కొడుకు మందుతాగి చచ్చిపోయాడంట. రాచపూడినించి కబురువచ్చింది'' దడి దగ్గరకి వచ్చి చెప్పింది రాజమ్మ.

"ఎవురూ గంగయ్యా? అయ్యో పాపం! నలుగురు బిడ్డలే వాడికి! పాపం వాళ్ళగతేం కావాలి? ఎందుకు తాగేడంట మందు?"

"ఏమో, నాకేం తెలుసు? మనిషి వచ్చాడు. పోదాం. తొందర చేసుకునిరా'' అని రాజమ్మ ఇంటికి వెళ్ళిపోయింది.

చచ్చిపోయిన గంగయ్య భార్య తరపు బంధువులు వుంటే వాళ్ళూ, అంజయ్య వాళ్ళూ అందరూ కలసి కాలినడకన రాచపూడి వెళ్ళారు.

గంగయ్య ఇంటిముందు ఇసుకవేస్తే రాలనంత జనం. గంగయ్య బిడ్డలూ, భార్యా, తల్లీ, చెల్లెళ్ళూ అందరూ శవంమీద పడి ఏడుస్తున్నారు.

"చెట్టంత మనిషి. పుటక ఏం పుటక?"

"ఇంత మాత్రం పుటక వున్నవాళ్ళు వూళ్ళో ఎవురు వున్నారు? పుటకే కాదు, మనిషి మాత్రం ఎసుమంటోడు? తట్ట అల్లినా, తాడునేసినా, చిక్కం వేసినా, పగ్గం వేసినా ఎంతసోగ్గా

వుండేది పని! ఎంత పనోడు, ఎంత పనోడు!" అని జనం నోటిమీద చేతులు వేసుకుంటున్నారు.

"అరకదున్నినా ఎంతసోగ్గా దున్నేవోడు, నాగిటి కోంద్ర యేసాడంటే చెప్పే పనేముంది? కాగితంమీద గీత వంకరపోయిద్దేమొ కానీ, గంగయ్య కోంద్ర వేసాడంటే వంకర అన్న మాటే వుండిద్దీ?"

"ఎందుకు తాగేడంట మందు?"

"ఎందుకేముంది? పత్తిలో దండగపడ్డాడు. పత్తికి లక్షరూపాయలు పెట్టుబడి పెడితే నిండా పాతికవేలు చేతికి రాలా! అప్పులోళ్ళు చంపక తింటంటే ఏం చేస్తాడు? మందు తాగి చచ్చిపోయాడు పాపం!" జనం రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు.

అంజయ్యా, వాళ్ళ అమ్మా, రాజమ్మా దహనం చేసేవరకూ వుండి తిరిగి వచ్చారు.

గంగయ్యని చూసి వచ్చిన తరువాత అంజయ్యకు కూడా చచ్చిపోవడమే మంచిదనిపించింది. సమస్యల్ని ఎదుర్కొనే సత్తా తనకిలేదు. తను బతికివుంటే కుటుంబం ఇంకా ఇక్కట్లపాలు కావాలి. చావు తప్ప అంజయ్యకి మరో ఆలోచన, మరోమార్గం కనపడలేదు.



"అబ్బాయి అన్నం తినడం లేదురా అంజియ్యా! ఊరునించి వచ్చిన రోజు తిన్నాడు. అంతే, ఈ 3 రోజుల్నించీ మంచినీళ్ళు కూడా తాగడం లేదురా. అసలే ఒంటి వూపిరోడు! నువ్వన్నా అడిగి చూడ్రా''

"ఎందుకంట అన్నం తినంది?"

"చదువుకి పోవటానికి డబ్బులు ఇచ్చిందాకా అన్నం తిననంటే తినను అంటన్నాడ్రా! నేను అడుగుతుంటే నన్ను యిదిలిచ్చికొడతన్నాడు. వాళ్ళ అమ్మ నిన్నా, మొన్నా అడిగి ఇప్పుడు పట్టిచ్చుకోవడంలేదు!" అంజయ్య అమ్మ ఏడుస్తూ కొడుకుతో చెప్పింది.

"నేను పట్టిచ్చుకుని ఏం చేస్తానత్తా. ఈ కొంపలో నా మాటని ఎవురు విని చస్తన్నారు? వాడ్ని నువ్వు పది రోజులు బతిమలాడి అన్నం తినిపించు! వాడి పందెం వాడికి నెగ్గాలి! తినకపోతే తినకపోయాడ్లే. చావనీయ్, వాడే చస్తాడు! ఈ పాడుకొంపలో వుండి మాత్రం ఏం వుద్ధరించాలి?" వస్తున్న ఏడుపుని దిగమింగుకునే ప్రయత్నంలో క్రింది పెదవిని పై పంటితో నొక్కి పడుతూ అంది రాజమ్మ.

"సరేలే, ఇంక నోర్మూసుకో!" అంజయ్య భార్యని కోప్పడి, హనుమంతరావుని బతిమలాడాడు.

"నన్ను కోచింగ్‌కి పంపించిందాకా నేను తినను. మీరు ఎంతసేపు బతిమలాడినా , నన్ను తిట్టినా, కొట్టినా అంతే!" మొండిగా అన్నాడు.

కొడుకు పట్టు వుడుంపట్టే! ఆ విషయం అంజయ్యకీ తెలుసు.

మరి ఏం చేయాలో దిక్కుతోచటం లేదు!

ఇంట్లో బియ్యంలేక రాత్రిపూట కూడా జొన్నసంకటే తింటున్నారు. గొడ్లుకి మేతలేక రాగి ఆకూ, తుమ్మఆకూ, తుమ్మకాయ మేపుతూ నానా బాధలు పడుతున్నారు.

అప్పు ఇచ్చేవాళ్ళు కూడా ఎవురూలేరు. తెల్సిన వాళ్ళ దగ్గిరా, బంధువుల దగ్గిరా, అందరి దగ్గరా అప్పులు తీసుకున్నారు. ఏం చేయాలి?

చదువుమీద కొడుక్కి వున్న పట్టుదలకీ, శ్రద్ధకీ ఒకవైపు సంతోషిస్తుంటే అంజయ్య

మనసు, అతనిని చదివించుకోలేని చేతకానిత నానికి మరోవైపు విచారపడుతోంది.

"తల తాకట్టుపెట్టి అయినా రెండు రోజుల్లో డబ్బు చూసి నిన్ను పంపిస్తానయ్యా! నీ మాట ప్రకారమే చదువుకోమరి. లేచి రెండు ముద్దలు తినయ్యా!"

"నాకు డబ్బులు ఇచ్చినెల్లూరు పంపించే రోజే తింటా!"

"ఇప్పటికిప్పుడు డబ్బులు కావాలంటే ఎక్కడ్నించి వస్తయ్యయ్యా? అన్నం తిన కుండా ఎన్నిరోజులు వుంటా చెప్పు. లేచి తినయ్యా!"

"... ... ..."

"ఇల్లో, పొలమొ అమ్మి అయినా నీకు రెండురోజుల్లో డబ్బులు ఇచ్చి పంపిస్తాగా! అన్నం తినకుండా అప్పటివరకూ ఎట్ట వుంటా చెప్పు, లే, లేచి తినరా!"

హనుమంతరావు దగ్గరనించి మౌనమే సమాధానం. అంజయ్యకి కోపమూ, విసుగూ, చిరాకూ అన్నీ వస్తున్నాయి. రెండు దెబ్బలు కొట్టి అన్నం పెట్టడానికి అతను పసివాడు కాదు. కొట్టినందువలన అతను ఇంకా మొండి కి పడటం తప్ప ప్రయోజనంలేదు.

అడిగీ అడిగీ అంజయ్య దడి దగ్గరకి వెళ్ళిపోయాడు.

రాజమ్మ అంతకు క్రితంరోజు చాలాసార్లు బతిమాలాడింది. ఆరోజు వుదయం, సాయంత్రం రెండుసార్లు పళ్ళెంలో అన్నం వేసుకుని, కలిపి, బతిమాలాడుతూ అతని నోటిలో పెట్టడానికి ప్రయత్నించినా అతను తినలేదు.

"నువ్వు తింటేనే, నేను తింటాన"ని కొడు కుని బెదిరించి తను కూడా అన్నం తినడం మానుకుంది.

★ ★ ★

అంజయ్య ఇంటిదగ్గర వున్నంతసేపూ తగా దాయే! దడి దగ్గరనించి ఇంటికి వెళ్ళాలంటే భయంతో వణుకుతూనే ఇంటికి వెళుతున్నా డు.

రమాదేవికీ, అన్నపూర్ణకీ బట్టలు లేవు. పెళ్ళీడు పిల్లలు. వాళ్ళు ఇద్దరూ బట్టలు తీసుకొమ్మని రోజూ గొడవ.

రాజమ్మ కూడా బాగా చిరిగినబట్టలే కట్టు కుంటోంది. అయినా తనకి బట్టలు కావాలని అడగదు. సాధింపులు తప్పడంలేదు.

హనుమంతరావు అన్నం తిని నాలు గోరోజు. తనని కోచింగ్‌కి పంపించే వరకూ తిననంటే తినను అని మొండిపట్టు!

ముందు శారదని భర్త దగ్గరకి పంపించాలి. పిల్లలమీద దిగులుపెట్టుకుని మనిషి బాగా నీరసించిపోయింది.

ఎక్కడైనా డబ్బు చూసి కానీ, ఆమె భర్తతో మాట్లాడిపొలం ఇచ్చి అయినా శారదని పంపించమని తల్లి తగాదా! తల్లి ప్రతీరోజూ ఏడవడమే!

ఇక తిండి గింజలు లేవు.

గొడ్ల మేత లేదు.

ముందురోజు సత్యం వచ్చి డబ్బులు అడిగి రభస చేసిపోయాడు.

వెంకట్రామయ్య పొలం రిజిస్టర్ చేయమని అడుగుతున్నాడు. డబ్బు అయినా, పొలం రిజిస్టర్ అయినా- రెంటిలో ఒకటి చేయకపోతే మాత్రం వూరుకునే పనిలేదని మాట్లాడుతున్నా డు. వెంకట్రామయ్యాని తప్పించుకుని తిరగా ల్సి వస్తోంది. ఎన్ని రోజులు కనపడకుండా తప్పించుకోవడం సాధ్యం?

తనకి ఇవ్వవలసిన మగతా డబ్బులు ఇవ్వమని తమ్ముడు అడుగుతున్నాడు. అక్కడ బళ్ళారిలో ఆయనకీనష్టం! తిరిగి బళ్ళారి వెళ్ళడానికి చార్జీలు కూడా లేవనీ, సగం అయినా ఇస్తే తప్ప తను వెళ్ళలేనని చెపుతున్నాడు.

బామ్మర్ది వుత్తరం మీద వుత్తరం ఘాటుగా రాస్తున్నాడు. ఆ వుత్తరాలు చదివి రాజమ్మ బాధపడుతోంది. అతను ఎప్పుడో వచ్చినా

రావచ్చు.

రామస్వామీ, అతని భార్యా ఒకరివెంట ఒకరు అలుపూ, సొలుపూ లేకుండా తిరిగి డబ్బు అడిగిపోతున్నారు.

సొసైటీ నారాయణ ఒకరి బాకీ అయినా జమచేయమంటున్నాడు.

ఇప్పటికిప్పుడు పిల్లవాడ్ని చదువుకి పంపించినా, వాడి చదువు అయిపోయేవరకూ తను చదివించగలడా? అన్నపూర్ణకీ, రమాదేవి కీ తను పెళ్ళి చేయగలడా?

అడుగడుగునా సమస్యలే! అడుగడుగునా బాధలే! ఆలోచిస్తుంటేనే తల పగిలిపోతోంది. ఈ బాధలు భరించడం తన వల్లకాదు.

ఈ బాధలు ముందుముందు ఇంకా పెరుగుతాయేకానీ తగ్గే అవకాశం లేదు.

ఈ బాధలనించి విముక్తి ఎలా? ఎలా తను ఈ బాధలనించి బయటపడగలడు?

చచ్చిపోతేనే తను సమస్యలనించీ, బాధల నించీ బయటపడగలడు!

అంతకంటే మరో దారిలేదు!

★ ★ ★

ఎద్దులకి బేరం వచ్చింది.

"ఎద్దులకి వంక అనే మాటేలేదు. లాగుడు కానీ, దున్నడం కానీ ఒకసారి చూసుకునే డబ్బులు ఇవ్వండి. ఎద్దుల్లో ఏమైనా తేడా వుంటే నాకు పైసా ఇవ్వవద్దు'' అన్నాడు అంజయ్య.

"అసలు ఇయ్యాల ఇసుమంటి ఎద్దులు మన చుట్టుపక్కల దొరుకుతయ్యా? అమ్మకో వాల్సిన ఎద్దులేనా ఇయ్యి? ఈడికి పెద్దమ్మో రు నెత్తికెక్కి అమ్ముతున్నాడు కానీ, ఈ ఎద్దులకి అసలు లోటేముంది?" అన్నాడు పక్క కొష్టం భీమయ్య.

అంజయ్య ధర 7 వేలు చెప్పాడు.

వచ్చిన వాళ్ళు 3 వేలకి అడిగారు. మేతలే దు. ఇబ్బందుల్లో వున్నాడు. ఎంతకైనా సరే



అమ్మకోక తప్పదు అని తక్కువకి అడిగారు.

"ఈ ఎద్దులు ఆరున్నర వేయికి తక్కువ చేస్తయ్యా? వీడు బాధల్లో వున్నాడని ఇంత అడ్డగోలుగా అడుగుతారూ? ఎద్దులూ గిద్దలూ అమ్మడ్లే పొండి! మేత నేనే రెండు బళ్ళు కొనిపెడతా!" భీమయ్య కోపంతో అన్నాడు.

చివరికి 37 వందలకి బేరం కుదిరింది.

"ఇయ్యాల రైతుల్లో వుసిలేదు. ఎద్దుల్ని అమ్మేవాళ్ళేకానీ, కొనే వాళ్లు లేరు! పదివేలు చేసే కాపుగారి ఎద్దుల్ని మొన్న ఆరువేలకి అమ్ముకున్నారు'' దళారి సుబ్బన్న అన్నాడు.

"ఎద్దులు చౌకగా కొట్టేసార్లే! పుండు వున్న వేలికే ఎదుర్రాయి తగిలిద్దంట! మావోడు అస లే దండగల్లోవుంటే దానికి తోడు ఎద్దులు కూడా నీలక్కూలికి కొట్టేస్తిరి!" భీమయ్య అన్నాడు.

వంద రూపాయలు బయానా ఇచ్చి, మరు సటి రోజు మిగతా డబ్బుకట్టి ఎద్దుల్ని తోలుకు పోతామని చెప్పారు.



★ ★ ★

అంజయ్య పెద్దమ్మ కొడుకు గంగవరంనించి వచ్చాడు. అతనిపేరు కూడా అంజయ్య. బంధువులు ఇతనిని చిన్నంజయ్యా అంటారు. అయితే ఇద్దరిదీ ఒకే ఈడు. చిన్నప్పుట్నించీ ఇద్దరూ సావాసంగా వుంటారు.

అతని చిన్నమ్మ ఏడుస్తూ వాళ్ళ కష్టాల్ని ఏకరువుపెడుతోంది.

"ఊరుకో, ఏడ్చేది ఎందుకు? నేనూ, వీడూ చందలూరు వెళ్ళి శారద మొగుడితో మాట్లాడి వస్తాంగా! కాలం ఇట్టవచ్చిద్దీ, పత్తి ఇట్ట తిరగబడి పోయిద్దీ అని ఎవురు అనుకున్నారు? ఏదో ఒకటి చేద్దాం కానీ ఏడవ్వాకు'' అని ఆయన చిన్నమ్మని సముదాయిస్తున్నాడు.

దడి దగ్గరనించి వచ్చిన అంజయ్య చిన్నంజయ్యని చూసి సంతోషించాడు.

"ఎప్పుడు వచ్చావురా?"

"వచ్చి కొద్దిసేపు అవతందిరా. ఏం చేస్తన్నా?"

"ఏముందిరా చేయడానికి? అప్పులూ, బాధలూ తప్ప యెగసాయంలో లాభం కనపట్టంలా! చదువుకి పంపించలేదని పిల్లోడు అలిగి నాలుగురోజులు అవతందిరా అన్నంతిని''

"ఏడీ వాడు?"

"సావాసగాళ్ళ దగ్గరకి పోయాడు బాబాయ్'' అంది అన్నపూర్ణ.

"పోయి వాడ్ని పిలుచుకొని రామ్మా రమాదేవి! మా మాదిరిగానే మీ వూళ్ళో కూడా అందరికీ దండగలేనంట కదరా?"

"దండగల సంగతి సరే, మా వూళ్ళో జనాలకి ఇంకా పెద్ద దెబ్బతగిలిందిరా! బుర్ర కతల ఎంకటప్ప అనీ, ఇప్పుడు లేడ్లే, వాడి మనవడు రేటు ఎక్కువపెట్టేసరికి అందరం

పత్తి ఇచ్చేం. పది రోజుల్లో డబ్బులు ఇస్తానని పత్తి తీసుకపోయి, ఇప్పుడు అందరికీ మొండి చేయి చూపిస్తున్నాడు. ఎవురికీ డబ్బు ఇచ్చేట ట్టు లేడురా!"

"అయితే యట్ట మరి? మా వూళ్ళో కూడా మూడేళ్ళనాడు ఇట్నే జరిగిందిరా! ఒకడు 2 వందల బస్తాల వేరుశనక్కాయలు కొనుక్కు పోయి డబ్బులు ఇవ్వలా! మేమందరం లారీ వేసుకుని ఆ వూరు పోయి వాడి ఇంటిమీద పడ్డాం. నాయాల్ని ఇంటిలో నించి బయటకి లాగి తన్నేం. మా జనం ఇంటినీ, వాడ్నీ తగలబెట్టడానికి కూడా పూనుకున్నారు. దెబ్బ కి అందరికీ పైసలతోసహా ఇచ్చాడు. మీరు కూడా అట్నే ఏదో ఒకటి చేయకపోయారా?"

"అట్ట చేయడానికి ఎవురూ కలిసిరావడంలే దురా! నా మట్టుకి ఇయ్యి, నామట్టుకి ఇయ్యి అని ఒకరికి తెలియకుండా ఒకరు గుట్టుగా తిరుగుతన్నారు. కొంతమందిమి అయినా పోయితన్ని వసూలు చేసుకుందామంటే వాడి కింద రౌడీలు చాలామంది వున్నారంట! పోలీ సోళ్ళు కూడా వీడు ఎంత చెబితే అంత అంట!"

"చూస్తాచూస్తా అసుంటోడికి ఎట్ట ఇచ్చార్రా పత్తి?"

"అందరకీ శనిగ్రదం చుట్టుకుందిరా! లేకపో తే అందరం యేలం యెర్రిగా ఇచ్చివుండేవాళ్ళ మికాదు''

"బజారునించి హనుమంతరావు వచ్చా డు. చిన్నంజయ్య అతనిని చాలా సేపు బతిమ లాడాడు.

"మీ నాన్న వల్లగాకపోతే నేను రేపు వెయ్యి రూపాయలు తెచ్చిస్తారా! నువ్వు వెళ్ళు. వారం రోజుల్లో నేనో, మీనాన్నో మిగతా డబ్బు తీసుకవచ్చి కడతాం. నువ్వు ముందు అన్నం తిను. నా మాటని నువ్వు వినకపోతే, ఇంక మీకూ, మాకూ ఇంతటితో చెల్లు!" అని బెది రించాడు.

"ఇప్పటికే కోచింగ్ బిగిన్‌చేసి వుంటారు. నువ్వు రేపు తెచ్చిస్తానంటే తింటా!" అన్నాడు హనుమంతరావు.

"అట్నే తెచ్చిస్తా తిను. అమ్మాయ్ శారదా వాడికి అన్నం పెట్టు!" అని చిన్నంజయ్య, హనుమంతరావుతో అన్నం తినిపించాడు.

"శారద యవారం ఏదో చెయ్యండయ్యా!" అంది అంజయ్య అమ్మ.

శారద విషయం అంతా వివరంగా చెప్పి "యట్టచేద్దాంరా?" అని అడిగాడు అంజయ్య.

చిన్నంజయ్య ఆలోచించి అన్నాడు. "నువ్వు శారదకి బంగారం ఇప్పుడల్లా ఇవ్వలే వురా! కాలం గడిచేకొద్దీ వడ్డీ కూడా పెరిగిద్ది. అది బేంకిలోనించి కూడా తియ్యలేవు. శారద వాళ్ళకి కొద్దో గొప్పో డబ్బులు వున్నాయ్‌గదా? వాళ్ళనే బేంకిలోనించి తీసుకొమ్మని, దానికి బదులుగా మనం పొలం ఇద్దాం. అంతకంటే ఏం చేయడానికీ తోసుబాటు కావడంలేదురా!"

అంజయ్యకు కూడా అదే సమంజసమని పించింది.

"సరే, అట్నే చేద్దాంరా!"

"రేప్పొద్దున నువ్వూ, నేనూ పోయి మాట్లా డదాం. బయమేముంది?"

"ఎద్దులు అమ్మేంరా! కొన్న వాళ్ళు రేపు వచ్చి ఎద్దులు తోలకపోతారు. నువ్వూ, రామ య్యా పోయిరండి''

"నువ్వు వస్తే బాగుండిద్దిరా! ఆయన బంగా రమే కావాలంటాడో, పొలం కావాలంటాడో, ఇంకేం కావాలంటాడో అప్పుడే తేలిపోయిద్ది. ఇద్దరి సమక్షంలో తేల్చుకోవచ్చు. రామయ్యా వచ్చి ఏం మాట్లాడతాడు? ఎద్దులు రామయ్యా అయినా తోలి పెడతాడుగా! ఎవరయినా చేసే దేముంది, డబ్బులు తీసుకుని తోలిపెట్టడమే గా!"

మరుసటిరోజు అంజయ్యలు ఇద్దరూ చంద లూరు ప్రయాణమయ్యారు.

"రామయ్యా, ఎద్దులు కొన్నవాళ్ళు వస్తారు ఇయ్యాల. వాళ్ల దగ్గర డబ్బులు తీసుకొని ఎద్దులు తోలిపెట్టు. వంద రూపాయలు బయా

నా ఇచ్చారు. ఇంకా 36 వందలు ఇవ్వాలి'' అని తమ్ముడికి చెప్పి అంజయ్య వెళ్ళిపోయాడు.

★ ★ ★

మధ్యాహ్నం ఎద్దులు కొన్నవాళ్ళు వచ్చారు. రామయ్యకి 36 వందలు ఇచ్చి ఎద్దులు తోలుకొని పోయారు.

రామయ్య ఆ డబ్బుల్లో అంజయ్య ఇవ్వవలసిన మగతా డబ్బులో 3 వేలు తను తీసుకుని, ఇంటిదగ్గర తల్లికి 6 వందలు ఇచ్చాడు.

"నాకు ఇవ్వాల్సిన మగతా డబ్బులకిగాను 3 వేలు తీసుకున్నానమ్మా! ఈ 6 వందలూ వదినకివ్వు''

రాజమ్మ ఇంట్లోనించి బయటకు వచ్చింది.

"మగతా డబ్బులు తరువాత తీసుకుందువులే రామయ్యా! 10 రోజుల్నించీ వుంటన్నావు. ఇంట్లో పరిస్థితి తెలుసుకదా?"

"మేము బళ్ళారి వెళ్ళడానికి చార్జీలకి కూడా డబ్బులు లేవు వదినా! మాకు కావద్దూ?"

"పిల్లోడు నాలుగు రోజుల్నించీ పస్తువుంటున్నాడు. చదువు యవారం తరవాత, మీ అన్న ఒక బస్తా బియ్యం, వరిగడ్డి బండి ఒకటి ఎద్దుల డబ్బులతో తీసుకుంటానని మీ అమ్మతో అంటన్నాడుగా రేత్రి''

"మగతా తక్కువకి అనుకున్నా ఇంకా నాకు ఐదారు వేలు రావాలి. సగం అయినా ఇవ్వకపోతే యట్టా? వేరేవాళ్ళకి పొలం ఇచ్చుకుంటే, పంట వేయకముందే, ఏడాదికిందటే మగతా ఇవ్వకపొయ్యారూ?"

"నీ మగతా ఇస్తాంలే, మేం నీ మగతా ఎగ్గొట్టం!"

"మీరు ఇవ్వరని ఎవురన్నారు ఇప్పుడు?"

"ఒకరు అనాలా, మేం నీ డబ్బు ఇవ్వం అనేగా నీ చేతికి వచ్చిన ఎద్దుల డబ్బులు బిగపట్టుకుంది?" రాజమ్మ బాగా కోపంతో అంది.

రామయ్య మౌనంగా వున్నాడు.

"నేను కొరిశపాడు పోతన్నానమ్మా! అన్న వస్తే నాకు ఇవ్వాల్సిన మగతా డబ్బు కొరవ కూడా ఇవ్వమని చెప్పు. మాకు పనిలేదా ఏంది డబ్బులతో? అందరి సొమ్మూ ఒకటే!" అని రామయ్య అత్తవారి వూరు వెళ్ళిపోయాడు. ఆయన భార్యా, పిల్లలూ అక్కడే ఉన్నారు.

రామయ్య వెళ్ళిన తరువాత రాజమ్మ అన్నం కూడా తినకుండా ప్రత్యక్షంగా భర్తనీ, పరోక్షంగా కుటుంబాన్నీ తిడుతూ కూర్చుంది.

రాజమ్మ సూటీపోటీ మాటల్ని భరించలేక శారద తగాదా వేసుకుంది.

"ఎవురి ఇబ్బందులు వాళ్ళకుంటాయి. చిన్నన్న ఆయన కివ్వాల్సిన మగతా డబ్బులు ఇవ్వమన్నాడుగానీ, మీ డబ్బు ఏం ఇవ్వమని అడగలేదుగా?"

"అబ్బో, అన్నని అంటే చెల్లెలికి రోషం వచ్చిందిగామాలి! అంతేలే, నీళ్ళు పల్లానికే పారతయ్‌గానీ, ఎగవకి ఎందుకు పారతయ్? మీరూ మీరూ ఒకటి అవతారుగానీ, మేం ఎందుకు అవతాం? ఎనిమిదేల రూపాయల ఎద్దులు మూడేలకి ఎందుకు అమ్ముకున్నాం? గడ్డిపాసా, బియ్యపు గింజా లేదనేగా! నీతి వున్నవాడైతే ఆయన చేతికి ఇచ్చిన డబ్బు మాది మాకు ఇచ్చి, తరువాత మగతా తీసుకో వచ్చుగా? చేతికి డబ్బులు దొరికినయ్యని కాజెయ్యడమేనా?"

"మీ డబ్బేం కాజెయ్యలా, ఆయనకివ్వాల్సిన డబ్బే తీసుకున్నాడు''

"ఇయ్యాల్సిన డబ్బే, యెనకా ముందుగా ఇయ్యమూ? నిరుడేమొ పొలం కొన్నానని అబద్ధం చెప్పి డబ్బులు తీసకపొయ్యాడు. ఆ అబద్ధపు కూడు తినకపోతేనేం? ఇయ్యాల్సిన డబ్బు ఇయ్యమంటే కొడతారూ?"

"నువ్వు కొడతావని బయం పుట్టి అబద్ధం చెప్పాడ్లే!"

"అసలు నీగుండా గదూ ఇయ్యేడు మేం

దండగలపాలయ్యింది! నువ్వు బంగారం తెచ్చి ఇయ్యకపోతే పత్తి తోటలే ఎవురోకరికి అమ్ముకుని ఉండేవాళ్ళమి. ఇంత దండగలపడి ఉండేవాళ్ళమి కాదూ, కాపరం ఇంత గుల్ల అయ్యేదీ కాదు!"

"మీ ఆయన వచ్చి అడిగితే ఇచ్చానా, నా అంతట నేను ఇచ్చానా? మీ అవసరాలకి ఇచ్చి గూడా ఇయ్యాల నేనే తప్పుడు దాన్నయ్యాగా? నా కాపరం చెడిందిగానీ, మీ కాపరం ఏమన్నా చెడిందీ?"

"మా కాపరం చెడితే నీ కళ్ళు పచ్చబడతయ్యి గామాలి! నీమాదిరిగా నాకు పుట్టింటో కాలుమీద కాలు వేసుకుని కూర్చుంటే పెట్టేవాళ్ళు లేరమ్మా! నీమాదిరిగా నాకు జరగదమ్మా. నీమాదిరిగా పుట్టింటిమీదకు వచ్చిపడితే నన్ను నా అనేవాళ్ళు లేరమ్మా!" అంది రాజమ్మ.

సాయంత్రానికి అంజయ్య వచ్చాడు.

ఇంట్లో అందరూ ముభావంగా ఏవరిమటుకు వాళ్ళు ఉన్నారు. శ్మశానప్రశాంతిలా వుంది వాతావరణం.

అంజయ్య ఏదో జరిగిందని ఊహించాడు.

కండవ తలకింద పెట్టుకుని మంచంమీద పడుకున్నాడు. చాలా సేపటికి తల్లి అడిగింది.

"చిన్నంజయ్య ఏడీ?"

"అట్నించటే వాళ్ళ ఊరు పొయ్యాడు. మళ్ళీ రెండ్రోజుల్లో వస్తానన్నాడు''

"ఏమన్నాడు శారదవాళ్ళ ఆయన?"

"ఆయన బంగారానికి రెండు ఎకరాలు పొలం కావాలంట! రెండు ఎకరాల పొలం ఇచ్చేపనయితే శారదని తీసుకొచ్చి వదిలిపెట్టండి, లేకపోతే లేదు అన్నాడు''

"ఏదో చేసి పంపించు నాయనా అమ్మాయిని. నీకు బంగారం ఇచ్చి, నీ పెళ్ళాంతో తిట్లు ఎక్కడ తినిద్ది ఆ పిల్ల! దానిగుండా నీ కాపరం గుల్ల ఎందుకు కావాలి?"

"ఏమైందే ఇప్పుడు?"

"ఏదయినా కానీయి, ఎందుకు మాటలు? నువ్వు ఎట్టయినా చేసి, శారదని రెండురోజుల్లో దాని ఇంటికి పంపించు''

"పంపించకుండా ఇక్కడ అట్టిపెడతానా ఏంది?"

"ఎప్పుడూ పంపించేది? అది వచ్చి ఎన్నినెల్లు అవతంది? నువ్వు పొలం అమ్ముకో, ఇంకొకటి అమ్ముకో, ఇంకొకటి అమ్ముకో! అమ్మాయినిమాత్రం దాని బిడ్డలదగ్గరకి చేర్చు నీకు పుణ్ణెం ఉండిద్ది''

"ఏం జరిగిందే ఇయ్యాల, ఎద్దులు తోలక పొయ్యారా?"

"మజ్జెన్నం తోలకపోయారు. రామయ్యకి వాళ్ళు డబ్బులు కడితే వాడు 30 వందలు తీసుకుని, 6 వందలు నా చేతికి ఇచ్చాడు. వాడికి బళ్ళారికి పోవటానికి చార్జీలు లేవని చెప్పి డబ్బులు తీసుకున్నాడు. దానికి మేమేం చేసేది? నీ పెళ్ళాం నోరు ఎట్ట అంటే అట్ట పాడుపడింది''

"ఆ, నా నోరు పాడుపడింది. లేకీ గుంపూ, లేకీ బుద్ధులూ గాకపోతే మన డబ్బులు మనకి ఇచ్చి, తనకి ఇవ్వాల్సిన డబ్బులు ఇవ్వమని అడక్కూడదూ? చేతికి దొరికినయ్యని కాజెయ్యడమేనా?"

"పిల్లోణ్ణి బడికి పంపించాల, కావాలని అడక్కపొయ్యావంటే?" అంజయ్య తల్లిని అడిగాడు.

"నీ పెళ్ళాం అనే మాటలకి వాడి చేతికి వచ్చిన డబ్బులు వాడు ఎందుకు ఇస్తాడ్రా? మిగతా మగతా కూడా కట్టమన్నాడు''

"డబ్బులు తీసుకుంటే అన్నానా నేను మాటలు, ఊరకనే అన్నానా? బుద్ధి పెరక్కుండా, వయసు పెరిగితే ఏంలాభం? చిన్నకొడుకుమీద అంత బెమ ఉండదానివి ఆయనతోనే నువ్వుకూడా పోకపొయ్యా, చిన్నకోడలు పెట్టేది గెంట కాలేసి వాత! నా ఇంటో ఎందుకు?"

"కొద్దిగా నోటితో పద్ధతిగా రానీయ్ మాట

లు అద్దూ ఆపూ లేకుండా మాట్లాడవాకు'' భార్యని హెచ్చరిస్తూ అన్నాడు అంజయ్య.

"నేను ఏం తప్పు చేస్తే అద్దూ ఆపూ వుండాల? నువ్వు అధవగతివాడివీ, పనికిమాలినవాడివీ అయితేనే నాకూ, నా బిడ్డలకీ ఇన్ని చెరలు వచ్చినయ్! నువ్వు సరైన మగవాడివైతే ఇయ్యాల ఇన్ని తిప్పలు ఎందుకు వస్తయ్?"

"ఏందే మళ్ళీ కుయ్ ఆ కూత?" అంటూ మంచంమీద కూర్చున్న అంజయ్య ఒక్క ఊపుతో లేచి వెళ్ళి రాజమ్మ జుట్టు పట్టుకుని వంగతీసి వీపుమీద దభీదభీమని గుద్దాడు.

"ఏమేయ్, పంది తిన్నట్టు తిని అడ్డంగా బలిసి కొట్టుకుంటున్నావో! నీ... తాట వలుస్తా, ఏమనుకున్నావో! వళ్ళు కొవ్వెక్కి నోటికి ఎంత మాట వస్తే అంత మాట కూస్తున్నావే!" అంటూ భార్యని జుట్టు వదలకుండానే చేత్తో పటపటా కొడుతున్నాడు.

అంజయ్య అమ్మా, శారదా మౌనంగా ఉన్నారు.

అన్నపూర్ణ "ఊరుకో బాబా, ఊరుకో! ఎందుకు అమ్మని కొడతావు, ఊరుకో!" అంటూ తండ్రికి అడ్డంపోయింది.

అంజయ్య రెండుమూడు నిముషాలు కొట్టి "దీన్ని నిలువునా కోసినా పాపంలేదు'' అని కొద్దిసేపు బూతులు తిట్టాడు. తరువాత విసురుగా దడిదగ్గరికి వెళ్ళిపోయాడు.

కొద్దిసేపు తరువాత అన్నపూర్ణ కూడా ఇంట్లో అశాంతి వాతావరణాన్ని భరించలేక పొరుగింటికి వెళ్ళింది. అంజయ్య అమ్మ కూడా బయటకు వెళ్ళింది. క్రికెట్ ఆట పిచ్చితో హనుమంతరావు ఉదయం వెళ్తే సాయంత్రానికి తిరిగివస్తున్నాడు.

శారద పంచలో నులకమంచంమీద పడుకుంది.

రాజమ్మ ఇంట్లో ఉంది.

ఇంట్లో ఉన్న రాజమ్మ దృష్టి మూలగా ఉన్న గూట్లోని మందుడబ్బామీద పడింది. పత్తికి వేయగా మిగిలిన మందు అది. ఇంట్లో ఎవరూ లేరు. రాజమ్మ గూట్లోని మందుడబ్బాని తీసుకుని గటగటా తాగింది.

కొద్దిసేపటికి ఇంట్లోకి వచ్చిన రమాదేవి అమ్మ కిందపడి ఉండటం చూసింది. సక్కనే మందుడబ్బా ఉంది. రాజమ్మ నోట్లోనించి నురుగు, వాసనా వస్తోంది.

రమాదేవి బయటకు పరుగెత్తుకొచ్చి "అత్తా అత్తా అమ్మ మందు తాగింది అత్తా'' అంది పెద్దగా ఏడుస్తూ.

వీళ్ళ అరుపులకి అప్పటికప్పుడే జనం చేరారు.

రాజమ్మని బయటకు మోసుకువచ్చి మంచంమీద పడుకోబెట్టారు.

ఆ ఊళ్ళో డాక్టరు లేడు. పొరుగూరులో ఉన్న డాక్టర్‌కి ఫోనుచేయడానికి కొందరు పరిగెత్తుకొని ఫోన్ ఉన్న ఇంటికి వెళ్ళారు. కొందరు ఊళ్ళో వున్న ఆర్ఎంపీ డాక్టర్ని పిలుచుకురావడానికి వెళ్ళారు.

శారద బిత్తరపోయింది. అపవాదు తనమీదకు వస్తుందని భయపడిపోయింది. అందరూ రాజమ్మ గొడవలో ఉండటంతో ఇంట్లోకి వెళ్ళి తనూ డబ్బా తీసుకుని మందు తాగింది.

ఎవరో శారద తాగడం చూశారు. శారదని కూడా మరో మంచంమీద పడుకోబెట్టారు.

డాక్టర్‌కి ఫోన్ చేయడానికి వెళ్ళిన వాళ్ళు వచ్చి "డాక్టర్‌కి ఫోన్‌చేశాం. మోటారు సైకిల్ మీద బయల్దేరి ఇప్పుడే వస్తానన్నాడు'' అని చెప్పారు.

అయితే అప్పటికే రాజమ్మ ప్రాణాలు విడిచింది.

పొరుగూరినుంచి ఆ డాక్టరు వచ్చేసరికి శారద ప్రాణాలు కూడా పోయాయి.

వదినా, ఆడబిడ్డా కుటుంబ తగాదాల కారణంగా మందుతాగి చచ్చిపోయారని ఊళ్ళో జనం చెప్పుకున్నారు.

నిజానికి వాళ్ళ మరణాలకు కారణం ఏమిటి?

★



## సొంత డైలాగ్

పరాంకుశానికి సొంత డైలాగ్స్ అంటూ ఏంలేవు. చిన్నప్పుడు తల్లి డైలాగ్‌లను సొంతం చేసుకుంటే, ఎదిగాక భార్యమీద ఆధారపడ్డాడు. ఏ చిన్న సమస్యొచ్చినా...

"ఏమేవ్ అలివేలూ!" అంటూ ఓ కేకెట్టి ఆవిడ రాగానే "ఈ సమస్య ఇలా తగలడింది ఎలా?" అంటూ తలపట్టుక్కూర్చుంటాడు.

"ఓసి మీ పిరికితనం పిల్లెత్తుకుపోనూ! ఉపాయం లేనివాణ్ణి ఊర్లోంచి గెంటెయ్యమన లా పెద్దలు! దీనికే ఇంత ఖంగారుటండీ..." అంటూ సదరు సమస్యకి ఏదో ఓ పరిష్కారం సూచించేసి వెంటనే ఓ సంచి చేతికిచ్చి,

"బావుందిగాని సంబరం, బజారుకెళ్లి కూర గాయలు పట్రండి'' అంటుంది భార్యామణి.

అక్కడ కూరగాయలబ్బాయితో గూడా...

"చూడబ్బాయ్! ఆనపకాయలు గోరుదిగ డంలేదు. బెండకాయలు ముచిక విరగడంలే దు. దోసకాయలు చేదు చూసి తీసుకుంటా నంటే ఒప్పుకోవు. తోటకూర ఆకులు ఇలా పెద్దవిగావుంటే ముదిరినట్టే'' అంటూ భార్య డైలాగులన్నీ చెప్పి తిట్లు తింటూ వుంటాడు. ఒకవేళ అక్కడ తిట్లు తినకపోతే తర్వాత ఇంటి దగ్గర ఎలాగూ అక్షింతలు ఖాయం.

ఓసారి కిరసనాయిలు కోసం వెళ్లి సాయంత్రందాకా ఇంటికి రాకపోతే 'ఏమైపో యాడీయన' అనుకుంటూ రేషన్‌షాపుకి బయ లుదేరింది అలివేలు. తీరా అక్కడి చేంతా డంత క్యూలో అతనివంతు రావడానికి మరో అరగంట పట్టేలా వున్నట్టు గ్రహించింది.



ఇంటికొచ్చాక కాసిని మంచినీళ్ళిచ్చి ఉప న్యాసం ప్రారంభించింది.

"చూడండీ! క్యూ అంటే అలా వెర్రిమాలో కంలా దుకాణం మూసేదాకా నిలబడమని కాదు. అప్పుడప్పుడు ఒకళ్ళిద్దరిని తప్పించు కుని ముందుకెడుతూ వుండాలి'' అని.

కానీ మరోసారి కిరసనాయిలు కెళ్లినప్పుడు భార్య సలహా ప్రకారం అదే ట్రిక్ ఉపయోగించ బోయి, అందరిచేతా తిట్లు తిని అసలు చోటు కూడాపోయి ఆఖరికెళ్ళి నుంచున్నాడు అలివే లు మొగుడు.

ఎందుకంటే భార్య తెలివైనదనీ ఆవిడ చెప్పింది సబబే అనీ సదా అనుకుంటూవుంటా డు పరాంకుశం. కానీ రానురాను అతనిలో ఈ నమ్మకం సడలిపోతోంది. ఇంక లాభంలేదని తెలినా మరొక్కఛాన్సిచ్చి చూద్దామనుకున్నా డు.

ఆ మర్నాడే అలివేలుకి వేలువిడిచిన మేన మామ పెన్షన్ పనిమీద పల్లెటూరునుంచి పొద్దున్నే దిగాడు. పిల్లలు లేని ఆయన ఇంట్లో చిన్నప్పుడు అలివేలు ప్రతి వేసవికీ వెళ్లి రెండు మూడు వారాలపాటు ఉండి వస్తూవుండేది. ఆ రోజుల్లో ఆయన చూపిన ప్రేమాభిమానాల కారణంగా ఆయనకున్న ఆస్తిలో కొంత రాసిస్తా డన్న ఆశ అలివేలుకి లేకపోలేదు. అందుకే ఆయన రిక్షా దిగుతుండగానే భర్తకి చెప్పింది. "మామయ్యకి ఎలాంటి లోటూ రాకూడదు. ఉన్నన్నాళ్లూ విందుభోజనాలు పెట్టాలి'' అని. అసలే నెలాఖరు. ఆ ముసలాడిచ్చే ఆస్తి సంగతి దేముడెరుగ్గానీ, ఈ మర్యాదలకి అప్పెక్కడ పుడుతుందాని పరాంకుశం ఆలో చన.

పని అవలేదంటూ ఓ వారంపాటు తిష్టవే సిన అలిమేలు మేనమామకు ఆమెతోపాటు

పరాంకుశం కూడా సకల మర్యాదలూ చేశాడు. వెళ్లేటప్పుడు ఆయన

"అప్పుడప్పుడొచ్చి ఇలా నాలుగురోజులుంటానే అమ్మాయీ మీ ఇంట్లో! ఇక్కడ నాకు ప్రాణం హాయిగా వుందనుకో' అంటూ రిక్షా ఎక్కాడు.

ఆయన అలా వెళ్లిన వారంరోజులకు ఓ సాయంత్రం ఉగ్రనరసింహావతారంతో ఇంటి తలుపు తట్టాడు పరాంకుశం. తలుపుతీసిన



అలివేలు ఆ అవతారం చూసి బిత్తరపోయి బెదురుగా చూస్తుంటే ఆవిడ నోరెత్తకముందే ఓ ఉత్తరం చేతిలో పెట్టాడు పరాంకుశం. ఆ ఉత్తరంలో...

"అబ్బాయీ పరాంకుశం! మొన్ననే నా ఆస్థికి విల్లురాశాను. మీ కాపురాన్ని, ఆర్థిక పరిస్థితిని చూద్దామనే వచ్చాను. మీరిద్దరూ చిలకాగోరింకల్లా, చీకూచింతా లేకుండా నిత్యం విందుభోజనాలు చేస్తూ సుఖంగా వున్నట్లనిపించింది నాకు. అలాంటిమీకు నేను చేసేదేముంటుంది? అందుకే ఆస్థి అంతా అనాధాశ్రమానికి రాసేశాను..." అని ఉన్న భాగం చదువుకుని... "ఆ..." అని నోరు తెరవబోతున్న అలివేలు... నోరు మూయించే ప్రయత్నంలో... సొంత డైలాగ్‌లు ప్రారంభించాడు, పెంకులదిరేలా పరాంకుశం.

-రాధాశివమోహన్

## తృప్తి

"ఏయ్ పుల్లారావ్! ఈ ఫైలు టైపులో ఇవ్వమంటే డిశ్పాచ్‌లో ఇచ్చావేమిటి? నీకేమైనా చెముడా?" కోపంగా అన్నాడు రామనాధం.

"లేదు సార్! మీరు డిశ్పాచ్‌లో ఇవ్వమనే అన్నారు'' వినయంగా అన్నాడు పుల్లారావు.

"అంటే నేనేమైనా అబద్ధం చెప్తున్నానా? మళ్లీ దబాయిస్తావేమిటి? చెప్పింది చెయ్యడం నేర్చుకో'

రామనాధం ఆ సెక్షన్ ఆఫీసరు.

పుల్లారావు అక్కడ అటెండరు. వాళ్ళ నాన్న గూడా అక్కడ అటెండరే. అతను చనిపోతే కొడుకు పుల్లారావుకి ఉద్యోగం ఇచ్చారు. ఈమధ్యనే జాయినయ్యాడు.

ప్రతిరోజూ ఒక్కసారైనా రామనాధం పుల్లారావుమీద కేకలు వేస్తుంటాడు. అది సెక్షన్‌లో అందరికీ తెలుసు.

"ఏమయ్యా! పుల్లారావ్! ఇప్పుడా ఆఫీసుకి రావడం? టైమ్ ఎంతయింది?"

"బస్ మిస్సయింది సార్. పావుగంట లేటయింది''

"ఈరోజు పావుగంట లేటుగా వచ్చావు. రేపు గంట లేటుగా వస్తావు అంతేగా''

"లేదు సార్'

"ఏంలేదు. ఉద్యోగం ఇచ్చేదాకా ఆఫీసు చుట్టూ తిరిగావు. తీరా ఉద్యోగం ఇస్తే ఇదీ వరస. తేరగా వచ్చిందిగదా ఉద్యోగం. దాని

విలువ ఏం తెలుస్తుంది? ముప్పయివేలో, నలభైవేలో లంచం ఇచ్చివుంటే తెలిసేది'' రామనాథం మండిపడ్డాడు.

పుల్లారావు ఖిన్నుడయ్యాడు.

ప్రతి చిన్న విషయానికి రామనాథం తన మీద ఎందుకు విరుచుకుపడుతున్నాడో పుల్లారావుకి అంతుపట్టడంలేదు.

ఆఫీసులో ఇంకా అటెండర్లు వున్నారు.

కొందరు ఒక పూటంతా గైరుహాజరవుతారు.



మరొకడు తాగివచ్చి గొడవ చేస్తుంటాడు.

'అసలు పిలిస్తే పలకని వాళ్లున్నారు. వాళ్ళెవర్నీ ఏమీ అనడు. తననే ఎందుకిట్లా సతాయిస్తున్నాడు?' పుల్లారావు మధన పడసాగాడు.

సీనియర్ అటెండర్ రాజయ్య దగ్గర తన గోడు చెప్పుకున్నాడు పుల్లారావు.

"బాబాయ్! నువ్వు చూస్తున్నావుగా! చిన్న చిన్న వాటిని పట్టుకుని గొడవ చేస్తున్నాడు ఆ సెక్షన్ ఆఫీసర్. నా తప్పేంలేకపోయినా పనిగట్టుకుని కేకలేస్తున్నాడు. నన్నొక్కడినే ఎందుకిట్లా సతాయిస్తున్నాడు. నాకేం అర్థం కావడంలా''

రాజయ్య చిరునవ్వు నవ్వాడు.

జేబులోనుంచి బీడీతీసి వెలిగించాడు.

గుప్పుగుప్పున పొగ వదిలాడు.

"నేనంతా గమనిస్తూనే వున్నా. రామనాథం సంగతి నాకు బాగా తెలుసు. నీకు సలహా చెప్పాలని అనుకుంటున్నాగాని నువ్వు ఏమైనా అనుకుంటావేమోనని వూరుకున్నాను. అడగందే ఉచిత సలహా చెప్పడం నా పద్ధతి కాదు'' అన్నాడు రాజయ్య.

"అదేంటి బాబాయ్. నేను నీ కొడుకులాంటి వాడిని. నువ్వు చెప్తే నేను ఎందుకు వినను?" అన్నాడు పుల్లారావు.

"కొడుకులే నా మాట వినడంలేదు. ఈ రోజుల్లో ఒకరిమాట మరొకడు వినడని నాకు అనుభవపూర్వకంగా తెలుసు. మంచి మాటలు అసలు వినరు''

"ఇంతకీ నన్నేం చెయ్యమంటావు?"

"ఏంలేదు. నువ్వు చదువుకున్న కుర్రాడివి. మంచి మంచి పాలిస్టర్ బట్టలేసుకుంటున్నావు. టిప్‌టాప్‌గా బూట్లు వేసుకుని వస్తున్నావు. తనకింద పనిచేసేవాళ్లు అలా తనతోపాటు మంచి బట్టలు వేసుకుంటే సహించలేడు రామనాథం" చెప్పాడు రాజయ్య.

అసలు సంగతి అర్థమైంది పుల్లారావుకి.

మర్నాడు వెలిసిపోయిన చిరిగిన చొక్కా, అతుకుల ప్యాంటు వేసుకొచ్చాడు. కాళ్లకి హవాయి చెప్పులు.

ఆరోజు పుల్లారావు రామనాథాన్ని ఎగాదిగా చూశాడు. సంతృప్తి పడ్డాడు. తప్పులు చేసినా పన్నెత్తు మాటనలేదు. చెప్పిన పనిచేస్తే "వెరీ గుడ్. పుల్లారావు చాకులాంటి కుర్రాడోయ్!" అని మెచ్చుకుంటున్నాడు ఇప్పుడు.

-వాణిశ్రీ

# భేటీ పై సమీక్షలు



జూలై 'చతుర'లో ప్రచురితమైన తనికెళ్ళ కల్యాణి నవల 'భేటీ'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## వ్యక్తి వికాసం!

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

'పూను స్పర్ధను విద్యలందే' అని గురజాడ చెప్పిన మాటను పాజిటివ్ ప్రయోజనాలకు వర్తింపజేసినప్పుడు మాత్రమే ఎవరయినా అభివృద్ధి సాధించగలుగుతారు. వ్యక్తిగత శక్తి సామర్థ్యాలను వెలువరింపజేయడానికి, వ్యక్తి వికాసానికి తగిన చోదక శక్తిగా వినియోగపడటానికి 'పోటీ' ఉద్దేశించబడింది. అంతేగాని కృతిమ ఆధిక్యతను చూపుకోడానికి కపట మార్గాల నాశ్రయించడం పోటీల ఉద్దేశం కాదు. వ్యక్తుల వికాసానికి ఈనాటి ప్రైజులు గీటురాళ్లు కావు. మన చుట్టూ అలుముకున్న పోటీ వాతావరణంలో కొన్నిసార్లు కృత్రిమ విలువలదే పైచేయి అవుతుంది. తనికెళ్ల కల్యాణి నవలిక 'భేటీ'లో ఈ పరిస్థితులు కనిపిస్తాయి. పోటీలలో తన ప్రతిభను సంపూ

ర్ణంగా వికసింపజేసుకోవడం విద్యాధరి లక్ష్యమైతే, ప్రైజుల ద్వారా తనకు గొప్ప ప్రతిభను ఆపాదించుకోడానికి ఎమ్మెల్యే కూతురు రాణి ప్రయత్నిస్తుంది. అందుకే ప్రైజులు సంపాదించిపెట్టి ఆమెను తృప్తిపరచాలని రాణి తండ్రి, అన్న ప్రయత్నిస్తుంటారు.

బడి ఒక ఉపసమాజం. దానిలో క్రమపద్ధతి, నిజాయితీ లోపిస్తే పిల్లల మనసులు నిరుత్సాహపడతాయి. లోకంలోని మంచిపట్ల వారిలో అపనమ్మకం కలుగుతుంది. విద్యాధరి చదివిన 'పిచ్చిబడి'లోని మాస్టర్ల పక్షపాత వైఖరి, వారు పరీక్ష పేపర్లలో ప్రతిభావంతులైన విద్యార్థులను వంచించడంలోను, తమ వద్ద ప్రయివేటు చదివే పిల్లలకు ఎక్కువ మార్కులిచ్చి మభ్యపెట్టడంలోను కనిపిస్తుంది. పాటలు, ఉపన్యాసం వంటి పోటీల్లో సైతం ఎమ్మెల్యేగారి కూతురు రాణిని కావాలని ప్రైజులకు ఎంపిక చేయడం- వెన్నెముక లేని టీచర్లను పండితులను పట్టిస్తుంది. నిజాయితీ లోపించిన సాహిత్య, సంగీత సంస్థలు స్వప్రయోజనాలకే ఉపయోగపడతాయి. ఎమ్మెల్యే కొడుకు మాధవనాయుడు రమణిపై చేస్తున్న అత్యాచారాన్ని నిరోధించడానికి ప్రాణానికైనా తెగించి పోరాడిన టీచర్ గొంతు పోగొట్టుకొని మూగవాడయినాడు. మాధవనాయుడు చేసిన అత్యాచారం దానిని కప్పిపుచ్చుకోడానికి రమణిని హతమార్చడం కథలో అపరిష్కృతంగా మిగిలిపోయాయి. నవలిక చివరి భాగంలో తక్కువ పేజీలలో ఎక్కువ విషయాలు చెప్పే ప్రయత్నం జరిగింది. భువనేశ్వరి దేవి ఉదంతం కథ ప్రధాన లక్ష్యానికి అవసరంలేదు. ఇలాటివి ఒకటి రెండు తప్పిస్తే విద్యాధరి జీవితం చుట్టూతా, పోటీ ప్రపంచపు కృత్రిమత్వాన్ని పాఠకులలో ఆలోచనలు రేకెత్తించే విధంగా రచయిత్రి చిత్రించారు.

-ఎ. విజయలక్ష్మి
క్రిష్ణకాలని



## పెళ్లి ముగింపు కాదు

*(రెండవ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

ప్రయోజనాత్మక నవలలను అందించడంలో ఘనత వహించింది చతుర- ఆ స్థానాన్ని నిలుపుకునే తీరులో ప్రతిభా పాటవాలకి, పదవితో కూడిన ప్రాపకానికి మధ్య జరిగిన పోరాటం నేపథ్యంలో రాయబడిన జులై నెల నవల 'భేటీ' పేరుకు తగ్గట్టుగా వుంది. ఈనాటి విద్యా వ్యవస్థలో నెలకొని వున్న కుళ్లు, కుతంత్రాలవల్ల గురువే దైవంగా భావించే పసిహృదయాలపై చీడపురుగల దుష్ప్రభావం పడి రేపటి పౌరులుగా తయారుకావలసినవారు నిరాశ, నిస్పృహలకు గురవుతున్నారు. చివరికి వారు సంఘవిద్రోహులుగా మారే విషమస్థితికి దిగజార్చబడడం దురదృష్టకర పరిణామం. ఈ దిశలో "భేటీ" నవల ద్వారా రచయిత్రి చేసే ప్రయత్నం ముదావహం.

నవలలో విద్యాధరి పాత్ర ప్రతిభాపాటవాలకు ప్రతీక కాగా అందుకు భిన్నంగా అధికార భేషజాలకు ప్రతీకగా రాణి పాత్ర ఓ మచ్చుతునక. విద్యా- రాణి మధ్య పోటీతో నవల ఆరంభంనుంచి చివరవరకు అడుగడుగున వైవిధ్యంతో, సంఘర్షణకు తగ్గ సంఘటనలతో నవల చివరంటా హుందాగా సాగింది. విద్య తండ్రి సారధి ఆదర్శాల్ని ఆ వృత్తిని చేపట్టిన వారిలో కొందరైనా అలవర్చుకుంటే విద్యార్థి దశలో బలి అవుతున్న ఎంతోమంది ప్రతిభావంతులకు కొంతైనా న్యాయం చేకూరుతుంది.

స్వార్థప్రయోజనాలకో కీర్తికండూతితోనో తమ కార్యకలాపాలు కొనసాగే మార్గంలో స్థాపించబడే సాంస్కృతిక సంస్థలు, వాటి పనితీరుపై అక్కడ ఏర్పాటు చేసే కవితల పోటీలు, పాటల పోటీలలో శక్తిసామర్థ్యాలను పక్కకునెట్టి తమకు కావలసిన వారికే గుర్తింపు, బిరుదుల ప్రదానం, బహుమతులు వచ్చేవిధంగా వ్యవహరించడం వాస్తవంలో జరుగుతున్నదే. మంజీరలహరి సెక్రటరీ, అప్పలనాయుడు పాత్రలు సజీవమైనవి.

చివరిగా రాజశేఖరం, విద్య పెళ్లితో నవల ముగించడం చప్పగా వుందని చెప్పకతప్పదు. విద్య పాత్రను ఉన్నత శిఖరాలకు తీసుకువెళ్ళి ఒక్కసారి కిందకు తోసివేసినట్లుగా అన్పిస్తోంది. ఆమెకు ఎదురయ్యే సమస్యలు ఒకచోటనుంచి వేరొకచోటకు మారడంవల్ల చక్కబడటం యాదృచ్ఛికమే. కాని సమస్యలకు పరిష్కారం కాజాలదు. నవల ముగింపు విద్యచే రాణికి గుణపాఠం వచ్చేవిధంగా వుంటే మరింత ఆకట్టుకునేదేమో!

-పంతుల బాలసుబ్రమణ్యశర్మ
బొబ్బిలి

## మీగడ తరకలు

*(మూడవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

**జూలై** నెల "భేటీ" లో నేటి విద్యారంగంలో రాజకీయాల పాత్ర, తద్వారా 'ప్రతిభావంతులు' ఎలా తెరమరుగవుతున్నదీ చక్కగా చెప్పారు రచయిత్రి. అలాగే సాహితీ సంస్థలకుళ్లు, 'న్యాయనిర్ణేతల' పక్షపాతం కళ్లకు కట్టినట్లు చూపారు. ఎప్పటికైనా ప్రతిభే వెలుగుతుందనీ, దాన్ని ఆపాలనుకోవడం మూర్ఖత్వమనీ తేల్చారు. తన చదువు, లక్ష్యాలను గుర్తుపెట్టుకొని కష్టపడి, చదివి స్కూల్లోను, కాలేజీలోను 'ర్యాంకులు' సాధించిన విద్యాధరి ఈనాటి విద్యార్థులకు ఆదర్శప్రాయురాలు. అలాగే తెలివితేటలు, కష్టపడే మనస్తత్వమూ ఉండి కూడా యమ్.ఎల్.ఎ. కూతురు రాణి, రాజకీయపు అండదండలవల్ల ఎలా పతనదశ చివరి అంచుకు చేరిందో చెప్పారు. సారథిగారి పాత్ర కూడా నాకెంతో నచ్చింది. ప్రతి తండ్రీ తన పిల్లల 'సృజనాత్మకత'ను ఎలా వెలికితీయాలో వారి చదువుల్లోను, శీలం మెరుగుపరచడంలోను ఎలా తోడ్పడాలో బాగా రాశారు. సారథిగారు తనకి మాటపోయినా క్లిష్టపరిస్థితులు ఎదురైనా మొక్కవోని ధైర్యంతో ఎలా నిలిచారో... ఆ వివరణ బావుంది.

అక్కడక్కడ మీగడ తరకల్లా 'హాస్యం' బావుంది. అత్యాచార సన్నివేశంలో జరిగిన పెనుగులాట, మాధవనాయుడు చేసిన రేప్, తద్వారా సారధి మాటపోవడంవరకూ బావుంది. కానీ ఆ కేసు ఏమయ్యిందో... మాధవకి శిక్షపడిందో లేదో రచయిత్రి రాయలేదు.

విద్యార్థుల మధ్య ఉండే స్నేహం, భేషజాలు, ప్రేమలు, పౌరుషాలు బాగా వివరించారు. పిల్లల్ని అల్లారుముద్దుగా పెంచి వాళ్ల గొంతెమ్మ కోర్కెలు తీర్చాలనుకొనేవారు ఈ నవల చదివితీరాల్సిందే. పిల్లల పరీక్షపేపర్లు 'మాస్టారి' ప్రైవేటులో చదివే కుర్రవాళ్లు దిద్దడం, సాహిత్య పోటీలలో నిరుత్సాహకరమైన ప్రైజులు ఇవ్వడం వంటివి నిజంగానే జరుగుతున్నాయి. ఆడంబరంగా జరిగే సాహిత్య సంస్థల కార్యకలాపాలను రచయిత్రి ఎండగట్టారు. నవల చదివేటప్పుడు పాఠకుడు బాల్యంలోకి తన స్కూలు వాతావరణంలోకి తొంగిచూస్తాడు. రచయిత్రికి నా అభినందనలు.

-కె. శివసుబ్బారావు
గుడివాడ

## సజీవపాత్రల భేటీ

*(నాలుగవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

''**భేటీ**'' నవల ద్వారా సమాజంలోని పోటీని బాగా చెప్పగలిగారు రచయిత్రి తనికెళ్ళ కళ్యాణిగారు. ఇది ముఖ్యంగా అమ్మాయిల మధ్య రాజకీయ పోటీని చెప్పటంలో సఫలమయ్యింది. వినయానికి, ఒద్దికకి, తెలివికి దీటైన విద్య పాత్రలా నవలనడక కూడా మొదటి నుండి చివరిదాకా ఒడిదుడుకులు లేకుండా ప్రశాంతంగా సాగింది. పిల్లల పెరుగుదలపై తల్లిదండ్రుల ప్రవర్తన ఎలాంటి ప్రభావాన్ని చూపిస్తుందో బాగా వర్ణించగలిగారు రచయిత్రి. వారి వారి కుటుంబ వాతావరణాలను

బట్టి విద్య, రాణిల ప్రవర్తనలను చక్కగా చిత్రించి, 'ఏ గూటి చిలక ఆ గూటి పలుకులే పలుకుతుంద'న్న సామెతకు నిదర్శనంగా చూపించారు కళ్యాణిగారు.

కుటుంబం సమాజానికి ప్రతీక అన్నదాన్ని ఇందులో బాగా చెప్పారు. చిన్నప్పటినుండీ కళారంగాలలోనూ, ఇతర విషయాల్లోను మనిషి జీవితంలో అంతర్గతంగా రాజకీయాలు ఎలా పెనవేసుకుపోతాయో విద్యపాత్ర ద్వారా బాగా చెప్పారు. రాణి ఎలా ప్రవర్తించినా చివరికి తనకున్న తెలివిని చూపింది. ఈనాటి ఆడపిల్లలు ఏ రంగంలో ఉన్నా, ఎలా ఉన్నా వారికి తమ జీవితంపట్ల అవగాహనా, సమయస్ఫూర్తి ఉన్నాయనటానికి ఇది నిదర్శనం. విద్య ఎదుర్కొన్న పోటీలో ఆమె పొందిన మానసిక వేదన మనస్సును కదిలించేలా ఉంది. మొత్తానికి రచయిత్రి ఈనాడు ఎదుర్కోవాల్సిన ఒడిదుడుకులను గురించి బాగా తెలిపారు. ముఖ్యంగా చదువు విషయంలో ఇందులోని పాత్రలు నవలా పాత్రల్లాకాక సజీవ సమాజంలోని మనుషులకు ప్రతీకలుగా ఉన్నాయి. అందువల్ల నవల కూడా సజీవాకృతి దాల్చింది. కళ్యాణిగారికి అభినందనలు.

-ఎల్. అనసూయాదేవి
చంపాపేట

## జూలై నవల భేటీ

*(ఐదవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

"**మ**తాన్నీ, రాజకీయాన్నీ వేరుచేయలేం" అని అన్నాడో నాయకుడు. కాని రాజకీయాన్ని కేవలం మతంనుండే కాదు, ఇతర అంశాల నుండి కూడా వేరు చేయలేం అనే విషయాన్ని సుస్పష్టంగా వివరించారు రచయిత్రి.

లేలేత ప్రాయంలో పిల్లలందరూ బడిలో కలసికట్టుగా ఉంటూ బాల్యం యొక్క మధుర సమయాన్ని, అలౌలిక ఆనందంతో, సుమధుర మధురంగా గడిపేయాల్సిందిపోయి, భేషజంతో తారతమ్యాల సరిహద్దులు గీసుకుంటూ గ్రూపులుగా విడిపోయి వైషమ్యాలు పెంచుకోవడం ఎంత దురదృష్టకరం. తల్లిదండ్రులు తమ హెూదాలను పిల్లలకు ఆపాదించడంవల్ల వచ్చిన అనారోగ్యకరమైన పరిస్థితి ఇది.

తల్లీ, తండ్రి తరువాత పూజ్యనీయుడు గురువు. అలాంటి గురువే డబ్బుకోసం పిల్లలను బలవంతంగా ట్యూషన్లకు రప్పించుకుంటూ, ట్యూషన్లకు రానివారిని పాఠశాలలో అణగద్రొక్కడం ఎంత ఘోరమైన విషయం. పలుకుబడికోసం ఇతరుల మెప్పుకోసం తన 'శీలా'న్ని తాకట్టుపెట్టే సత్యం మాష్టారు లాంటివారు గౌరవప్రదమైన ఉపాధ్యాయవృత్తికే కళంకం.

హేతువు చెప్పేవాళ్ళందరినీ శత్రువులుగా భావిస్తూ జల్సాగా తిరిగే యువతరం, తరువాతికాలంలో ఎలా బాధపడతారోననే దానికి మురళి పాత్ర తార్కాణం.

రాజకీయ నాయకుడనేవాడు తన పలుకుబడిలో ఎలాంటి పనులు చేయించుకోగలడో దానివల్ల ఇతరులు ఎలా బాధపడతారో చక్కగా వివరించారు. కాని నవలలో పదేపదే క్విజ్‌పోటీలు, పాటల పోటీలు అంటూ చికాకును కలిగించారు. అదేదో వేరే అంశాలపై కలాన్ని ఝుళిపిస్తే బాగుండేది.

ఏది ఏమైనా 'విద్యాధరి' పాత్రను విద్యార్థులు, 'సారథి' పాత్రను తల్లిదండ్రులు ఆదర్శంగా తీసుకొనేవిధంగా మలచడంలో రచయిత్రి కృతకృత్యురాలయిందనడంలో సందేహంలేదు.

-బొమ్మెన శ్రీనివాసరావు
తిలక్‌నగర్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

